తప్పక చూడండి!

బ్రహ్మచారి జీవితాన్నే
మార్చేసిన
ఒక్కటంటే ఒక్క



పద్మశ్రీ
అక్కినేని నాగేశ్వరరావు
నటించిన



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

# బ్రహ్మచారి

నిర్మాత: ఎ.వి.సుబ్బారావు

దర్శకుడు: తాతినేని రామారావు

నవయుగ

      

# ఉత్తరాలు

## సవరణ

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1—3—68 సంచికలోని సినిమా శీర్షిక (57వ పేజీ) లో సావిత్రిగాయని వసంత వివాహం మార్చి 21వ తేదీన జరిగినదని పొరపాటున ప్రచురించ బడింది. ఫిబ్రవరి 21న వివాహం జరిగినదని పాఠకులు గమనించ కోరుతున్నాము. పొరపాటుకి చింతిస్తున్నాము. —సం.

## కథలు

''బాలామణి'' శీర్షికగల కథ చాలా బాగా చిత్రించ బడింది. అందులోనూ సుందరాచారి—శాస్త్రులు గారి—చరిత్ర చిత్రణ చక్కగా నిగుడుతుందంటే అతిశయోక్తికాదు. అందమునకు అందం, భక్తి యుక్తులు గల భార్యలాగుంటే ''బాలామణి'' ఎవరి ఆ అలవాటుని అబ్బాయినాయుడుగారి పరీక్ష ఎంతవరకు పనిచేస్తుందో చూడాలనుకుంటే వీరారు 'సశేషం' అని తెంపేశారు! వచ్చే వారం చదువుతాకా? రచయిత శ్రీ సదానందగార్కి, మా ధన్యవాదాలు చెప్పండేం?

పరడ అప్పలనాయుడు (దొంకివలసగ్రామం)

1—3—68 సంచిక నిజంగ విశిష్ట ప్రత్యేక సంచికలాగవుంది. కథలు సహజంగను, వాస్తవికత గాను, ఆదర్శవంతంగాను వున్నాయి. చాలీచాలని జీతంతో, మోయలేని బాధ్యతలతో, తీరని కోరికలతో సతమతమౌతున్నా బొమ్మలాగ పనిచేసేవారికి ''మనిషి బొమ్మ'' లోని గోపాలం పాత్ర చక్కని ఉదాహరణం తంగా వుంటుంది. ''యాత్రికులు'' కథలో జక రయ్య జీవితం చదువుతూంటే చాలా బాధ, జాలి కలిగాయి. ఈసంచికలోని కార్టూన్లు అన్నీ బాగుండి నవ్వును కలిగించడం మరో విశేషం. రచయిత్రి (త్రి) లకు, కార్టూనిస్టులకు, ప్రచురించిన మీకు నా అభినందనలు.

సమయమంతుల సత్యనారాయణ (పిఠాపురం)

* * *

బాధలు, కష్టాలు, కర్తవ్యాల మధ్య 'మనిషి' కేవలం ప్రాణం లేని 'బొమ్మ' ఆ బొమ్మకు ప్రాణం పోయాలంటే అమృతం లాంటి ప్రేమ జల్లు అతని హృదయ భూమిపై ఎల్లప్పుడు పడుతు ఉంటే కన్నీళ్లకు 'ఆ బొమ్మకు ప్రాణం వచ్చి ఎంత నవ్వుగా మారుతుందంటే ఆ పచ్చదనం ఈ ప్రపంచంలోని ఏమనిషికీ లభించదు. అనే చక్కని అభిప్రాయం మీరు 1—3—68 సంచికలో ప్రచురించిన 'మనిషి బొమ్మ' అనే కథను చదివిన డంపిల్ల కల్గుతుంది. ఇంత చక్కని కథను రచించినందుకు శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం గార్కి ఆశీస్సులు.

వి. వి. స్వామి, (కరీంనగరము)



## సీరియల్ నవలలు

శ్రీమతి అచ్యుతవల్లిగారు వ్రాస్తున్న 'మూడుముళ్ళు' నవలా కథనము ఇలా సాగిందా! సరస టముగు ముదావహము. పాత్ర పోషణలలో ఎక్కడ వెలితిలేకుండా పట్టుగా ఉత్సాహజనితముగా నడుచుట శ్లాఘనీయము. ఆధునిక ఉత్తమ నవలా శ్రేణిలో 'మూడుముళ్ళు' రావచ్చు అనటములో అతిశయోక్తి లేదు. ఒక పాఠకులు, జగ్గు 10 సంవత్సరముల వయస్సులో సెకండు ఫారము చదువుట చిన్న పొరపాటు అని సూచించారు. అది సామాన్యము కాదేమో కాని అసంభవము మాత్రము కాదు. మా అమ్మాయి, నా ధిలికి 10 సం.ల వయస్సు, 7 వ తరగతి చదువుతోంది.

జి. ఎల్. సి. (హన్మకొండ)

* * *

శ్రీమతి అచ్యుతవల్లి గారి సీరియల్ ''మూడు ముళ్ళు'' బాగ నేటంది. కాని చిన్న సందేహం మన తెలుగు దేశంలో వివాహితులను వెగిం గా పోల్చుకో వచ్చు. (అంటే మగవారిని కాదనుకుంటే, వివాహ చిహ్నం ప్రతి ఆడవారికీ ఏదో ఒకటి ఉంటుంది. అలాంటిది రచయిత అయిన మాధవ కామేశ్వరిని పోల్చుకోలేక పోవడం ఆశ్చర్యంగా ఉంది. ఇంతకీ మాధవ పసిపిల్లవాడు కాదుగదా వివాహితో, అవివాహితో పోల్చుకోలేక పోవడానికి, దూరంగ కాకుండా దగ్గరగా కామేశ్వరిని చాలాసార్లు మాధవ చూశాడు కదా? కేశవ భార్యఅని మాధవకి తెలియకపోయినా కామేశ్వరి వివాహితేకదా?

ఒక్కొక్కసారి పై ముఖచిత్రం ఎలా ఉన్నా లోపల చక్కటి కథలు, సీరియల్సు, చాలాబాగుంటున్నాయి.

శ్రీమతి ఎమ్. వి. లక్ష్మీఆనంద్
(బేక్‌పూర్)

* * *

'జీవనరాగం', 'మూడుముళ్ళు' చాలా ఆసక్తితో చదువుతున్నాను.

ఈవారం 1—3—68 'జీవనరాగం' సీరియల్ చదువుతూ ఆఖరున 'అయిపోయింది.' అని చదివి చాలా నిరాశ చెందాను. ఇంత త్వరలో సమాప్తమౌతుందని అనుకోలేదు.

సుధ అన్నమాటలకు విలువనిచ్చి నిరంజనం సుధ మాధులను విడిచి వెళ్లటం అంత సమంజసంగా లేదేమోనని అభిప్రాయం పడుతున్నాను.

సుధే స్వయంగ వచ్చి నిరంజనాన్ని క్షమించమని అడిగి ఉంటే బాగా ఉండేది. కనీసం సుధ గట్టిగా పట్టుబట్టి నిరంజనాన్ని వెళ్లకుండా చేస్తే బాగా ఉండేది. ఏది ఏమైనా, నవల ఆద్యంతం చదువరులను ఆకట్టుకొనేటు చేసిన రచయిత్రి అభినందనీయురాలు.

పాండురంగారావు, (గుంటూరు)

* * *

''మూడుముళ్ళు'' సీరియల్‌లో కామేశ్వరి పాత్ర చాల దయనీయంగా వుంది. నళిని ఎంత అహంకారం వున్న మనిషి అయినప్పటికి ఉన్నతస్థానంలో వున్న కామేశ్వరిని పెంపెట్టి —లుమాట ఎట్లాగా

పై వారమే మొదలు!

సరికొత్త శీర్షిక

ఆవేశాలూ-

అపరాధాలూ

దేశాన్ని దద్దరిల్లింపచేసిన నేరాల గాథలు!


ఇప్పటికే నువ్వు బీదవాడివి. తపాలా రేట్లు పెంచ దుందావరా నేను మరికొంత తలేసుకున్నా నువ్వు చెడిపోయేది లేదు
సామాన్య మానవుడు


హా, వాళ్ళని వాళ్ళే నాశనం చేసుకోనీ
రక్షణకి 1015 కోట్లు ఇండియా ఖర్చు చేస్తుంది


కాదు
ఇందిరతో
కామరాజు


వీళ్ళందరినీ మీరు తీసుకోండి
కెనాన్ పంపిన బ్రిటిష్
భారతీయులు

# దేశభక్తిని ఓడించిన ధనాశ!

బ్రిటన్‌కి కొత్తగా వలస వెళ్లే వారి సంఖ్యని అరికట్టేందుకని ఆ దేశం అమలుపరుస్తున్న చట్టం గురించి ఇక్కడ పెద్ద ఆందోళన చేస్తున్నారు. దేశభక్తులయిన భారతీయులు కొందరిని కెన్యా ప్రభుత్వం వెళ్లగొట్టగా వారు బ్రిటన్‌లో స్థిరపడి పోదామనుకుంటున్నారు. కాబట్టి ఈ చట్టం తయారవుతోంది. ఎక్కడా కాలు పెట్టని మంత్రి శ్రీ బలిరామ్ భగత్ బ్రిటిష్ హైకమిషనర్‌ని పిలిచి బ్రిటిషు పార్లమెంటు ఈ బిల్లుని గనుక ఆమోదిస్తే భారత—బ్రిటన్ మధ్య సంబంధ బాంధవ్యాలు దెబ్బ తినవచ్చుననీ, భారతదేశం 'ప్రతీకారం'గా కొన్ని చర్యలు తీసుకొనే అవసరం రావచ్చుననీ చెప్పారుట. ఈ 'ప్రతీకార చర్య' లేమిటో తెలుపలేదు.

అధికార ప్రతినిధి కూడా ఈ చట్టం జాతి వివక్షణ మీద ఆధారపడినది అన్నారు. ఈ సమస్యని పరిశీలించటం అవసరం.

### దేశభక్తులు

ఎవరికీ అక్కరకురాని ఈ తూర్పు ఆఫ్రికా భారతీయులు ఎవరు? వారిలో 95 శాతం గుజరాతీవారు, మహాత్మాగాంధీ రాష్ట్రం నుంచి వచ్చినవారు. గాంధీ సిద్ధాంతాల మీద తమ అభిమానం చూపటానికి వారు ఒక ఆఫ్రికా దేశం పౌరసత్వమూ తీసుకోనలేదు, భారతదేశపు పౌరసత్వమూ తీసుకోనలేదు. బ్రిటిషు పాస్‌పోర్టులు తీసుకున్నారు

ఇన్ని సంవత్సరాలు తమకి అన్ని విధాలా లాభదాయకంగా ఉన్న తూర్పు ఆఫ్రికా పౌరులుగా ఉండటానికి ఈ పెద్దమనుషులు ఎందుకు ఇష్టపడలేదు? ఈ ప్రశ్నకి శ్రీ బలిరామ్ భగత్‌గారి అధికార ప్రతినిధిగాని సమాధానం చెప్పగలరా?

పోనీ భారతదేశానికి ఎందుకు రాలేదు? వారి వాణిజ్యాలూ, విదేశ ద్రవ్యమూ మనకి కావాలికదా?

నిజం చెప్పాలంటే, ధనాశ దేశభక్తిని ఓడించింది.

### విదేశాభిమానం

కెన్యాని పాలించిన దేశం మీదనే ఉంది వారి దృష్టి అంతా. బ్రిటిషు పాస్‌పోర్టులు ఉంటే లాభం ఎక్కువ అని వారి ఉద్దేశం. భారతదేశం ప్రజలు కాదలచుకున్నవారు విదేశాలలో తమ ఆస్తి వివరాలన్నీ బయటపెట్టాలి. ఈ దేశభక్తుల కోసమే మన ప్రభుత్వం కామన్వెల్తు నిలకడ చెడగొడ్తానని బెదిరిస్తోంది.

### జాతివివక్ష

ఇక జాతి వివక్షణ సంగతి. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క పేరు దీనికి. భారతదేశంలో దీనినే దేశభక్తి అంటారు. పది సంవత్సరాల క్రితం కామర్సు మంత్రిశాఖ వారు భారతదేశంలోని విదేశ సంస్థలలోని విదేశోద్యోగుల సంఖ్య గురించి ఒక ఉద్యమం లేవతీసింది. ఏటా విదేశీయుల సంఖ్య తగ్గించి భారతీయులనే ఖాళీలలో వేసి ప్రభుత్వానికి ఈ వివరాలన్నీ ఇవ్వాలని ప్రభుత్వంవారు శాసించారు. ఈ విధానం క్రయిస్తవ మిషన్లకి కూడా వర్తిస్తుందన్నారు. ఫిబ్రవరి 23 వ తేదీ దేశీయ వ్యవహారాలశాఖ మంత్రి పార్లమెంటులో అన్నారు, 'భారతదేశంలోని క్రయిస్తవ మిషన్లలో భారతీయుల సంఖ్యని అధికం చెయ్యటమే ప్రభుత్వం విధానం' అని. 'చివరికి అందరూ భారతీయులే ఉండాలని ఈ విధానం ఉద్దేశం' అని కూడా అన్నారు. అంటే ఆసుపత్రులు, పాఠశాలలు, కళాశాలలు, కుష్ఠురోగుల ఆశ్రమాలు మొదలయినవాటిలో పనులుచేసే విదేశ మిషనరీల నందరినీ గెంటివేసి భారతీయులకి పని కలిపించాలన్నమాట. ఒక ఉదాహరణ చెప్తాను— ఒక బ్రిటిషు వ్యక్తి మహమ్మదీయమతం



'హైదరాబాద్‌లోని అమెరికన్ స్టడీస్ రిసర్చ్ సెంటర్ అమెరికన్ చరిత్ర, సాహిత్య విషయాల ఫెలోషిప్ కార్యక్రమంలో ఉపాధ్యాయులకి విషయ సేకరణకి దోహదం చేస్తుంది' మద్రాసు విశ్వవిద్యాలయ కళాశాల లెక్చరర్ శ్రీ సి. సుబ్రహ్మణ్యన్, మైసూర్ మహారాజా కాలేజ్ ఇంగ్లీష్ ప్రొఫెసర్ శ్రీ ఎస్. వి. [illegible]

గాని, సిక్కు మతంగాని పుచ్చుకుని భారతీయుడికి ఉద్యోగం దొరకకుండ చేస్తే? అది ఏమవుతుంది?

బ్రిటన్‌లో భారతీయ వైద్యుల బదులు బ్రిటిష్ వైద్యులే ఉండాలని అక్కడి వారు కోరుకుంటే!

**కొత్త పేరు**

మనం విదేశీ రాక్షసులని తిరమటం దేశభక్తి. ఇతరులు ఆ పనిచేస్తే జాతి విచక్షణ.

ఇంకొక సంగతి గమనించాలి. భారత దేశం పరువుమాట ఏమిటి? సంవత్సరానికి 16000 మంది భారతీయులు బ్రిటన్‌కి వలస వెడుతున్నారు. వారు మనదేశానికి తీసుకువస్తున్న అపకీర్తిని గురించి శ్రీ భగత్ ఆలోచించారా?

బ్రిటన్‌లో భారతీయుల జీవితవిధానాన్ని మీ విలేఖరి చూశాడు. చూసి సిగ్గుపడ్డాడు. వీరందరూ ఎక్కడ ఉన్నా ఇంగ్లిష్–స్తాన్ బదులు మురికి–స్తాన్ ఏర్పరుస్తున్నారు.

ప్రపంచంలో ఎక్కడికి వెళ్ళినా భారతీయులని తరిమివేస్తున్నారు. ఎందుకు? సింగపూర్, మలయా, ఫీజీల వంతు ఎప్పుడు?

* * *

పెరల్ హార్బర్‌లో జరిగిన తంతే ఇప్పుడు హిందీ ఉద్యమంలోనూ జరుగుతోంది. ప్రధానమంత్రి, కాంగ్రెసు అధ్యక్షుడు, రాష్ట్రపతి హిందీ వర్గంవారు జాతీయాభిప్రాయ సేకరణ గురించి ఏదో శుష్కవాదం పెంచుతూ ఉంటే హిందీ దురభిమానులు తమ జైత్రయాత్రని సాగిస్తున్నారు. పార్లమెంటులో జరిగిన ఈ కింది ఉత్తరప్రత్యుత్తరాలని గమనించవచ్చు—

**ధోరణులు**

శ్రీ ప్రకాశవీరశాస్త్రి – (అ) పార్లమెంటులో ముఖ్యమయిన బిల్లుని హిందీలోనే ప్రవేశపెట్టే నిర్ణయం ఏదయినా తీసుకొనటం జరిగిందా?

ఆ) జరగకపోతే దానికి కారణాలేమిటి?

శ్రీ లోబో ప్రభు– (అ) కేంద్ర కార్యదర్శి కార్యాలయంలో హిందీలో 'నోటింగ్' జరిగే ఫయిళ్ళ శాతం ఏ మాత్రం?

ఆ) ఆర్డర్లు పాస్ అయ్యేదశా జరిగే నోటింగ్‌ల శాతం ఎంత?

ఇ) హిందీ రాని మంత్రుల, ఆఫీసర్లకి ఈ సందర్భంలో ఏర్పరిచే సౌకర్యాలు ఏవి?

ఈ) ఉత్తరాలూ, ప్రత్యుత్తరాలూ— వీటి హిందీ శాతాలు ఏ మాత్రం ఉన్నాయి?

ఎ) హిందీలో 'నోటింగ్' సరిగ్గా జరగక పోవటానికి ఆ భాష రాకపోటం కారణం అయితే ఎందరు ఉద్యోగులని 'మార్పించా'లి? ఇలా 'మారిన' వారి సంగతి ఏమిటి?

శ్రీ రఘువీరసింగ్‌శాస్త్రి– అ) వివిధ కంపెనీలు, కార్పొరేషన్లు 15–1–1968 తర్వాత ఇంగ్లీషులో పంపిన సర్క్యులర్ల సంఖ్య ఎంత? ఆ) అవి హిందీలో వెలువడక పోవటానికి కారణాలు?

శ్రీ మృత్యుంజయ ప్రసాద్–అ) కేంద్ర ప్రభుత్వంలో వివిధశాఖలలో వివిధ వర్గాల ఉద్యోగుల సంఖ్యలు ఏమిటి?

ఆ) హిందీ మాట్లాడేవారి సంఖ్య ఏమిటి? ఉద్యోగంలో చేరక ముందు హిందీ వచ్చిన వారి సంఖ్య ఏమిటి?

ఇ) హిందీ శిక్షణ అవకాశాలని సద్వినియోగం చేసిన హిందీ–ఇతరుల సంఖ్య ఏ మాత్రం?

ఈ) 1–1–1968 నాడు ఈశిక్షణ పొందుతున్న వారిసంఖ్య ఏమాత్రం?

ఉ) ఏటా హిందీ శిక్షణ పొందుతున్న వారిసంఖ్య ఏమిటి?

ఎ) హిందీశిక్షణ ప్రోత్సాహానికి ఏమి సదుపాయాలు లభిస్తున్నాయి? అవి ఏమేమిటి?

శ్రీ చెంగల్వరాయనాయుడు–అ) హిందీ ఇతర ప్రాంతంలోనివారికి ప్రభుత్వం ఉత్తరాలద్వారా శిక్షణ ఏర్పాట్లు చేస్తున్నదా? విదేశాలలో వారిసంగతి ఏమిటి?

ఆ) ఎప్పటినుంచి?

శ్రీ వాల్మీకి చవుదరి–అ) విదేశాలలో భారత రాయబారవర్గాలలో హిందీ జ్ఞానం ఉన్నవారి శాతం ఏమిటి?

ఆ) ఇతరదేశాలలో హిందీ ప్రచారాల రాయబారవర్గాలు చేస్తున్న కృషి ఏమిటి?

శ్రీ తులసీదాసు యాదవ్–అ) విదేశాలలో ఉన్న భారత రాయబారవర్గాలలో హిందీలో పని జరిగేందుకు చేసినఏర్పాట్లు ఏమిటి?

ఆ) విదేశ రాయబారవర్గాల, భారత ప్రభుత్వం మధ్య జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలు మన అధికారభాషలో జరిపేందుకు చేస్తున్న ప్రయత్నాలు ఏమిటి?

ఇ) ఈ రాయబార వర్గాలలో హిందీలో పని జరిగేందుకు ఉద్యోగులని, అధికారులని నియమిస్తున్నారా? వారి సంఖ్య ఏమిటి? ఒక్కొక్క రాయబార వర్గంలోనూ హిందీ టయిపురయిటర్ల సంఖ్య ఎంత? గ్రంథాలయాల మాట ఏమిటి? తక్కిన భాషలతో పోలిస్తే భారతీయ భాషలలో వెలువడే పత్రికలు వారికి ఏ మాత్రం అందుతున్నాయి?

శ్రీ ఎం. పి. భార్గవ–అ)అన్ని విదేశాలలోనూ ఉత్తరప్రత్యుత్తరాలు ఇంగ్లీషులోనే జరుగుతున్నాయా?

ఆ) అన్ని దేశాల నుంచీ భారత ప్రభుత్వానికి హిందీలోనే జవాబులు వస్తున్నాయా?

ఇ) కాకపోతే ఏ భాషలలో విదేశాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి?

**సమ్మకాలు**

అధికార భాషా తీర్మానం వద్దన్నందుకు శ్రీ కామరాజ్ ప్రభృతులను బయటికి తోసేశారు. శ్రీమతి గాంధీ ఇంతలో కొత్త పాట పాడటం ప్రారంభించారు. ఇన్ని ప్రాంతీయ వైవిధ్యాలు కల హిందీయే ఒక కొత్త భాష అంటున్నారు. అంటే, ఎన్నో జాతులు కల హైందవులు ఒక జాతివారు కారన్నమాట.

హిందీ–ఇతర ప్రాంతాలవారి పరిస్థితి బాగాలేదు. ఈ స్కీమ్ అమలు పరిచే బాధ్యత హిందీ వారిది, ప్రత్యేకంగా దేశీయ వ్యవహారాల శాఖది. తమిళనాడు నుంచి కేంద్ర ప్రభుత్వంలో కాబినెట్ మంత్రి లేడు. ఆంధ్ర, మయిసూరు ప్రతినిధులు పలుకుబడిలేని 'మేమూ ఉన్నాం' రకం వారు. పార్లమెంటులో వేసిన ప్రశ్నలనిపట్టి, ఇతర విషయాలని పట్టి చూస్తే దక్షిణాదివారి సంగతి పట్టించుకోకుండా తమకి కావలసింది తాము చేసుకుంటున్నారు హిందీవారు అని తోస్తుంది. 'అల్లరి తగ్గి తమిళనాడుకూడా తక్కినవారిలాగే హిందీని స్వీకరిస్తుంది' అనుకుంటున్నారు. ●

# ఆచార్యుని అసభ్యప్రవర్తన-విద్యార్థుల నినాదాలు

అన్నామలై యూనివర్సిటీలో ప్రొఫెసరు రామనాథన్ చెట్టియార్ అనే ఆయన ఒక విద్యార్థినితో అసభ్యంగా ప్రవర్తించారట! తోటి విద్యార్థులు, విద్యార్థినులు ఆయనపై చర్య తీసుకోవాలని నినాదాలు చేశారట. సిండికేట్ సమావేశంలో ఈ విషయం విచారించి తగు విధంగా విరమింపజేస్తామని పై ప్రొఫెసర్ వారికి హామీ ఇచ్చారట— విద్యార్థినికి విద్యాసంస్థలో రక్షణ లేనప్పుడో [illegible]



## 'బెంగుట్టువన్ సేన'

'స్వతంత్ర తమిళనాడు' అని ఓ గీతంపాడి ఓ స్వతంత్ర తమిళనాడు అని ఎర్రటి అక్షరాలు రాసివున్న జెండాను ఎగురవేసి, మీటింగు పెట్టిన కారణాన్న పోలీసులు హిందీ వ్యతిరేక విద్యార్థులను కొంతమందిని అరెస్టు చేశారట. వీరు తమ సేనకు 'బెంగుట్టువన్ సేన' అని పేరు పెట్టుకున్నారట.

## అరగంట బోగీని ఆపడానికి రు. 400

దీనదయాళ్ ఉపాధ్యాయ ప్రయాణం చేస్తున్న బోగీని ఓ అరగంట సేపు ఆపమని తనకు (ఫిబ్రవరి రాత్రి 11 గంటలకు) ఎవరో (!) నాలుగు వందలిచ్చారని మొగల్ సరాయి స్టేషను పోర్టర్ పోలీసులకు చెప్పాడట. ఇంకా ఆయన హత్యకేసు ఓ దరికి రాలేదు.

* * *

దక్షిణ ఢిల్లీలో రామకృష్ణ పురానికి దగ్గర ఒక్క గ్రామంలో ఒక ఇల్లు కూలి పద్నాలుగుమంది పిల్లలు చనిపోయారట. వీరంతా 13 ఏళ్లలోపు వారేనట— ఇది 21న జరిగింది.

## ఇండియాలో గుండె మార్పిడి

భారతదేశంలో మొట్టమొదట (ప్రపంచంలో ఆరోది) గుండె మార్పిడి మొన్న బొంబాయిలో డాక్టరు సెన్ ఆధ్వర్యాన జరిగింది. రైలులోంచి పడి, తలకు గాయాలై "ఇ. యు మెన్స్" ఆస్పత్రిలో చేరిన ఒకామె అక్కడ చనిపోతే ఆమె గుండెతీసి ఒకతనికి అమర్చారట. అర్ధరాత్రినుంచి

## మహీధరోక్తులు

మహీధర నళినీమోహనరావు



తోడబుట్టువనును తొలి యుత్తరంబులో
మరల వ్రాయునపుడు మరదలనును
కలము స్నేహమెల్ల కామ సంతృప్తికే
హృదయవర్తి యీ మహీధరోక్తి



# పాతనాగలి స్థానే ట్రాక్టర్

అవును, ఇతర ఉపకరణములు కూడా. ఇంకా దొంపంటి ఎరువులు మరియు విత్తనములు. వ్యవసాయమును ఆధునిక మొనర్చుటకు, పంటలవృద్ధికి మరియు దానిని ఇతర అర్థికరంగముల కనుగుణ్యంగా నుంచే నిమిత్తం రైతుకు ఇవన్నియు కావలెను

విరివిగా వ్యాపించియున్న కార్యాలయముల ద్వారా వ్యవసాయాభివృద్ధికి, భూముల శ్రేయస్సుకు, నీటి సరఫరా సౌకర్యములకు మరియు యంత్ర సహాయముల నిమిత్తం స్టేట్ బ్యాంక్ ధనసహాయము చేయుచున్నది. తోటపనులు, విత్తనాలు తల్లేవారు మళ్ల, పశుసమృద్ధి కృషి, పాడి ఉత్పత్తి కృషి, కోళ్ల పెంపు, చేపల పెంపు కృషి మరియు పండ్ల తోటలు, వీటికి కూడా బ్యాంకు ధనసహాయము చేయును

## స్టేట్ బ్యాంక్ సేవ నిమిత్తం.



# మొసలి అనుకుని భార్యను చంపిన భర్త!

భార్యను చంపిన నేరస్థుని విచారణ లీడ్స్ అసైజులో జరుగుతున్నది:

'నేను చంపినది నా భార్యను కాదు' అన్నాడు నిందితుడు విచారణలో. 'మొసలిని చంపాను' అన్నాడు. మరి కొంతసేపటి తరువాత 'స్నానాల గదిలో పామును చంపాను' అన్నాడు. ఇంకా కొంచెంసేపటి తరువాత 'నా చొక్కా మీది ఎర్రచీమలను చంపాను' అన్నాడు.

నిందితుని పేరు రాబర్ట్ స్టాకర్. వయస్సు 22 సంవత్సరాలు. అతని భార్య జెన్నిఫర్ వయస్సు 21 సంవత్సరాలు. ఇంటికి వెళ్లి కాఫీ తాగాడు ఒకరోజు — అనేక రకాల భ్రమలు ప్రారంభమయినవి. ఆ భ్రమలలో తన భార్యను చంపినని స్టాకర్ చెప్పాడు.

భార్య ఒక మొసలివలె కనిపించినదట. నచ్చళ్ల జాడీతో 'మొసలి అనుకుని ఆమె తలను పచ్చడి పచ్చడి చేశాను.'

'కాఫీ తాగ్గానే చెవులలో హోరు ప్రారంభమయింది. నన్ను పడేయ్యడానికి మేడమెట్లు కదలాడుతున్నట్లనిపించినది' అన్నాడు. ఇంకా యిలా చెప్పాడు: 'తల తిరగడం ప్రారంభమయినది. గది ముందుకు పోయినది. మళ్లీ పెద్దదయినది. రంగుల దీపాలు కనపడినవి. అట్లా అరుస్తావెందుకూ? అన్నది మా ఆవిడ— దాన్ని నా దగ్గరకు రానియ్యకు అన్నానని చెప్పినది.

'ఠణగణ ధ్వని రేడియోలోనుంచి వస్తున్నదనిపించింది. రేడియోను ముక్కలు ముక్కలు చేసేశాను.

'టెలివిజన్ పెట్టెమీది నగలవంటి వన్నీ నాట్యం చేస్తున్నవనిపించింది. అవన్నీ నా మీద పడనున్నవన్న నమ్మకం కలిగి వాటన్నింటినీ కిందపడేశాను.

'అంతలో చేతిలో కత్తితో మా ఆవిడ నా దగ్గరకు రావడం కనిపించినది. అంతలోనే ఆమె రూపం మారిపోయి సైకో చిత్రంలోని ఒక పాత్రవలె కనిపించింది. కత్తితో నా మీదకు దూకింది. కాని గురి తప్పిపోయినది. ముంజేతులను పట్టుకున్నాను ఎట్లాగయితేనేం.

'ఆ తరువాత స్నానాల గదికి పరుగెత్తాను. తలుపు మీద పెద్ద పాము కనిపించినది. దాన్ని వంట యింట్లో మా ఆవిడ మీదకు విసరేశాను.

'ఆటు తరువాత మరొక పెనుగులాట జరిగినది. మా ఆవిడ నా పొట్ట మీద తాడించినది. స్పృహ తప్పి పడిపోయినాను. స్పృహ తెలిసేటప్పటికి నా భార్య వెలికిలా పడుకుని ఉన్నది. ఆమె తల మీద మొసలి వంటిదేదో కనిపించింది. పచ్చళ్ల జాడీతో ఆ మొసలిని చంపడానికి యత్నించాను.'

'నీ ఆవిడనే తలమీద కొడుతున్నానని భావమేమయినా అప్పుడు నీకు కలిగినదా?' అని న్యాయవాది ప్రశ్నించగా 'లేదు' అని స్టాకర్ చెప్పాడు.

ఇంతకూ ఇదంతా 'ఎల్. ఎస్. డి' అనే మాత్ర చేసిన మత్తు తమాషా. స్టాకర్ తాగిన కాఫీలో ఆ మాత్ర కలిసింది.

## ప్రేయసి కోపం

### కారులో బాంబు పెట్టిన ప్రియుడు

ఇంజనీర్ రాబర్ట్ గారెట్ వయస్సు 34 సంవత్సరాలు — ఒక గృహిణిని ప్రేమించాడు. ఆమెను లేవతీసుకుపోవాలనే కోరిక ఎక్కువయింది. ఆమె భర్త ఆఫీసునుంచి తిరిగివచ్చే మోటారుకారులో బాంబు పెట్టాడు. బాంబు పేలింది. కాని, ప్రియురాలి భర్త రోనాల్డ్ నవర్స్ మరణించలేదు. గాయపడ్డాడు.

రాబర్ట్ గారెట్ ప్రేమించిన గృహిణి పేరు శ్రీమతి బార్బరా నవర్స్—తనతో వచ్చేయమని అంతకుముందు రెండుసార్లు ఆమెను బతిమాలాడు. ఈ సంఘటన జరక్కముందు రెండు సంవత్సరాలు ఈ కుటుంబాల మధ్య రాకపోకలున్నవి.

ప్రియుడుతో లేచిపోదామనే శ్రీమతి బార్బరా నవర్స్ తొలుత అనుకున్నది. కాని, తరువాత మనస్సు మారింది. గారెట్‌ను తను ప్రేమించినమాట నిజమేనని న్యాయస్థానంలో అంగీకరించినది.

తరువాత మనస్సు మారిపోయినదనీ, గలాటావంటిదేమీ లేకుండానే ఆ సంగతి అతనికి చెప్పాననీ అన్నది. ఆమె అట్లా చెప్పినప్పుడు అక్కడ ఆమె భర్త కూడా ఉన్నాడట. పోనీ, అంతటితో గారెట్‌ను కలుసుకోవడం మానివేసిందా? లేదు. ఈ సంఘటన జరగడానికి మూడురోజులు ముందుకూడా అతన్ని కలుసుకున్నది.

—వి. ఎస్. అవధాని



# కొత్త సినిమాలు!



ఓరి దేవుడోయ్! నా వుంగరంవ్యా గాజులూ ఎవరో కొట్టేసారోయ్!
Rs. 1·00
నిలువుదోపిడి




మీ స్నేహితుడు ఎక్కడుంటున్నా-డయ్యా? సంవత్సరం క్రితం ఓ వంద పట్టుకెళ్లాడు - ఇంతవరకు అంతు లేడూ?
చిక్కడు దొరకడు




నాకీ ముసలి మాష్టారు వద్దు నాన్నా!
ప్రైవేటు మాష్టారు




పక్కింటాయన వెధవగాబట్టి పెళ్లానికి వంట చేసి పెడుతున్నాడే! నేనూ ఆ బాపతే అనుకున్నావా??
అసాధ్యుడు




మనమింకా ఎప్పుడు పెళ్లి చేసుకుందామండీ??
బ్రహ్మచారి




ఆ కళ్లే- ఆ కళ్లే! నా గుండెను గుండుసూదుల్లా గుచ్చాయ్!
అవేకళ్ళు

# మా రంగుల చిత్రము

మా అనుభవపూర్వకమైన నిజమైన ఈచిత్రములను ప్రవేశపెట్టియున్నాము. నిజమైనదానిని కనిపెట్టవలెనన్న మా రంగులచిత్రమును చూడండి ఈచిత్రము ఇండియాలో అన్ని స్థలములలోను ప్రవేశపెట్టివున్నాము హైదరాబాద్ — అజంతాలో 9-3-68 నుండి 21-3-68 వరకు తిలక్‌లో 22-3-68 నుండి 4-4-68 వరకు ప్రవేశపెట్టబడినది. మేము ప్రవేశపెట్టిన చిత్రములను చూడండి. ఆ స్నేహితుని చిత్రమును క్రింద ప్రచురించివున్నాము.

**K. భీమరాజు**
**మద్రాసు.**


వాడుటకు పూర్వము


20 దినముల అనంతరము


40 దినముల అనంతరము


70 దినముల అనంతరము

నా స్నేహితుల ఆలోచనపూర్వకముగా మీ "జీవన్‌టోను"ను 7డబ్బాలు (70 దినములకు) వాడినపిమ్మట నా బరువు 110 పౌనుల నుండి 165 పౌనుల వరకు హెచ్చినది దానికి మిగుల కృతజ్ఞుణ్ణి. మీరు చెప్పినట్లు వాడుటకు ముందును వాడిన తరువాతను తీసిన చిత్రములను పంపియున్నాను.

జీవన్‌టోనులో మాంసపుక్రొవ్వు చేరియుండుటవలననే మంచి పుష్టియు, బరువును, యిచ్చుచున్నదని చెప్పబడుచున్నది. అది చాల పొరపాటు. దీనితో మాంసపుక్రొవ్వు చేర్చుటలేదు. మంచి విలువగల మూలికలు మాత్రము చేర్చబడినది. "జీవన్‌టోన్" వాడుటవలన తటాలున ఎక్కువ పుష్టియు, బరువును ఏర్పడుచున్నది. కాని అది ఆరోగ్యకరమైనదికాదని కొంతమంది చెప్పుచున్నారు.

## జీవన్‌టోన్ వలన లాభములు

ఎంత మంచి ఆహారము భుజించినప్పటికిని శరీరము పుష్టిగా లేకున్నను, పెరుగుదల లేనప్పటికిని, అజీర్ణము, అలసట, శక్తిలేకుండుట, యౌవనము మారి ముసలివారుగా కనబడుట, శరీరము వెడుట, స్పృహ తప్పుట, మొదలగు వానికి "జీవన్ టోను" వాడి మంచి ఫలమును పొందవచ్చును. జీవన్‌టోనును కొన్ని దినములు వాడుచు వచ్చిన అతి త్వరలో లావు, బరువు మంచి పుష్టియు కలుగుట నిశ్చయము. (కొంతమంది చెప్పినట్లుగా ఇది అప్రతికముల వ్యాధులకు ఉపయోగపడదు.) అవసరమైన బరువును, లావును లభించినపిమ్మట వెంటనే వాడుటను నిలుపవలెను. ఎక్కువ లావును, బరువును వున్నవారు దీనిని వాడకుండుట మంచిది. అనేక మందులు ఉపయోగించియు ప్రయోజనము లేనివారు ఒకసారి జీవన్‌టోనును ఉపయోగించండి. ... ... ... ... 454 గ్రాముల వెల రూ. 10/-

పురుషులు మాత్రము వాడవలసిన మాత్రలు:— దీనిని వాడిన 10 రోజులకే ఫలమును యిచ్చును. ఎక్కువ శక్తిగల మాత్ర. 60 ఏండ్ల వయస్సుగలవారికి కూడ ఈ మాత్రల మూలముగా లాభము కలుగుచున్నది.... కోర్సు వెల రూ. 15/- ఈ మాత్రలను జీవన్‌టోనును ఒకేసారి వాడిన మంచి ఫలమును యిచ్చును

"స్కిన్‌లీమ్స్" "స్కిన్‌లీమ్స్" ఉపయోగించి, మొటిమలు, తెగిన గాయము, అమ్మవారి మచ్చలు. తేమలు, చెమటకాయలు...... మొదలగువానిని పోగొట్టి అందమైన ముఖమును పొందండి. 1 సీసా వెల రూ. 12/-

**జ్యోతి హాస్పిటల్.** రిజిష్టర్డు నెం. 218726-పోస్టు బాక్సు నెం. 1413 - ఫోన్ 440206
32. వెంకటనారాయణరోడ్డు, టి. నగరు, మద్రాసు-17.

**డి. కరీంనగరు**

అక్కయ్యా! బావగారి నామధేయం ఏమిటో చెప్తురూ?...

ఛీ పో చెల్లీ నాకు సిగ్గేస్తూంది!

**ఎస్. హెచ్. ఎస్, కోవెలకుంట్ల**

నేను నా జీవితాన్ని గురించి ఒక వ్యాసం రాయాలనుకున్నాను ఎంత ఆలోచించినా మనస్సు స్థిమిత పడ్డం లేదు. దీనికి మీ సలహా ఏమిటి?

జీవిత చరిత్రలు వ్రాసేటంతటి ఉన్నత జీవితాలా మనందరివి? వీటిని గురించి రాసుకోకపోవడమే మంచిది.

**కె. పి, కరీంనగరు**

'కొలది పాటి ధర్మాచరణము సహితము గొప్పఫలము నొసంగును'

"పే పెం పించి చెప్పకున్నా!"

**కె. ఎస్. ఆర్, తిరుపతి**

అన్ని శాస్త్రాలు చెప్పేది మానవులందరు ఒక్కటే, హెచ్చుతగ్గులు లేవు అని. కాని సమస్త శాస్త్రాలు చదివి పెద్ద చదువులు చదివిన వ్యక్తులే కులభేదాలు పాటిస్తున్నారెందుకు?

తెలిసిన మహార్యులకి కారణాలేముంటాయి ?

**బి. ఎస్. ఆర్, నిజాం సాగరు**

సంస్కారం అంటే ఏమిటి? దాని సరిహద్దులేలాంటివి?

మన బ్రతుకు పద్ధతి మన సంస్కారం. దానికి సరిహద్దులు లేవు.

**ఎం. ఎం, కరీంనగరు**

కుటుంబ నియంత్రణము వలన దేశమునకు సేవచేసిన వారమగుదుమా?

అందులో సందేహం ఏమిటి ?

**పి. ఎ. ఎస్. పి, హైదారాబాదు**

మేమడిగే ప్రశ్నలు— మీరిచ్చే సమాధానాలు సంఘంలో నలుగురికీ ఉపయోగపడాలంటాను.

ఇది సరదా కోసంగాని సంఘసేవ కాదు సోదరా.

**కె. ఎస్. ఆర్, బీర్కూరు**

మీరు సాహిత్య రంగంలో సాధించదల్చుకున్నది కీర్తా? లేక...

ఏ ఉద్దేశ్యంతోటీ ఈ రంగంలోకి దిగలేదు. ఉబ్బుసపోకగా మాత్రమే దీన్ని చూస్తాను.




**వి. వి. జి, అనకాపల్లి**

ఈ రోజులలో నీతికి నిలబడి నిజాయితీగా బ్రతికే వాడికి కాలం గడవక పోవడానికి కారణం ఏమిటి?

కాలం గడవక ఏం చేస్తుంది ?..

**టి. ఎస్. ఆర్, శ్రీకాకుళం**

స్త్రీలు పురుషులతో సమాన హక్కులకై వాదిస్తున్నారు కదా, పిల్లల్ని కూడా కనాలని ఎందుకు వాదించరండీ?

స్త్రీల కింకా ఇంగితజ్ఞానం నశించి పోలేదు కనుకనండీ!

**ఎం. ఎస్, నేవిపేట**

మమత మానవునికి ముఖ్యము కథకు ఏది ముఖ్యము?

అచ్చుపడుట!

**డి. ఎల్. ఎన్. ఎమ్, తుమ్మిసి**

మేము పరులకు సహాయం చేస్తాం. కాని మా కెవ్వరూ సహాయం చేయరు. ఎందుచేత?

ప్రతిఫలాపేక్షతో చేసే సహాయం సహాయం ఎలా అవుతుంది?

**వై. ఏ, గుంతకల్లు**

షాజహాను భార్య మీది ప్రేమను ప్రపంచానికి చాటడానికి 'తాజ్ మహల్' అనే సమాధి కట్టాడు. ఏమిలేని నిరుపేద తన భార్యమీది ప్రేమను ఏ విధంగా చాటుకొంటాడు?

తిరిగి వివాహం చేసుకోకుండా ఉండటం ద్వారా.

**కె. జి. ఎమ్, వెంకటగిరి**

మీకు ఎడిటరుగారికీ దూరపు బంధుత్వ సంబంధమేమైనా ఉన్నదా?

దగ్గిర బంధుత్వమే ఉంది- ఇద్దరమూ స్నేహితులం.

**జి. పి; జి. ఆర్, రాయికుదురు**

అక్కయ్యగారూ, ఇప్పుడు నారాయణుడికి శనివారాలు చేయుట ఫాషనయింది. మీరూ చేస్తున్నారా?

ఫాషనయాక చేయకుండా ఎలా ఉండడం? చాలా కాలంగానే చేస్తున్నాం చెల్లెలా.

**జి. బి. ఆర్, వరంగల్లు**

భగవంతుడు సృష్టించిన మానవునికి విలువలేదు; కాని మానవుడు సృష్టించిన డబ్బుకు విలువుంది...

కాలమహిమ గురూ.

**పి. ఎస్. ఎస్. ఆర్, గోపాల్ పేట**

'ఆడవారి నోట్లో నూగింజ నానదు' అని అంటారు. నిజమేనా?

అనర్థం కొన్ని సంగతులు ఆడవాళ్లు గుండెల్లో దాచుకున్నట్లు, ఏ మగవాడూ దాచుకోలేడు

**బి. ఎస్. ఆర్, అనకాపల్లి**

బుద్ధి పెంపొందడానికి, మంద బుద్ధిని రూపుమాపడానికి ఏమైనా మందు ఉందా?

ఉంది ఆ మందు పేరు కృషి.

**ఇ. టి. ఆర్, కావలి**

నేను 1967లో వెలువడిన తెలుగు హిందీ చిత్రాలన్నీ చూశాను. ఎన్ను గురించి మీ అభిప్రాయం?

ఏముంది—మీరు బొత్తిగా సినిమాభిమానులని!

**ఎస్. పి. ఆర్, జగిత్యాల**

మనిషి విలువకు కొలబద్ద ఏది?

అతని ప్రవర్తన.

**వి. కె, శ్రీశైల ఆత్మకూరు**

నూతన సంవత్సర ఆశయ ఆదర్శాలేమిటి?

ఏముంటాయి? పాత సంవత్సరం లాగే నడిపెయ్యడం తప్పించి.

# మూడు ముళ్ళు

అచ్యుతవల్లి

### జరిగిన కథ

కవిరాజ ధన్వంతరీ నిలయం నరసయ్యగారికి ఇద్దరు కూతుళ్ళు ఇద్దరు కొడుకులు. పెద్దపిల్ల కామేశ్వరి. రెండవ పెళ్ళివాడైన కేశవమూర్తితో కామేశ్వరికి వివాహమైంది కామేశ్వరి అభిరుచిని తెలుసుకున్న కేశవమూర్తి ఆమెని నళినితోపాటు చదువుకోడానికి కాలేజీకి పంపుతాడు. మాధవ నళిని సన్నిహితుడు. అతని అన్న రామనాథానికి కామేశ్వరిని పరిచయం చెయ్యమని నళినిని కోర్తాడు మాధవ. కామేశ్వరి కాలేజీ మానేస్తుంది కామేశ్వరి ఎవరయిందీ వివరంగా నళిని చెప్పనందుకు మాధవ నొచ్చుకుంటాడు. కామేశ్వరిపై రామనాథం అభిప్రాయం తెలుసుకున్న నళిని పశ్చాత్తాపపడుతుంది.

## 9

గవర్రాజు, 'కామేశ్వరి' ఐశ్వర్యాన్ని ప్రత్యక్షంగా చూశాడు! పెద్ద మేడా ముందర చక్కని పూలతోటా! అందమయిన కారూ! ఇంతకన్న స్త్రీకి ఏం కావాలి! గవర్రాజుకి మనసులో ఏ మూలో చీపురు ముల్లు గుచ్చుకున్నట్లు అనిపించింది 'నువ్వు పట్టి దౌర్భాగ్యుడివి సుమా!' అని కామేశ్వరి వెగటపడి నవ్వుతూన్నట్లు అన్పించింది గవర్రాజుకి. 'ఛ! తనదేం జీవితం! బోలెడు డబ్బు కూడబెట్టుతున్నాడు! కాని తను 'గృహస్థు' కాలేకపోతున్నాడు! తన డబ్బెందుకు! తగలబెట్టనా!' అని విసుక్కున్నాడు! అకస్మాత్తుగా అతనికి సుభద్ర జ్ఞాపకం వచ్చింది! ఆమెనైనా తన కిస్తే బాగుండును! అనుకున్నాడు! కాని నల్లని కామేశ్వరినే తన కిచ్చి పెళ్ళి చేయటానికి అడగలేదు! అల్లాంటిది చలాకీ పిల్ల సుభద్ర నిస్తారా! అని నిరాశ పడ్డాడు! కాని 'ఆశ దోష మెరుగదు' అన్న నానుడి నించి గవర్రాజు సుభద్రని అడగాలనుకున్నాడు. ఈసారి వాళ్ళంతట వాళ్ళే అడగాలనే నియమంలేకుండా సుభద్రనే మంచి మాటలాడాలి అనుకున్నాడు. గవర్రాజు హోటలు వినోదాతో తనకున్న వాటావిూద వచ్చిన లాభం అంత పెట్టి పట్నంలో మంచి మేడ కొన్నాడు. అన్నలిద్దరూ ఎంతో సంతోషించారు. ఇల్లూ వాకిలీ, పొలమూ పుట్రా అన్నీ ఏర్పరుచుకుంటున్నందుకు తమ్ముణ్ణి అభినందించారు! వదినలిద్దరూ తమ పుట్టింటి వేపు వున్న సంబంధాలను చేసుకొమ్మని చెప్పారు.

'అల్లాగే చూద్దాం!' అన్నాడు గవర్రాజు.

సుభద్రకి సిక్స్తుఫారం పరీక్షపోయింది. ఇంక కట్టలేదు. ఇంట్లోనే కూర్చుంది! సుభద్రకి కూడా, పెళ్ళివారు వస్తూన్నారు. వెళ్తున్నారు! కామేశ్వరికి పెళ్ళి కాక మునుపు పెళ్ళిచూపులకు వచ్చిన వారంతా, సుభద్ర చాలా బాగుందనీ, ఆ చిన్నమ్మాయిని ఇస్తే చేసుకొంటామనీ, అనేవారు! అప్పుడు నరసయ్యా జగదాంబా, పెద్దమ్మాయికి అయితే కాని చిన్నమ్మాయికి చేయమని చెప్పేవారు. కామేశ్వరిని చూసుకుందుకు వచ్చిన వాళ్ళంతా సుభద్ర నచ్చిందనటంతో నరసయ్య, జగదాంబా, సుభద్ర పెళ్ళి, కామేశ్వరి పెళ్ళి అయిన మరుక్షణం చేసేయొచ్చనీ, సుభద్ర అందానికి ప్రతివాళ్ళూ, ముగ్ధులై పోతున్నారనీ, సుభద్రని పెళ్ళి చేసుకుందుకు, సంబంధాల వాళ్ళు, క్యూలో నిల్చుంటారనీ అనుకున్నారు. కాని సుభద్రని చూసుకుందుకు వచ్చిన వాళ్ళుకూడా, మూడు వేలూ, అయిదువేలూ. అంటూ, కట్నాలు బేరాలు సాగించే సరికి జగదాంబకీ, నరసయ్యకీ మతులుపోయినంత పనయింది! పిల్ల అందమయినదయితే, పిల్ల నచ్చితే పోవటం అంటూ వుండదు. కానీ కట్నం అక్కర్లేకుండా, చేసుకునే వాళ్ళు ఎవరున్నారు! అందులో, నరసయ్య తన రెండో కూతురు, అందమైనది అన్న అభిమానంతో, మంచి ఆస్తిపాస్తులున్న వారినీ, డాక్టరుకోర్సు చదివిన వారినీ, ఇంజనీర్లనీ, పెళ్ళి చూపులకు పిలుచుకు వచ్చేవాడు! తన కూతురు అందం చూసి, మూర్ఛబోయి, ఆ పిల్లని తప్ప ఇంకెవర్నీ పెళ్ళాడమని పట్టుపట్టి కట్నాలు అడగనివ్వరని అనుకునేవాడు! కాని ఆ డాక్టర్ల ఇంజనీర్ల తల్లి తండ్రులు తమ కొడులకి ఉగ్గుపాలతో అయిన ఖర్చు అంతా ఏకరువుపెట్టి, పదివేలు రూపాయలతో మొదలుపెట్టి, పాతికవేల రూపాయల దాకా పాట పెంచేవారు! జగదాంబ కళ్ళకి, వాళ్ళు సౌందర్య దృష్టి తెలియని మూర్ఖుల్లా అగుపించేవారు! సుభద్రకి పెళ్ళికొడుకులంటే ఒకవిధమైన చులకన భావం ఏర్పడింది! ఏమాత్రం, తన అందం వాళ్ళని కదిలించలేకపోతోంది! వాళ్ళ చదువులు ఎందుకు? సౌందర్యాన్ని ఆస్వాదించలేని వాళ్ళ పెద్ద వుద్యోగాలెందుకు? ఏ పాతికవేలో కట్నంఇస్తే, ఒక కురూపిని, కట్టుకుని, దాన్ని ఇంట్లో అట్టే పెట్టి, నర్సులతోనూ, చిన్నపుదో గినులతోనూ, సరసాలు సాగిస్తారు! డబ్బు కావాలి వాళ్ళకి! అందచందాలు, వయసు పొగసులూ, వాళ్ళకి అక్కర్లేదు! అలాంటి,

వాళ్ళ తన్ని చేసుకోకుండా వుండటమే తనకి అదృష్టం! ఈమధ్య సుభద్రకి చదువులేకపోవటంనించి తీరిగ్గా ఇంట్లో కూర్చుని, డిటెక్టివ్ నవలలూ, చవుకబారు ప్రేమ కథాసాహిత్యం చదువుతూ కాలం గడుపుతోంది. ఇప్పుడామె తన అందాన్ని మెచ్చుకొంటూ, కవిత్వం మాట్లాడగల యువదర్శనంకోసం తహతహలాడుతోంది.

గవ్రరాజుని చూడగానే, జగదాంబ అంది.

'ఏం రాజూ! కామేశ్వరి కులాసాగానే వుందా! ఎప్పుడు పంపుతానన్నారు?'

'వేసంగిలో పంపుతానన్నారు! అల్లుడు కూడా, నన్ను చాలా మర్యాదచేసి భోజనం చేస్తేకాని వెళ్లవద్దని చాలా పట్టుపట్టారు!' అన్నాడు గవ్రరాజు.

'ఇన్ని రోజులుండి పోయావేం రాజూ!' అంది జగదాంబ వారంరోజులు క్రితం నరసయ్య ఎక్కడో ఆయుర్వేద వైద్య పరిషత్తు సభలు జరుగుతూంటే వెళ్లాడు. ఈ వారంరోజులూ, పిల్లలు ముగ్గురినీ పెట్టుకొనీ ఒంటిగా వుంది. జగదాంబ!

'గవ్రరాజు వస్తాడు కదా! వస్తే ఎల్లానూ వీధిగదిలో వుంటాడు కదా! ఇంక భయం ఎందుకు?' అన్నాడు నరసయ్య. గవ్రరాజు వారంరోజులకి కాని రాలేదు.

'అక్కడొక ఇల్లు కొన్నానండి! రిజిస్ట్రేషనూ అదీ అయ్యేసరికి వారంరోజులయిపోయింది!' అన్నాడు గవ్రరాజు.

'ఇల్లు కొన్నవా! ఎంతపెట్టికొన్నావ్!' అంది జగదాంబ ఆశ్చర్యంగా. ఒక కిళ్లీకొట్టు పెట్టుకొని కాలం గడిపేవాడు పట్నంలో ఒక ఇల్లు ఎల్లా కొన్నాడు? ఆశ్చర్యపోయింది. బహుశా ఏదో కొట్టు పెట్టుకుందుకు వీలుగా చిన్నగది పట్టు ఏదో కొనివుంటాడనుకుంది.

'ముప్ఫయ్‌వేలు పెట్టికొన్నాను. ఇల్లు చిన్నదేలెండి! మేడమీద ఒక హాలూ, నాలుగు గదులూ వున్నయ్! ఇల్లుమటుకు సరికొత్తది! మెయిన్‌రోడ్డుమీద వుంది! ఎప్పు డమ్ముకున్నా దాని ధర దానికి వస్తుంది!' అన్నాడు. జగదాంబకి గుండె ఆగిపోయినంతపని అయ్యింది. ఇంత చిన్న వ్యాపారంచేసి అంత డబ్బు ఎల్లా కూడబెట్టుకున్నాడు?

'అయితే ఇంక అక్కడికి మకాం మార్చేస్తావా?' అంది.

'లేదు! అంత ఇంటిలో నే నొక్కణ్నే ఎల్లా వుంటాను? అద్దెకిచ్చేసాను. నా వ్యాపారం ఇక్కడ్నే బాగా సాగుతోంది!' అన్నాడు.

అప్పుడు ఆమెకి గవ్రరాజు కింకా పెళ్లి కాలేదని చెప్పి జ్ఞాపకం వచ్చింది. ఏదో ఆలోచనలోకి వెళ్లింది.



గవర్రాజు మామూలుగా తన గది తలుపు తాళంతీసి పనిచేసే చిట్టెమ్మని పిలిచి గదూడవమని అరుగుమీద నించున్నాడు. ఏదోపనిమీద అరుగుమీదకువచ్చిన సుభద్రని చూసాడు. ఒక్కసారి అతని శరీరంలో విద్యుత్తు ప్రవహించినట్లయింది.

సుభద్ర అరుగుమీద నించుని రోడ్డు మీదకు చూస్తోంది. ఇంకా చిట్టిబాబు, జగ్గూ స్కూల్‌నించి రాలేదు. వారం రోజులనించీ గదిలో పేరుకుపోయిన దుమ్మని జాగ్రత్తగా నెమ్మదిగా తుడుస్తోంది 'చిట్టెమ్మ'. దానికి గవర్రాజంటే ప్రత్యేక అభిమానం వుండేది! అది అడిగినప్పుడల్లా రెండుగా, మూడుగా ఇచ్చేవాడు గవర్రాజు! అంచేత గవర్రాజు పని అది చాలా శ్రద్ధగా చేస్తుంది!

'సుభద్రా! వక్కసారి మీ అక్కగారి వూరు వెళ్లరాదూ! అన్నాడు గవర్రాజు. గవర్రాజుకి సుభద్రతో చిన్నప్పట్నించి చనువు వుంది. గవర్రాజు కొట్టు పెట్టేసరికి సుభద్ర పన్నెండేళ్ల పిల్ల!'ఎందుకు?' అన్నది సుభద్ర.

'మీఅక్కమేడ ఎంతబాగుందనుకున్నావ్! అంతా సినీమాల్లో చూపిస్తారే అంత బాగుంది!' అన్నాడు గవర్రాజు.

'అందుకే అది ఉత్తరాలు కూడా

## మంచుముళ్లు

వ్రాయటంలేదు! భోగభాగ్యాలుంటే ఇంక పుట్టిల్లూ; మమతలూ జ్ఞాపకం వుంటాయేమిటి'' అంది సుభద్ర కామేశ్వరి ఇంటి వర్ణన ఇదివరకే తన తల్లిద్వారా చిట్టిబాబుద్వారా వింది సుభద్ర.

'నేను కూడా అల్లాంటి మేడ వకటి కొన్నాను పట్నంలో! నువ్వు చూడ్డానికి రాకూడదూ వకసారి!' అన్నాడు.

'నువ్వు కొన్నావా?' అంది ఆశ్చర్యంగా సుభద్ర 'అవును! నేను ఈ స్థలం అచ్చి వచ్చిందని ఇక్కడ కొట్టు ఇల్లా వున్నచ్చాను కాని పట్నంలో హోటలు వినోదాలో నాకు భాగం వుంది. దానిమీద వచ్చిన లాభం పెట్టి మేడకొన్నాను.' అన్నాడు గవర్రాజు.

హోటలు వినోదా అంటే అది ఎంత భాగ్యవంతులు వుండగల హోటలో సుభద్రకి తెలియంది కాదు! అందులో గవర్రాజుక భాగం వుందంటే అతను చాలా డబ్బు కూడ బెట్టాడన్నమాట! ఆమె కళ్లు ఆశ్చర్యంతో తళుక్కు మన్నాయి! అంతలో మళ్లీ.

'నే నెందుకు చూడటం!' అంది అన్నాడు సుభద్ర.

'మీ అక్కమేడ అందంగా వుందో నా మేడ అందంగా వుందో చెబ్దువుగాని!' గవర్రాజు.

'నేను చెప్పాలా!' విస్తుబోయింది. సుభద్ర. 'చిట్టెమ్మ' గదూడిచి దుమ్ము చేటలో కెత్తుకుని అరుగుమీదకు వచ్చింది. సుభద్ర లోపలికి వెళ్లిపోయింది. గవర్రాజు తనమీద తనే విసుక్కున్నాడు. ఆ పిల్ల ముందు ఎల్లా తన మనోగతం వెల్లడి చేయాలో తోచక జుత్తు వెర్రిగా పీక్కున్నాడు.

ఆ రాత్రి సుభద్రకి నిద్ర పట్టలేదు. దశమి వెన్నెల బయట అంతా చల్లగా పర్చుకుంది. గవర్రాజు అరుగుమీద చాప వేసుకుని పరుపు వేసుకుని పడుకున్నాడు. సుభద్ర నెమ్మదిగా వీధి తలుపు తీసుకుని బయటకు రావటం సగం మూసిన కనుకొలకుల్లోంచి చూసాడు. సుభద్ర తలుపు దగ్గరసా వేసి అరుగు చివరకు వచ్చి నించుంది. చప్పున గవర్రాజు లేచి సుభద్రకు దగ్గరసా వచ్చేడు.

'నిద్ర పట్టటం లేదా సుభద్రా!' అన్నాడు.

'అబ్బే ఏమీలేదు! వూరికేనే లేచాను!'. అంది.

'సుభద్రా! నన్ను చూస్తే నీకేమని పిస్తోంది చెప్పు!' అన్నాడు. సుభద్ర మనసు వివశమైంది. ఏమీ మాట్లాడ లేదు.

'సుభద్రా! నిజం చెబుతున్నాను మీ అక్కఇంటికి వెళ్లాను. ఆ ఇంటిసౌందర్యం అంతా చూసాను! మీ అక్క కూతురు నళిని నేనంటే ఎంతో ఆపేక్ష చూపెట్టింది.

నాతో సినిమాలకీ,బీచ్‌షికార్లకీవచ్చింది నిజంగా, నళిని, చాలా అందమైన, పిల్ల! కాలేజీ చదువుతోంది! ఆపిల్ల మనస్సు నాచుట్టూ ప్రదక్షిణం చేసిందని నాకు తెలుసు! కాని దేనివల్ల ఆపిల్ల నన్ను కోరుతుంది? పట్నంలో నాకున్న పరపతి వల్ల! త్వరలో నేనొక పెద్దబట్టల షాపు తెరువబోతున్నాను. చేయితిరిగిన బిజినెస్ మాన్‌ని! కాని నన్ను నళిని పన్నిన వలలో పడిపోకుండా కాపాడాయి ఒక అందమైన వన్నని కళ్లు! అవి ఎవరివో తెలుసా?'



## మూడుముళ్ళూ

ఆగాడు గవర్రాజు. ఇంత అందంగా మాట్లాడటం తన కెల్లా వచ్చిందా! అని తనకి తనే అద్భుతపడ్డాడు గవర్రాజు! అందమైన అమ్మాయి సాన్నిహిత్యంలో అందమైన మాటలే వస్తాయేమో! అని మురిసిపోయేడు! సుభద్ర మనస్సు లజ్జాసంకోచాలతో పీడించబడుతోంది. నళినిలాంటి రూపవతి, ధనవతి, విద్యావతి కూడా గవర్రాజునికోరటం, ఆమెకి అసహనం కలిగించింది.

'ఎవరివో తెలుసుకోవాలన్న జిజ్ఞాస నీకు లేదా?' అన్నాడు గవర్రాజు.

'ఎందుకులేదు?' అంది సుభద్ర.

'నీవే సుభద్రా! ఆకళ్ళు నీవే! నీవు మీ అక్కకు ఏవిధంగానూ తీసికట్టుగా వుండకూడదని పెద్దమేడకొన్నాను. నిన్ను చూడకుండా వుండలేకనే, నేనిక్కడ పడి వుంటున్నాను సుభద్రా! నీఅందం, యవ్వనం నన్ను పిచ్చివాణ్ని చేసాయి! నీవుకాదంటే, నేనేమయిపోతానో నాకేతెలీదు! సుభద్రా!' దీనంగా అన్నాడు గవర్రాజు. అందంగా ఆరోగ్యంగా, దృఢంగావున్న గవర్రాజు సుభద్రని అల్లా దేవిరించటం సుభద్రకెంతో ఆనందంగావుంది. తాను చదివిన ప్రేమకథల్లోని నాయకుడు గవర్రాజులో కన్పించాడు ఆపిల్లకి!

వెన్నెల్లో చలిస్తూన్న పెదవులతో, సజీవ ప్రతిమవలె నిలుచున్న సుభద్రని చూస్తే, గవర్రాజుకి కవిత్వం దానంతటదే పెల్లుబుకుతూ వచ్చింది.

'సుభద్రా! నేను నిన్ను ఎంతగానో ప్రేమించుతున్నాను. మీవాళ్ళకి, వాళ్ళ దృష్టిలో నేనొక, పెళ్ళికొడుకుగా కన్పించను. అందుచేతనే, ఎన్నివేల రూపాయలు కట్నాలుపోసి అయినాసరే, సంబంధాలు వెతుకుతున్నారు! వాళ్ళ దృష్టిలో, నేనొక 'కిళ్ళీకొట్టు' వాణ్నిమాత్రమే! వాళ్ళకి హోదాగల వుద్యోగస్థులైతేనే కళ్ళకి ఆనుతారు! కాని నీవొకసంగతి ఆలోచించు! డబ్బిచ్చి కొనుక్కున్న ఆ హోదాగల భర్తనించి నీకీ ఆరాధనా, ఆత్మీయతా లభ్యమౌతాయా? నాకిప్పుడు, ఏ ఆఫీసరుకీ రానంత రాబడివుంది! మేడ కొనుక్కున్నాను! పొలంవుంది! ఇద్దరిన్నీ తమ్ములు, బాధ్యత, గౌరవమూ కల వుద్యోగాల్లోవున్నారు! ఇద్దరూకూడా మర్యాదస్తులైన కుటుంబాల్లోంచి వచ్చినపిల్లల్ని వివాహం చేసుకుని, సుఖంగా, సంసారాలు చేసుకుంటున్నారు. నాకూ పెళ్ళి చేయటానికి ఎంతకాలంగానో ప్రయత్నించుతున్నారు. కాని నామనస్సుని ఆకర్షించిన సౌందర్యరాశివి! నీవుతప్ప, నాకు మిగిలిన ఆడపిల్లలు అక్కచెల్లెళ్ళుగా కన్పించుతారు! నీవు నన్ను పెళ్ళిచేసుకుంటానని మాటివ్వు! నీకు ఇష్టం లేకపోతే, ఈ కిళ్ళీకొట్టు ఎత్తేసి పట్నం వెళ్ళిపోదాము! ఒక కారుకొంటాను. బట్టల కొట్టొకటి వచ్చేనెలలో తెరుద్దామను కొంటున్నాను నీవిప్పుడు, కిళ్ళీకొట్టు గవర్రాజుని కాదు ప్రేమించాల్సింది! హోల్ సేల్ డీలర్! క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ ప్రెసిడెంట్, ఎ. జి. రాజుని ప్రేమించాలి సుభద్రా! ఊఁ! అను సుభద్రా!' చనువుగా రెండుభుజాలమీగా చేతులువేసి తనవైపు ఆమెని త్రిప్పుకున్నాడు! అతనిశరీరం మీంచి కుమేగా పరిమళం ఆమె ముఖం అంతా పరుచుకుంది. ఉక్కిరి బిక్కిరయి చటుక్కున అతని వక్షంమీద తల వాల్చి కళ్ళుమూసుకుంది సుభద్ర!

ముప్ఫయ్ఆరేళ్ళు వస్తోన్నా స్త్రీ స్పర్శా సుఖాన్ని ఎరుగని గవర్రాజు లజ్జాన్వితఅయి కంపిస్తోన్న సుభద్ర లేత పరిష్వంగానికి చలించిపోయేడు! మబ్బుల్లోని చంద్రుని సాక్షిగా ఆమెని తనలోనికి అయిక్యం చేసుకున్నాడు!

గవర్రాజులోని రసికత సుభద్రని చాలా రంజింప చేసింది! సుభద్రలో పొంగులెత్తుతూవున్న యవ్వనం గవర్రాజు అందించే అనుభవంకోసం ఎదురుచూడటం మొదలెట్టింది! గవర్రాజు సుభద్రని ఇంతతేలిగ్గా లొంగదీసుకోగలనని మొదట్లో అనుకోలేదు! అయిన్నింటి ఆడపిల్ల! గౌరవ కుటుంబీకులు! కన్నెగా తనకి తనను సమర్పించుకోగలదని అతను అనుకోలేదు! గవర్రాజు తన జీవితంలో చాలాసార్లు స్త్రీ సాహచర్యంకోసం తహతహ లాడేవాడు! కాని చిన్నప్పటి దుబారీ

తనంవల్ల; అవిద్యవల్లా తను జీవితంలో చాలా పోగొట్టుకున్నానని తెలుసుకున్నాడు! తను ఎల్లాగయినా ధనం బాగా ఆర్జించి గొప్ప ధనవంతుల జాబితాలోనికి ఎక్కాలనే దృఢమైన దీక్షవల్ల లాలసని అతను లెక్కచేయలేదు. దీక్ష లాలసని జయించింది! డబ్బుతో అతను స్త్రీ సౌఖ్యం పొందవచ్చునని అతనికి తెలుసును! కాని దేనికయితే అతను వ్యాపారదృష్టిని అలవర్చుకున్నాడో, ఆ కుటుంబ ప్రతిష్ఠని బజారుపాలు చేయటం అతనికి నచ్చలేదు! పైగా శరీరంమీద అతనికి తగని ప్రేమ! దానిని రోగభూయిష్టం చేయటం అతనికి నచ్చదు! సుభద్ర అతని తృష్ణని తీర్చగలిగింది!

అయిదారురోజులు గడిచేక నరసయ్య వచ్చేడు. గవర్రాజుని కుశలప్రశ్నలు వేసేడు ! సుభద్రలోని కొత్త కాంతిని జగదాంబ గమనించలేదు! తండ్రివచ్చినా, సుభద్ర భయపడలేదు! రాత్రుళ్ళు పది గంటలు దాటేక అరుగుమీదకువచ్చి గది వద్ద నిలబడేది! గవర్రాజు, సుభద్ర వచ్చి వెళ్లితేనే కాని, నిద్రపోయేవాడు కాదు!

రెండునెలలు పూర్తిగా గడవలేదు ! ఒకరోజు ఉదయాన్నే గవర్రాజు, నరసయ్య వీధిగది ఖాళీచేసేడు. రిక్షాలో పెట్టె బేడా సర్దుతూంటే నరసయ్య అడిగేడు !

'ఏం? గవర్రాజూ! కొట్టు ఎత్తి పెట్టేసావ్! లాస్ వొస్తూందా !' అని.

'మీ దయవల్ల లాసేమీ లేదండి ! పట్నంలో బట్టలషాపు పెట్టాను ! అక్కడ స్వయంగా చూసుకోవచ్చని ఇక్కడ కొట్టు ఎత్తిపెట్టాను!' వినయంగా చెప్పాడు గవర్రాజు!

'బట్టలషాపే !' ఆశ్చర్యపోయేడు నరసయ్య 'పట్నంలో స్వంతంగా మేడ కొనుక్కున్నాడట! హోటల్ వినోదాలో సగం భాగం ఇతడిదేనట! బట్టలషాపు కూడా స్వంతంగానే పెట్టాడుట !' గవర్రాజు వెళ్లిపోయేక, జగదాంబ చెప్పింది.

'ఆ! దానిదేముందీ ! ఈ రోజుల్లో ప్రతీ లాకాయి లూకాయివెధవా ఎల్లాగో అల్లా నాలుగుడబ్బులు అడ్డమైన గడ్డీతినీ పోగుచేసుకోవటం తర్వాత పెద్ద బిజినెస్ మాన్ అయిపోయి, కార్లో తిరగటం పరిపాటి అయిపోయింది!' తేలిగ్గా అన్నాడు నరసయ్య.

పట్నం వెళ్లిపోయిన గవర్రాజుకి ఏమీ తోచలేదు! సుభద్ర బాగా అలవాటు అయిపోయింది వెళ్లేరోజు రాత్రి సుభద్ర చెప్పిన విషయం ఒకటి గవర్రాజుకి అయోమయంగావుంది ! 'నాకీ మధ్య వంట్లో నీరసంగా వుంటోంది! అమ్మకు తెలిస్తే ఏమవుతుందో!' అంది సుభద్ర. 'కావలసినంత డబ్బు ఇస్తాను! ప్రతీవారం వస్తాను. మంచి టానిక్కు కొనితెస్తాను! నీ ఆరోగ్యం గురించి దిగులుపడకు!' అన్నాడు గవర్రాజు.

పట్నం వచ్చేక అన్నగారింటికి వెళ్ళాడు! చిన్న వదిన మంచంమీద పడుక్కొని వుంది.

'ఏం వదినా అల్లా పడుక్కున్నారు?' అన్నాడు.

'వంట్లో నీరసంగా వుంది నాయనా!' అంది వదిన. చప్పున సుభద్ర కూడా నీరసంగా వుండటం గుర్తుకి వచ్చింది. బజారుకుపోయి పళ్ళూ ఏదో బలానికి టానిక్కులూ కొనితెచ్చి చిన్న వదినకు ఇచ్చాడు. ఇస్తూ,

'వదినా నీరస మెందుకు వస్తుం దంటారు?' అన్నాడు ఆమె చటుక్కున సిగ్గుపడింది. పెద్ద వదిన,

'మీకు పెళ్ళయితే మీ ఆవిడ చెబుతుంది లెండి?' అని హాస్యం చేసింది.

గవర్రాజు చిన్న ముఖం చేసుకున్నాడు! పెద్ద వదినకి జాలి వేసింది.

'అది కాదు రాజుబాబూ! ఇంకో అయిదారునెలల్లో ఆమె పిల్లలకి తమ్ముడో చెల్లెలో పుట్టబోతారు! అందుకనే ఆ నీరసం!' అని నవ్వింది.

గుండె ఝల్లుమంది గవర్రాజుకి!




సుభద్రకి కూడా నీరసం అంటే ఇదేనా! తను, తనవల్లేనా? ఇంకా పెళ్లి కాకుండానే తను తండ్రి అవుతున్నాడా! ఛీ ఛీ! సుభద్రకేనా సిగ్గుండద్దూ! అయినా తనకి మేడ వుందనీ, డబ్బు సంపాదించాననీ చెప్పగానే తనకి లొంగిపోయింది! ఏమిటి ఈ ఆడపిల్లలు? ఇట్టే లొంగిపోతారు! సిగ్గేనా వుండదు, వాళ్లకి కావాల్సినది డబ్బు! దర్జాగా షికార్లు తిరగటం! దానికోసం నీతిని కూడా కోల్పోతారు!

తను పెళ్లి చేసుకుందామనుకున్నాడు! అదే చెప్పాడు సుభద్రతో!

'ఎల్లానూ పెళ్లి చేసుకోబోతున్నాం! ఇంతలో తొందర దేనికి! ఆ మూడు ముళ్ళూ పడిపోయేక మనం స్వేచ్ఛగా వుండవచ్చుకదా! అంతవరకూ హద్దు మీర కూడదు!' అని వక్కాణిస్తున్నా వారించకుండా తనకితాను లొంగిపోయిందిసుభద్ర! ఇప్పుడేం చేస్తుందో! తను పెళ్లాడనంటే ఏం చేస్తుంది? ఏమీ చేయదు! చల్లగా ఏమందో పూకో ఇస్తారు వాళ్లవాళ్లు. తర్వాత ఏ రెండో పెళ్లివాడినో చూసి ఆ మూడు ముళ్లూ వేయిస్తారు! కామేశ్వరీ అంతే అయివుంటుంది! చక్కగా తల వంచుకుని పెళ్లిచేసుకుంది! ఇప్పుడు ఆ రామనాథాన్నీ, మాధవనీ ఇంటిచుట్టూ త్రిప్పుకుంటోంది! ఛీ ఛీ! ఎల్లాంటి వాళ్లు ఈ ఆడపిల్లలు!' అనుకొని సుభద్రని ఈసడించుకున్నాడు గవర్రాజు.

*   *   *

కామేశ్వరి గదిలోనికి వచ్చేసరికి కేశవ ఏదో ఆలోచిస్తున్నాడు. కామేశ్వరి రావటంతోనే సరాసరి తన మంచంమీదకు పోబోయింది!

'కాస్సేపు ఇల్లా వచ్చికూర్చో కామేశ్వరీ! నీతో ముఖ్యంగా ఒక విషయం మాట్లాడాలి!' అన్నాడు కామేశ్వరి దగ్గరసా వచ్చినిలబడింది.

'కూర్చో!' అన్నాడు.

కామేశ్వరి సంకోచిస్తూ నిలబడింది!

'ఫరవాలేదు కూర్చో!' అన్నాడు మళ్లీ సోఫాలో ఒకవార మొగలిపువ్వులా కూర్చుంది కామేశ్వరి!

'నీకు నేను రెండోపెళ్లివాణ్ణే అవి

మిన పెళ్ళికి ముందు తెలుసా? తెలిసే చేసుకుందు కొప్పుకున్నావా?' హఠాత్తుగా అడిగిన ఆ ప్రశ్న కామేశ్వరిని విచలితను చేసింది. కామేశ్వరికి ఏం జబాబు చెప్పాల్నో తోచక వూరుకుంది.

'నాకు పెళ్ళికెదిగిన కూతురువుందని నీకుతెలుసా? నీఅంత ఎదిగిన కూతురున్న పురుషుణ్ని నీవు భర్తగా పొందబోతూ, నీవేమి ఆలోచించుకున్నావు కామేశ్వరీ? నీ కుటుంబ సౌఖ్యంకోసం నీవీ త్యాగంచేయ టానికి వొప్పుకున్నావా? తర్వాత జీవితంలో నీవేమీ పొందలేవని నీకు తెలీదా? మరీ చిన్నపిల్లవు కాదుగా?' ఆగాడు కేశవ! పెళ్ళయిన సంవత్సరకాలానికి భర్తకి, తను అతన్ని పెళ్ళాడటానికిగల కారణాలు తెలుసుకోవాల్సిన అవసరం కలిగింది! ఏం మగవాళ్ళు? తను ఇంత వయసువచ్చేక, మళ్ళీ పెళ్ళిపీటలమీద కాలుపెట్టటానికి గల కారణాలు తనకీ తెలుసుకోవాలనేవుంది, కానయితే తను భర్తని ఎదురు ప్రశ్నలు వేయకూడదు! ఆ అర్హత తెలుగుస్త్రీకి లేదు!

'నాకు అన్నీ వసుంధర వదిన చెప్పారు!' ఒక్కొక్కటి ఎలాగో గొంతుపెకలించుకుని అంది.

'అయితే ఎందుకు తెల్సుండీ ఒప్పు కున్నావ్?' అన్నాడు కేశవ.

## మూడుముళ్లూ

'నాకు పద్నాలుగేళ్ళు నిండినది మొదలు మా అమ్మా నాన్నా వరాన్వేషణ ప్రారంభిం చేరు! వచ్చిన ప్రతివాళ్ళూ, నేను నల్లగా వుంటానని, వెనక్కు తిరిగివెళ్ళిపోయేవారు! అసలే మావాళ్ళది, అంతంతమాత్రపు సంసారం! ఈ కరువురోజుల్లో నెలకి రెండేసివందల రూపాయల జీతాలు తెచ్చు కుంటూన్న ఉద్యోగస్థులకే, కుటుంబాలు జరుపుకోవటం తలకు మించినభారం అవు తోంది! అలాంటిది మానాన్నకి, ఉద్యోగం అంటూ ఏమీలేదు! ఇంజక్షన్సు, ఆపరేషన్సు అంటూ ప్రతీ వాళ్ళూ హాస్పటల్‌కి ఎగబడుతున్నారుకాని, ఈఆయు ర్వేదపు మాత్రలకి ఎవరూ రోగులురారు! ఏవో నాలుగుబస్తాల గింజలు వస్తాయి! ఏదో గుట్టుగా తిని తినక కాలంగడుపు కొస్తున్నాం! అలాంటిది నాకు, వేలకు వేలు కట్నాలుపోసి ఎల్లా పెళ్ళిచేస్తారు. ప్రతివాళ్ళూ నాలుగువేలూ, అయిదువేలూ కట్నం అడిగేవారు! ఇంక మావాళ్ళకి నా కన్నెచెర వదలించటం అసాధ్యమని పించింది! ఆస్థితిలో దేవతలా వసుంధర, వదిన వచ్చారు. ఆమె మీగురించి అంతా చెప్పారు. మేమంతా సంతోషంగా ఒప్పుకు న్నాము' అంది కామేశ్వరి.

'డబ్బులేక నీకుతగిన ఈడూ జోడూ అయిన కుర్రవాడు దొరకలేదన్నమాట! ఇప్పుడా డబ్బు వేనిస్తాను! నిన్ను చేసుకుం దుకు ఎవరన్నా ముందుకువస్తే, పెళ్ళి చేసుకుందుకు వప్పుకుంటావా? ఆలోచిం చుకో!' అన్నాడు కేశవ!

ఆమాటలు కామేశ్వరికి శరాఘాతంలా తగిలాయి!

'మీరు! మీరేనా అల్లా అంటున్నారు? నిజమే! వాబ్రతుకు ఎవరేమి అపహాస్యం చేసినా సరితూగేలా వుంది! జీవితానికి, స్త్రీజీవితానికి ఈమూడుముళ్ళూ పడ టంతో ఎంతో నిండుతనం, కాంతి, శాంతి, లభిస్తుంది! కన్నెమనసులు కలలతో, ఏవేవోకోరికలతో వేగిపోతూ, తూగిపోతూ, ఈమూడుముళ్ళ బంధంకోసం, వేయి వెలుగుల ఆశలతో ఎదురుచూస్తారు కన్నె పిల్లలు! పుణ్యంకొద్దీ పురుషుడు, దానం కొద్దీ పిల్లలు అన్న సూక్తిప్రకారం ఏ పిల్ల పూర్వజన్మ తపస్సునించి, ఆపిల్ల దానికి ఈ జన్మని భరాయించే భర్త లభ్య మవుతాడు! ఈ పవిత్రబంధాన్ని, శాంతిగా, ఓరిమిగా నిలుపుకోవటం తెలుగు స్త్రీ కర్తవ్యంఅయివుంది!' దుఃఖంతో కామేశ్వరి గొంతు పూడిపోయింది!

కేశవ తనలో తాను నవ్వుకున్నాడు! పైకిమటుకు గంభీరంగా.

'నిజమే కామేశ్వరీ! నువ్వన్నది అక్ష రాలా నిజమే! నీ పూర్వజన్మ తపస్సు యొక్క ప్రభావం ఇంకా నీ వ్యక్తిత్వం మీద పడలేదు! ప్రస్తుతం నీకు దొరికిన భర్తను నేనే! నేను రెండోపెళ్ళివాణ్ని! నన్ను సేవిస్తూ ఇక్కడ్నే నువ్వు జీవి తాంతం పడివుండాలని శాసించటానికి నేను నీ మెళ్ళోవేసిన మూడుముళ్ళకీ అధికారం వుంది! నీ మనసేమిటో, నీగత మేమిటో తెలుసుకోకుండా ఆ అధికారాన్ని బలవంతంగా నీ నెత్తిమీద రుద్దదల్చుకో లేదు! నీకు నీ జీవితాన్ని నిర్ణయించు కునే అధికారంవుంది! నీ వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకునే అవకాశం, స్వేచ్ఛా వుంది! మిథ్యా గౌరవాలకుపోయి, నీ విరిసిన పూవులాంటి జీవితాన్ని నాశనం చేయ దల్చుకోలేదు! ఆలోచించుకో! నీకు బోలెడు వ్యవధివుంది! ఈ సంవత్సరం వేసంగిలో నళిని పరీక్షలు కాగానే ఆ పిల్లకు పెళ్ళిచేయదల్చుకున్నాను! ఈలోగా





నీకు నచ్చిన వ్యక్తి తారసపడితే నీకు సంతోషంగా ఆ ముహూర్తానికే పెళ్ళి చేసి నేను నిశ్చింతుడ నవుతాను!' అన్నాడు కేశవ! కామేశ్వరికి తల గిర్రుమని తిరిగి పోయింది! కేశవకితన్ని భార్యగా చూడటం ఏమాత్రం ఇష్టంలేదని స్పష్టపడింది! ఆమాట ఎంత గౌరవంగా, మర్యాద వచ నాలతో చెప్తున్నాడు? కళ్ళమ్మట నీళ్ళు వచ్చాయి! ఇంత గౌరవనీయుమైన వ్యక్తి సాహచర్యంకన్నా, వెర్రి కోరికలతో పొంగులువారే యవ్వనంతో, అసహజమైన వెర్రి చేష్టలతోవుండే వయసు కుర్ర వాళ్ళ సాహచర్యం తనకి సుఖప్రదమవు తుందా? ఛఛ! తనలో ఎప్పుడూ అల్లాంటి నీచపు కామతృష్ణ కలగనే కలగలేదు! అయినా కేశవతన్ని ఎందుకని అనుమానించేడు? మనసు అల్లకల్లోల మైపోయింది కామేశ్వరికి! తను చదువు కోటటం అత్తగారి కిష్టంలేదు! సంసారం చేయటం భర్తగారికిష్టంలేదు! ఎలా?

* * *

తన ఇంటిముందు కేశవ కారు ఆగి వుంటం చూసిన రామనాథం, 'నళిని'వచ్చి వుంటుందని వూహించాడు! కాని ఇంట్లోకి రాగానే 'కేశవ'ని చూసి కొంచెం కంగారు పడ్డాడు. తాతయ్య ఏదో పనిమీద పట్నం వచ్చి కొడుకులవద్ద నాల్గురోజులనించీ వున్నాడు! తన కొడుకులకోసం కార్లమీద వచ్చే పెద్ద మనుషులనిచూసి తాతయ్య చాలా సంబరపడుతున్నాడు! తన కొడుకులు కాలేజీ చదువులు చదువుతున్నారు! అందు కని అందరికళ్ళూ వాళ్ళమీద పడు తున్నాయి! అని అనుకున్నాడు! రామనాథం వచ్చేదాకా తాతయ్యా, కేశవా ఏదో లోకాభి రామాయణం మాట్లాడుకుంటున్నారు. రామనాథం రాగానే,

'రావోయి కథానాయకా! నీ కోసమే వచ్చాను! అనుకోకుండా, మీ నాన్నగారి పరిచయం కూడా కలిగింది?' అన్నాడు కేశవ! రామనాథం వూరుకున్నాడు. ఇంతలో మాధవకూడా వచ్చాడు. అందరూ కుర్చీల్లో కూర్చున్నారు!

'మా ఇంట్లో వకమ్మాయివుంది! కొన్ని కారణాలవల్ల మా ఇంటిలోనేవుంది! ఆ అమ్మాయిపేరు కామేశ్వరి! కట్నం కానుకల విషయం మీరాలోచించక్కర్లేదు!'అన్నాడు. రామనాథం శరీరం జల్లుమంది! ఇదేదో కథలావుంది! తమ పెళ్ళిచేసుకున్న భార్యకి మళ్ళీ పెళ్ళిచేస్తాడా ఈయన? కామేశ్వరి ఒప్పుకుందా? ఒకవేళ ఆ పిల్లే బలవంతం చేస్తోందేమో! తన తండ్రికి కామేశ్వరి పెళ్ళయిన పిల్ల అని తెలుస్తే ఏమన్నా వుందా? ఇల్లా ఆలోచిస్తున్నాడు రామ నాథం! మాధవ మహదానందపడిపోయేడు! కేశవయొక్క హృదయ సంస్కారానికి జోహార్లర్పించేడు!

'అయితే చూచివద్దామంటావా రామ నాథం?' అన్నాడు తాతయ్య. తాతయ్య కామేశ్వరిని ఇదివరకు చూడలేదు అంచేత ఇప్పుడు చూసినా ఫరవాలేదు! అనుకున్నాడు మాధవ.

'రామనాథాన్ని, మా అమ్మగారు ఇది వరకు చూడలేదు! ఒక్కసారి మా అమ్మ చూడాలనుకొంటూంది!' అన్నాడు కేశవ!

'అయితే వెళ్ళరా!' అన్నాడు తాతయ్య! రామనాథం, మాధవా బయలుదేరారు!

'నువ్వు తోడుపెళ్ళికొడుకువా? అన్నాడు తాతయ్య.

'కాదు! అతనూ పెళ్ళికొడుకే! అన్నాడు కేశవ!

'మీ అమ్మాయికి స్వయంవరమేమిటి?' అని నవ్వాడు తాతయ్య! 'సెకండురౌండు'లో మీరువద్దురుకాని అన్నాడు కేశవ.

రామనాథం మనస్సు సంతోషంతో తల మున్కలౌతూంది. కామేశ్వరికూడా తనని ప్రేమించుతూందన్నమాట!అప్రథమ సమా గమానికి ఉవ్విళ్ళూరుతున్నాడు రామనాథం! మాధవ్ మనస్సు రాకెటులా ఎగురుతోంది. నళినినిగూర్చి అనవసరంగా కోపం తెస్తు కున్నాడు! 'కామేశ్వరి' పెళ్ళి అయిందని తెలిస్తే రామనాథం ప్రేమించటం మాను కుంటాడని భయపడి ఆసంగతి తెలీని కుండా దాచింది పాపం నళిని! అని నళిని మీద జాలిపడ్డాడు మాధవ! ఇల్లా ఎవళ్ళ ఆలోచనలతో వాళ్ళు సతమతమయి పోయినారు!

'రామనాథం! నువ్వు నీకు కామేశ్వరిని ఇద్దామనుకున్నాననిజమేనా'అన్నాడు కేశవ.

'నిజమేనండీ!' అన్నాడు రామనాథం.

'మరెందువల్ల చేసుకోలేదు? కామేశ్వరి అందంనచ్చలేదా నీకు! మరి కట్నం చాల కనా?' అన్నాడు కేశవ. రామనాథం మాట్లాడలేదు! కేశవతో ఏమీ చెప్పటానికి రామనాథాని కెందువల్లో మనస్కరించటం లేదు!

'కామేశ్వరి నీకు బాగా అందం మనః స్ఫూర్తిగా నచ్చింది కదూ!' అన్నాడు కేశవ.

నవ్వి వూరుకున్నాడు రామనాథం.

'రామనాథం! మీ నాన్నకోరిన కట్నం మూడువేలూ నేనిస్తాను. నువు నిస్సంకో చంగా కామేశ్వరిని స్వీకరించు! ఒక అమాయిక కన్నె మెడలో మూడుముళ్ళూ వేసినందుకు నేనే పరిహారం ఇచ్చు కుంటాను! ఆమె వివాహిత అన్నమాట నీ మనసునించి తరిమివేయి! నాకుమాత్రం వివాహం అన్నది మటుకు నీ అంతస్సుకి హత్తుకోనీయి!' అన్నాడు కేశవ.

(ఇంకా వుంది)

ఏమేవ్-మనింటికెవరో చుట్టాలొస్తున్నారు - త్వరగా ఆకాలెండర్లన్నీ తీసి లోపల్దాచెయ్!!

# కాలం మించిపోయింది



పెరల్

చీ పీకట్లు 'సివ్వు' మంటుంటే రాగులికి రంజాగ వుంటది. గుబురు గుబురు చెట్లు దెయ్యాలు జడలు యిరబోసుకున్నట్లు సిన్నగ లికి కదల్తావుంటే, కేసురాళ్ళు గుండె పగిలేట్టు య్యరిగా రోదన సేస్తుంటే, ఎక్కడో దిక్కులేని కుక్కలు దీర్ఘంగా యేడుస్తుంటే, నక్కలు మూలుగుతుంటే, పెపంచం యావత్తూ నిద్దరోతుంటే రాగులకి వుల్లాసం. కొండల్ని పిండి సెయ్యగలంత ధీమా. మురికి గుంటల్లో కిచకిచలాడే కప్పలు దయిర్యాన్ని కలిగిస్తాయి,

బావి గట్టున కూచొని కత్తి కి పదును పెడుతున్నాడు రాగులు.

ఒళ్లంతా పగతో దహించుకుపోతుంది. నాయాల్టిది యీ రోజుతో సరి యిన్నాళ్ళ కష్టాలన్నీ వొక్క దెబ్బతో దిమ్మ తిర గాల. రెండేళ్ళు జైల్లో యిరుక్కుంటే తన అతీగతీ యిచారంచను వొక్క మారుగూడ తిరిగిచూడ్లే. తనెంతో సువాయానంగా దోసుకున్న సొమ్మంతా వాడి పొట్టన పెట్టేశాడు. రత్తికిభయ పడి తన భాగమంతా వాడికాడ్నే దాచేడు. దొంగ నాయ్యాలు ఆ నాగులుగాడు తన సేతులతో నిలబడి తనకే ఎదురు తిరిగాడు.

పొద్దున్నే జెయిల్లోంచి యిడుదలై వస్తుంటే గుర్రబండిలో డాబుగ కూర్చుం డాడు. తన్ను నూసిగూడ నిర్లక్ష్యంగా చుట్టు ముట్టించి దాటి పొయ్యాడు.

అరికాలిమంట నెత్తికెక్కేసరికి ఒక్క వూపున పోయి బండిని నిలేశాడు.

'ఫోరా, యొదవ అడ్డులెయ్' కొరడా ఝుళిపించాడు.

'ఒరేయ్ నాగులూ, నేనురా రాగుల్ని'

'ఎవడైతే నాకేం. పక్కకు తొలగురా యెదవ' కొరడాతీసి అంటించాడు కైపులో నాగులు.

ఆ మాట, దెబ్బ కళ్ళు నిప్పుల్లు కమ్మించినయి.

గుర్రబండి సర్రున దూసుకుపోయింది.

రాగులకి నరంనరం మండింది. యీ డెప్పుడైతే తన్ను నూడ్డానికి రాలేదో అప్పుడే అనుమానం యేసింది. అదిప్పుడు యెల్లడయింది. లాఠీదెబ్బలతో డొక్క సితికిపోతున్నా మాటకు కట్టుబడి పోలీసోళ్ల ముందు నోరు మెదపలే. తన సొమ్మంతా నూకడమే గాకుండా, తన్నే యెధవకింద జమ కట్టేసినాడు. గుర్రబ్బండి యెక్కంగానే మొనగాడయ్యాడా, యీడు! యీడి నీలుగెంతో నూడాల యీడంతు తేల్చాల. భుగభుగ మండే రోషంతో తన గుడిసెకొచ్చాడు.

రత్తి నూడంగనే కరుసుకుంది. 'యెన్నాళ్ళ కొచ్చావు మావా' అంటూ యిలపిస్తూ సుట్టుకుంది. తనేం సముదాయించలేక పొయ్యాడు. తనలో ద్వేషం భగ్గుమంటుంది.

'అటో, యిటో యియ్యాళే తెల్సు కోవాలే'

'ఏంది, మావా జెయిల్లోంచి ఒచ్చి మళ్లీ పాడు ఆలోచనలు మొదలు పెట్టుండావా'

'యియ్యాళ అద్దం సెప్పకే. నన్ను మోసంచేసి వాడు బతికి బట్టకడతాడా!' ఎంత ఆపుకుందామన్నా యేడిగా బుస లొస్తుండాయి.

రత్తికి గాభరా యేసింది.

'మావా, రోషాలు, ద్వేషాలు మనకు కూడు పెడ్తాయా. అవి మనల్నే దహిస్తాయి. యిన్ని రోజులకొచ్చి మళ్లీ బుర్ర సెడగొట్టుకుంటావు. ఎందుకొచ్చిన గొడవలు మావా. మన కష్టం మనకు వుండనే వుంది. మనం సుఖంగా బతకలేకపోం'

'ఒసే వుండే నీ నచ్చు మాటలు నువ్వూనూ. ముందు బువ్వ పెట్టు. ఆనక సంగతి దేవు డెరుగు' రాగులు యిసుక్కొని తిండికి తయారయ్యాడు.

* * *

రచ్చకాడ కర్రసాము జోరుగ సాగుతుండది. రాగుల సేతిలో కర్రుండో లేదో కనపడ్డమేలే. సెమటలో వొళ్లంతా తడిసినా ఏకబిగిన రివ్వున కర్ర తిప్పుతుండడు మాయగ తిరిగినట్టుండదేగాని. వొకపక్క కర్ర యేడ జారద్దోనని బయపడతుండారు. పెద్దోళ్లకీ, రాళ్లకీ నిక్కినిక్కి జనం సూస్తుంటే సెట్లన్నీ తిక్కించి కదలడం మానేసినయి.

కర్ర సామైపోయింది. తప్పెట్లు మోగుతున్నాయి. దుర్గమ్మ వూరేగింపు జరుగుతుండది జనమంతా అటుకేసి వూరేగింపుతో యెనకాల్నే కదిలేరు.

రత్తి సూపు రాగులమీదే నిల్సింది. మావ శౌతుర్యాన్ని సూసి యిస్తుపొయ్యింది.

యింతసేపు దీర్గంగా సూసే నాగులి కేదో తట్టింది. గబగబ రాగులికాడికెళ్లి 'నిన్ను గొట్టే మొగోడు లేడురా' అని బుజం మీద తట్టాడు.

రాగులు వుబ్బి తబ్బిబ్బై రొమ్ము యిరుసుకున్నాడు.

'సోడా తాగుదాం పద రాగులూ' కొట్టు కాడికి దారి తీశాడు నాగులు.

'ఎన్నడూ లేంది యేంది కొత్తమడిసి యింత 'యిది' సూపిస్తుండడు తనమీద' తన అదురుష్టానికి మురిసి పొయ్యాడు రాగులు.

'సానం సేద్దువుగాని పదరా' నాగులు చుట్టకు నిప్పంటించాడు.

రాగులు బావికాడసేరి సానం సేత్తుండాడు.

బిందెను వొంటిసేత్తో అలాయిలగా యెత్తి పైన కుమ్మరించుకుంటుంటె వంటిమీది కండలు యింపుగ కదలతుండయి. నల్లగ, విశాలంగ వున్న యెదురు రొమ్ముమీద యెగిరి పడుతున్న నీటిబొట్లు, సూరీడి యెలుగుకి నిగనిగ కనపడే మెరుపులు, నీళ్లు తోడేప్పుడు మెలిదిరిగిన రెక్కల కండలు, యినప దుక్కల్లా వున్న తొడలు, బిర్రుగా బలిసిన మెడ నాగులి గుండెలో దురాలోచనల్ని ముద్ర గొట్టినయి.

గట్టిగ సుట్ట పీల్చి వదలిన పొగలో తనాలోచనలకు రూపు దిద్దుకున్నాడు

'ఒరేయ్, రాగులూ నీతో పనుందిరా. రేపా రేతిరికి పట్నం బోతాం. డబ్బును గురించి నువ్వేం దిగులు పడొద్దు'

'పట్నం సూపిస్తాడు, తను' ఎగిరి గంతేశాడు రాగులు

రయి లెక్కడం అదే మొదటిసారి, రాగులుకి. యిదంతా నాగులి సలవ. లేకుంటే తన జిన్మలో సూసేవాడేనా అంతా యింతగా కనపడుతుంది. తనో కొత్త పెపంచంలో అడుగు పెడుతున్నాడు.

పట్నం స్టేసనులో రయిలాగింది. తిరణాల్లో వున్నంత జవాన్ని సూసి ఎంతో యిస్తుపొయ్యాడు రాగులు. 'ఏంది, యింత బంహాండంగా వుంది. యింతమంది మనుషులు ఆడా, మగా'

'దీనికే యింత యిదైపోవాలే. ప్యాకోలు సూస్తేగదా తెలిసేది.' నాగులు రెండు సుట్టలు పక్క జేబులోంచి దీసి రాగులు కొకటిచ్చాడు.

'నా కెందుకులే, నాగులూ, ఒళ్లు తిరగద్ది'

'సుట్ట తాగలేనోడివి నువ్వేం మగోడివిరా. ఈడ ఆడోళ్లు కూడ కాలుస్తార్రా' నాగులు ఎగతాళ్జేసి నిప్పంటించాడు. రాగులు బలవంతంగా పొగపీలుస్తున్నాడు.

గేటుకాడ టిక్కెట్లిచ్చి బయట కొచ్చారు. కార్లు, పెద్దపెద్ద రోడ్లు, సుక్కల్ని తాకే మేడకేసి నోరు తెరిచాడు రాగులు.

'ఇదేంది. యిదో కొత్త పెపంచంలా గుంది'

'నువ్వింకా సూడాల్సినయి శానా వుండయిరా' నాగులు టీ కొట్టుకేసి దారి తీశాడు.

అప్పుడే సీకట్లు కమ్ముకుంటున్నాయి. ఎలక్ట్రీ దీపాలు మిరుమిట్లు గొల్పేట్లు ఎలుగులు యిరజిమ్ముతున్నాయి. అంతా పట్టపవలై పోయింది. రంగు రంగుల అద్దాలతో డాబుగ నిల్సోనుండే మేడల్ని సూసి 'నాగులా, యింద్రభవనాలుగా వుండాయే. ఈడ మనుషులేనా వుండేది' రాగులు తనమున్కలై అడిగాడు.

నాగులు కవను దొరికింది. వీడ్ని కైపెక్కించి బుట్టలో ఏడేసుకోవాల.

'రాగులా. నువ్వీనా పెపంచమంతే యేందనుకున్నావ్. డబ్బు. ఆ డబ్బుతోనే గడ యింతా నేడ నిల్సింది. ఈడ మనుసులు డబ్బుతోనే గద డాబుగ బతికేది మన కళ్లకు వైభవంగా ఎట్టా కనపడుతున్నారనుకున్నావ్. మనం వూరోగడిసెల్లో గద కాలం యెళ్లబుచ్చేది యివి యింద్ర భవనాలు ఎందుకూ. ఈడ డబ్బున్న మనుషులేరా బతికేది.'

నాగులు యింకొకసారి నిప్పంటించి రాగులికి నవక రకం సిగరెట్టు అందించాడు.

'యిది ఫారిను తక్కువ వుంటుందే'

మనసులో యేమేమో వూహించుకొని రాగులు పొగపీల్చాడు.

నాగులు మళ్లీ అందుకున్నాడు 'రాగులా. మనం తినేది ఒక తిండేనా. ఈళ్లు రకరకాల పిండివంటలతో దర్జాగా కార్లలో తిరుగుతూ బతుకుతారు. దీనికంతా కారణం యేందనుకున్నావ్-డబ్బు. యెట్టా సంపాదించారనుకున్నావ్ యాపారాల్లో మోసాల్సేసి దొంగనోట్లు ముద్రగొట్టి. బతికితే యిలా వైభవంతో బతకాల్రా. మనంతా బతుకులేనా! కట్టుకోను గుడ్డల్లేక వొళ్లంతా యిరుసుకొని తెల్లార్లు కష్టపడ్డం, పాలిసోలని తిండి తినడం. ఈళ్లు వొళ్లొంచకుండ లక్షలు సంపాదిస్తున్నారంటె యేందనుకున్నావ్'

# కాలం మించిపోయింది

రాగులు మనస్సు పరిపరివిధాల తిరుగాడుతుంది. ఎట్లాగా డబ్బు సంపాయించేది దర్జా బతుకెప్పడు బతికేది. ఎన్ని మాయలుగ వుండాయి. యేదో ఒక తెగింపు కొచ్చాడు.

'నాగులా, యిట్టాంటి జీవితమే కావాల్రా'

'ఊరకనే అబ్బుద్దా. గుండె దయిర్యం కావాల యిూ షావు సూసినావా. యిూడు యేడ్నో నగలు దొంగిలించి యిూడ మహా రాజైనాడు. కారు కొన్నాడు, మేడ కట్టాడు.'

'నువ్వే నాకో మారగం సూపాల నాగురా. నీ మాటే యినుకుంటా'

'అట్టా రారా దారికి. రెక్కలు ముక్కలు సేసుకుంటే యిూ ధరల్లో మనం నాయంగా బతగ్గలమా'

రాగుల్ని దగ్గరికి లాగి చెవులో మెల్లిగా వూదాడు నాగులు.

పాము బుస అదటుపాటున విన్నట్టు ఆ మాటకు అదిరిపొయ్యాడు. విలువెల్లా కళవళ పడ్డాడు. కాసేపటికి తెములుకుని 'పాపం' అన్నాడు రాగులు.

'ఇంతేనా, నీ తెంపు. దీనికే బెంబేలు పడ్డావు. నువ్వేం యెక్కాపెర్తావురా. పాప పుణ్యాలు యిశారిస్తే ఏది గుడిసె బతుకేరా. యెనక ముందుల సూస్తుంటే లాభంలే. యేనుగంత్తై నీ యెనక నేనుంట. నీకేం బయంలే'

నాగులి పాచిక పారింది.

'నీ మాట కెదురు సెప్తానా. నా రత్తి మీద ఒట్టు. నువు సెప్పినట్టే యినుకుంటా' రాగులు గట్టి నిశ్చయానికి కొచ్చాడు.

*   *   *

లోకం యెలుక్కు యిసుగెత్తి సీకట్ని సింగారించుకుంది. మినుకుమినుకు మంటు సుక్కలు నిప్పురవ్వల్లా మెరుస్తున్నాయి. నిశ్శబ్ద వీధికి సెట్లు, సేమలు నివ్వెరపోయి నిలుసున్నాయి.

రాగులు భోంచేసి దీర్గంగా యోచిస్తూ బండకేసి ఆనుకున్నాడు. సుక్కల్నితాకే మేడలే కనపడుతుండాయి. దర్జాగా గుడ్డ లేసుకుని సిగరెట్టుకాలుస్తూ రత్తిపక్కన తానూకూకొని రయ్యిన కార్లోపోతుంటె—ఆహా, అదిరా బతుకంటే. తలుసుకుంటుంటే వొక సుక్కనిాదనుంచి యింకో సుక్క నిాదకి యెగురుతున్నట్టుంది.

రాబోయే అదురుష్టాన్ని రత్తికిసెప్తే వుక్కిరి బిక్కిరి అయిపోదాంట. అమ్మో! మరి నాగులు రకస్యం అన్నాడే. ఆడదానికి అసలు సెప్పొద్దని ఒట్టేసుకున్నాడే.

వక్కాకుతో యెరుపెక్కిన పెదాలతో, బిర్రుగా బిగించిన సీరతో పొడుచుకొచ్చిన పాయంతో వూగిసలాడుతున్న రత్తి 'మావా' అంటూ బయటకొచ్చింది.

'రాయే, కాసేపు యిూడ్నే కూసుందాము' సీర కొంగుపట్టుకొని రత్తిని మీదకు లాగాడు.

'ఉండు, మావా. బయటని కూడా తెలవదా' విదిలించుకొని కాస్త దూరంలో కూర్చుంది.

'మావా, మొన్న స్నానం సేత్తుంటే నీకేసే సూస్తా నీకాడే వున్నాడే ఎవరాడు'

'వాడు శామంచోడులే. వాడేగద నన్ను పనివిాన పట్నం తీసుకు పోయింది.'

రత్తికేమో వాడి మొగం నచ్చలే. కుర్ర మనిషిగ తినకగపడ్డాడు. మరి మావేమో మంచోడంటున్నాడు.

రాగులు పట్నంలో తను సూసిన గొప్పలన్నీ సెప్పుకొచ్చాడు. సివర్న 'పట్నంలో కాపరం పెట్టాల్నే. యెట్టయినా డబ్బు సంపాయించాల్నే. అదేనే దిగులు.'

'దీనికెందుకు మావా యింత యిదై పోతుండావు. దూరపుకొండల నునుపుకు బెమసి పోతుండావు నీకండల్లో బలము స్నంతకాలం మనకేం బయం మావా. దేవుడు సల్లంగ సూడాల్నేగాని కష్టపడి పనిసేస్తుంటే రోజులిట్టే గడిసిపోవా'

'రెక్కాడితే డొక్కాడే రోజులు పోయినయ్. మోసాల్తోనేగదే యిప్పుడు లోకం నడిసేది. పట్నంలో సూడు వొళ్ళలిరిగేటంతటి మేడలు, ఆదర్జాలు డాబులు, కార్లు—యెందుకే మనంయిా బతుకులేనా' యీసడించుకున్నాడు.

వొకటొకటే రాగులితఉప్పలు సాస్తున్నయి.

'నిన్ను మనువాడిన కాడ్నుంచి యిూ గుడిసెలోనే యెళ్ళదీస్తున్నాం. యెదుగూబొదుగూలే. అదురుష్టం సుడిదిరగాలే

గాని నేసెయ్యబొయ్యేవనితో మనం బస్తీలో కాపురం పెట్టమంటే.'

'ఏంటది, మావా'

'నీకెందుకులేయా. మగోళ్లం. మేమేదో తంటాలు పడతాం'

'అట్టనకు మావా. నీబుర్రలో యేందో పెద్ద తలపులుండాయి. లేనిపోని ఆశలు నీకెందుకు మావ. వున్నా అదృష్టవద్దా వుండాలి. బస్తీలో వాళ్లతో మనకేం పని. సెంపాయలోకి నీళ్లు అవ్వే వస్తాయి, అవ్వే పోతాయి. మనంగాని సూస్తుండామా! అంతేమావ యెవరి కష్టం వాళ్లది. యెవరి అదురుష్టం వాళ్లది.'

*　　　*　　　*

లారీల్లో సరుకులు మొయ్యాలని రాగులో పొద్దుకాడ లేచిపోయేవాడు. తెల్లారేసరికి తిరిగొచ్చేనాడు. ఆయాళ నెకలేసు రత్తికిచ్చాడు. యెంతగానో అబ్బుర పడింది రత్తి.

'యాడది మావా, యిది'

'నీకు తెలవదులేయా నే కొన్నాలే.'

'సత్తెంగా, యింతేడది మావా'

'నీకోసమే రదే

'లారీల్లో సరుకులుమోస్తే యింత సొమ్ము ముట్టదా'

ఈ మాటతో రాగులు తొట్రుపడి తమాయించుకున్నాడు,

'సరుకులు ఎత్తిందానికి, దించిందానికి బాగా ముట్టద్దిలేయా' దబాయించి బయట కెల్లాడు.

రత్తికేమో అనుమానంగానే వుంది.

నెకలేసు చక్కపెట్టెలో దాసేదానికి మూతతీసింది. అడుగున అట్టపెట్టె తెరిచేసరికి మరింత అబ్బురపడ్డది—నోట్లకట్ట. 'యాడ్నించి వచ్చింది యింత డబ్బు.' మూతిమీద యేలేసుకుంది.

ఆరేతిరి రాగుల్ని నిలేసింది.

రత్తి గబగబ చెక్కపెట్టెలోవున్న డబ్బు, నెకలేసు రాగులిమిదకు యిసిరి కొట్టింది.

'దొంగతనం చేశావా మావా' రాగులు బిక్కచచ్చిపొయ్యాడు.

'ఈ దొంగ సొమ్ముతోనా మనం బతికేది. యిదీ వొక బతుకేనా' రత్తి కుమిలి పోయింది. మావను కరుసుకొని బిగ్గరగా యేడ్చింది.

'యిట్టాంటి పని సెయ్యమాక మావా. నీతీ నిజాయితీ లేనిది అదీ ఒక బతుకేనా. కలకాలం నిల్సేది కష్టపడ్డ సొమ్మే మావా.' నోరు పిడచబారి పోయింది. డగ్గుత్తికతో, కళ్లనీళ్లతో సెప్పగలిగింది.

'రేతిరికాడ లారీల పనికి పోమాక. పొద్దుటెయ్యి మావా, మళ్లీ సెయ్యనని'

'యియ్యాళతో ఆకరులేయా' సెప్పలేక సెప్పాడు రాగులు.

ఆయాళ మద్దానమే ప్లానేసుకున్నారు. దగ్గర బస్తీలో మేడగలోడు బ్యాంకులోంచి యేలు తెచ్చిండు. దొంగసారా పెట్టి గడించినోడు. ఏవో యాపారాల్జేసి, యెంత మంది కొంపల్ని కూల్చి నిలబడ్డాడో, దొంగ సొమ్ము దొంగతనంగానే పోవాల.

రాగుల్ని కరుసుకొని పడుకుంది రత్తి. రాగుల కెప్పుడెప్పుడు బయటపడదామాని వుంది. ఇది అనుకున్న పెకారం జరిగితే బస్తీలో తను కాపరం పెట్టొచ్చు. రత్తేమో మేలుకొనే వుంది. తన కారాటం జాస్తవతుంది. ఎంతసేపటికి తను రాక పొయ్యేసరికి వాగులుగాడు బయట యీలే



తిస్తానంటూ
'ఒసే వొంటికి పోవాల్నే' సిన్నంగా. సెవిలో సెప్పి నాగులుగాడ్ని సీకట్లో కలుసుకున్నాడు.

'ఏం సొయ్యేకాలం వచ్చిందిరా. యింత సెప్పు సేలేను' నాలుగు కసురుకున్నాడు.

'నాయింటిగి వదల్లేదురా' సెమాపణ సెప్పుకున్నాడు రాగులు.

'పెద్దగొప్పోలేయ్. మాకంతా లేరనా. మనం అనుకున్న పైవేంటి, నువ్వింత ఆలస్యం సెయ్యడం బలేవే' కోపం, యినుగు పోలే యింకా నాగులుకి.

కటికిసీకట్లో కాలికొద్దీ అడుగులేస్తున్నారు, మురికికాలవలోంచి సెడ్డావసన గుప్పున వస్తుంది. ఊపిరి బరువుగ పీలుస్తూ వ్యూహాల్లో తేలుతున్నారు.

బ్యాటరీ లైటు, మారు తాళాల గుత్తి, సిన్నకర్రు, సుత్తి—మొల్లో దోపుకున్నారు.

గుడ్డెలెతురు యింటోంచి వస్తోంది. వీధి ఎల్కట్రీదీపం కంటకంగా కనపడ్డది. రాగులు స్తంభాన్నెక్కి మెల్లిగ దీపాన్ని వూడబెరికాడు. సీకట్లో కావల్సినంత దయిర్యాన్ని పుంజుకున్నాడు. నాగులి సెవిలో గొణిగి దొడ్డిగోడెక్కి లోపలికి దూకబడ్డాడు రాగులు. కాసేపటికి లైటేసి బయిటికి సన్నసేశాడు. నాగులు లోపలికి దిగి రాగులు దోచింది అందుకుని యెలుపల పడ్డాడు. రాగులు పెట్టెనెత్తుకొని గోడెక్కేసరికి యెలుతురు పడింది. గుండె లవిసిపొయ్యాయి. పోలీసు యిజిల్పు యిన పడ్డాయి. రాగుల్ని వొక్కదుట్న సుట్టు ముట్టేశారు. లాఠీదెబ్బలతో వొళ్ళుతిరిగి పడ్డ రాగుల్ని ఉజాద్చుకెళ్ళి కటకటాల మద్యకుతోశారు. నాగులుగాడి జాడే తెలవలే.

* * *

రేతిరి సిక్కటి సీకట్లో సిక్కుకుంటె అట్టహాసంగా అడుగులేస్తున్నాడు రాగులు. తోకవిూద నిల్పొని కాటేసే త్రాసుల్లా వున్నాయి కొబ్బరిసెట్లు. కీసురాళ్ళు భయపడి యెర్రిగ అరుస్తున్నాయి. వంట కాలవ నిండుగ సవ్వడు సెయ్యకుండా బెదరి అణగివుంది.

సీకటికి అలవడ్డ నడకతో యేట్నీ తెక్క సెయ్యకుండా గట్టునే వొక్కయిసర్న పోతుండాడు

# కాలం మించిపోయింది

మొల్లో సెయ్యిపెట్టి తడిమి సూసుకున్నాడు కత్తిని. తనుపెట్టిన పదునుతో నిలు...నిలువునా నాగులిగాణ్ణి చీరెయ్యాలి. ద్వేషంతో వూపిరి బుసలు కొట్టుతున్నాయి.

రత్తి గివ్వున పరుగుతీస్తుంది.

మావేదో అఘాయిత్యం సెయ్యబోతుండాడు. తనడ్డుకోవాల. పగతో మావ పశువైనాడు. 'గుక్కెడు సారాతాగొస్తానే, శానారోజులయిం'దంటె తను అడ్డుసెప్ప లేక పొయ్యింది. అనుమానంగానే మావను యెంబడించింది. మరి యెక్కడ మాయ మయ్యాడో, అంతులే.

'అయ్యో బగమంతుడా, మావను రచ్చించు'

నాగులు గాడింటికే పొయ్యుండాల. వాడే బంగారం మావకు యిషంపోశాడు. వొళ్ళు తెలవకుండా పరుగులంకించుకుంది.

'మావా, మావా' రోదించింది రత్తి.

గట్టువిూద రాగుల కాళ్ళకు సుట్టు కుంది.

'మావా, వాడ్ని సంపొద్దు మనం లోకానికి పగ్గైపోతాం. యీ పాపం మన కొద్దు'

రాగులి కళ్ళల్లో నిప్పులు కురుస్తున్నాయి. ద్వేషంతో వూగి పోతుండాడు. కాలితో యిదిల్చి కొట్టాడు. కొబ్బరి సెట్టు మొదలకి కరుసుకుంది. తల్లోంచి నెత్తురు చిమ్మింది. ఆ దెబ్బను సరకు సెయ్యకుండా మళ్ళీ కాళ్ళకు సుట్టు కొంది రత్తి,

'అంత పశువ్వైతే నీ పగకి నన్నే బలిసెయ్యి మావా. నన్ను సంపి మరీ కదులు మావా'



'వాడి నెత్తురు సూడాల్నే' మాటరాక హుంకరించాడు.

'ఒద్దు మావా ఒద్దు. నా విూద ఒట్టే. నన్ను సంపే కదులు'

రాగులికి వోర్పు నశించింది. వొక్క తోపుతోశి పరుగు తీశాడు.

గట్టువిూంచి దొల్లుకుంటూ కాలవలో పడి కొట్టుకు పోయింది రత్తి.

పది బారాల దూరంలో నాగులిగాడి కొత్తగ కట్టిన మేడ కనపడింది. తన సొమ్ముతో నింబెట్టాడు దాన్ని. తనను నమ్మించి మోసం జేసి దొంగ పనిలోకి దింపి నిండుగా నాశనం సేశాడు. దెబ్బకు పది దెబ్బలు తియ్యాల.

అరే యింత రేతిరికాడ ఎల్కట్రీ దీపా లన్ని యెలగతుండాయి. యేంది యింత మంది జనం వాడి యింటిముందు గుమి గూడారు. తను సెయ్యబోయేది యీళ్ళం దరికీ తెలిసిందా! ఎట్టా తన పగ సల్లా రేది. వూపిరి బరువుగ పీలుస్తూ వాళ్ళ దగ్గరకొచ్చాడు.

అందరు గుసగుసలు సెప్పుకుంటున్నారు.

'పైన దేవుడు లేడాంట. మిడియాలపు బతుకెంతకాలం వుంటది. దొంగ సొమ్ము తిన్నోడు, దొంగసావు సావడా' అని. సారా మత్తులో గుర్రబ్బండి యిసర్న తోల్తున్నడంట. వొళ్ళు కైపెక్కి లారీకి గుద్దేశాడు. దానికింద పడి నెత్తురు ముద్దయినాడు. తీరా ఆసుపత్రికి పొయ్యేలోపల రగతమంతా కారిపోయె. ఏమేమో సెయత్నాలు సేశారంట డాకటేర్లు. ఏమి లాభం, యీ భూమ్మీద నూకలు సెల్లింతరువాత యింకా వుంటాడా.'

నజ్జునజ్జయిన నాగుల శవం రగతంలో రూపేలేకుండ వేలని కరుసుకోనుంది.

రాగులికి ముచ్చెమటలు పోసినయి. మనిషి తేలిపొయ్యాడు. తన్ను మోసంసేసి నోడికి భగవంతుడే శిచ్చేసినాడు. మాణిక్యం లాంటి రత్తిని తను కాలదన్నుకున్నాడు. తనకింక నరక కూపమే. యింకెందుకు తనకీ బతుకు—కాల్పనా.

నీరసించి కుమిలిన రాగులు మొల్లోని కత్తిని గుండెల్లో దింపుకొని 'రత్తీ వస్తున్నా' అంటూ కుప్పలా కూలి పొయ్యాడు—. ●

# గూఢచారి



## మల్లన్నమంత్రి కౌటిల్యం

మల్లన్నమంత్రి సైన్యం తాలూకు రహస్యాలను తెల్సుకోవడానికి దక్షిణ దేశపు రాజు కొంతమంది గూఢచారులను నియమించాడు. ఆ గూఢచారుల్లో పుల్లయ్య అనేవాడు మల్లన్న మంత్రి సైన్యంలో భటునిగా చేరాడు. కాని కొద్ది కాలంలోనే 'పుల్లయ్య శత్రువుల గూఢచారి' అనే విషయాన్ని సైన్యాధిపతి పసికట్టాడు.

రహస్యంగా సైన్యాధిపతి యీ విషయాన్ని రాజుకు, మల్లన్న మంత్రికి తెలియపర్చాడు. 'వెంటనే పుల్లయ్యను బంధించడం మంచిద'ని రాజు అన్నాడు కాని మల్లన్నమంత్రి అందుకు అంగీకరించలేదు. మల్లన్నమంత్రి తన రహస్యాలోచనా మందిరానికి రక్షణ నిమిత్తం పుల్లయ్యను నియమిస్తూ ఉత్తరువు జారీ చేశాడు.

'మల్లన్నమంత్రి యెందుకు యిలాగ చేశాడో' రాజుకు, సైన్యాధిపతికీ అర్థం కాలేదు. అయినా యిందులో యేదో ఒక యుక్తి ఉంటుందని వారు అనుకొన్నారు. ఆ ఉత్తరువును చూసి పుల్లయ్య చాలా సంతోషించాడు. మల్లన్న మంత్రి రహస్యాలను తను సేకరించవచ్చునని అతను అనుకొన్నాడు.

పదిహేనువేల సైన్యాన్ని సమకూర్చుకొని దక్షిణదేశపురాజు, రాబోయే దశమి నాడు తమ మీద దండయాత్రకు బయల్దేరనున్నట్లుగా మల్లన్న మంత్రికి వార్త తెలిసింది. రాజూ, సైన్యాధిపతీ కూడా యీ వార్తను విన్నారు. వారికి అప్పుడు పదివేల సైన్యం మాత్రమే ఉంది. అందుచేత దక్షిణదేశపురాజు తమను ఓడించివేస్తాడేమోనని రాజూ, సైన్యాధిపతీ భయపడ్డారు.

మల్లన్న మంత్రి మాత్రం యీ వార్త విని భయపడలేదు. ఈ విషయంలో యేమి చేయాలని రాజూ, సైన్యాధిపతీ మల్లన్న మంత్రిని అడిగారు. 'మనం యేమీ చేయనక్కరలేదు. దక్షిణదేశపురాజు మన మీద దండయాత్రకు బయల్దేరలేడు. అయినా, కొంత సైన్యాన్ని యుద్ధానికి సిద్ధంగా ఉంచడం మంచిద'ని మల్లన్నమంత్రి అన్నాడు.

దశమి వచ్చి వెళ్ళిపోయింది. కాని దక్షిణదేశపు రాజు దండయాత్రకు బయల్దేరలేదు. ఈ వార్తను విని రాజు ఆశ్చర్యపడ్డాడు. 'ఇందుకు కారణం యేమిటి?' అని రహస్యంగా రాజు మల్లన్న మంత్రిని అడిగాడు. అందుకు మల్లన్న మంత్రి యిలాగ అన్నాడు.

ప్రభూ! దక్షిణదేశపురాజు మన మీద దండయాత్రకు బయల్దేరినట్లయితే, ఆ సమయంలో తూర్పు దేశపురాజు తన సైన్యంతో దక్షిణ దేశపురాజు కోటను ఆక్రమించుకోవడానికి సిద్ధంగా ఉన్నట్లు తూర్పుదేశపు రాజు మనకు ఉత్తరం వ్రాసినట్లు ఒక ఉత్తరాన్ని సృష్టించాను. ఆ ఉత్తరాన్ని నా రహస్యాలోచనా మందిరంలో ఉంచాను. పుల్లయ్య ఆ ఉత్తరాన్ని చూశాడు. అందులో ఉన్న విషయాన్ని అతడు దక్షిణదేశపు రాజుకు తెలియపర్చాడు. తను దండయాత్రకు బయల్దేరినట్లయితే తన కోటను తూర్పు దేశపురాజు ఆక్రమిస్తాడని భయపడి దక్షిణదేశపురాజు మనమీదకు దండెత్తలేదు. ఈ విధంగా పుల్లయ్య మనకే ఉపయోగపడ్డాడు.

మల్లన్న మంత్రి దూరాలోచనకు రాజు చాలా సంతోషించాడు. ●









(క) 12 అగ్గిపుల్లలు తీసుకొని 1 వ బొమ్మలో చూపినట్లు అమర్చు.



ఇందులోనుంచి రెండే రెండు అగ్గి పుల్లలు తీసివేస్తే, రెండు చదరాలు మిగులుతాయి. అది ఎల్లాగో మీకు తెలుసా?

*   *   *

(ఖ) 1 వ బొమ్మలో నుంచి 4 అగ్గిపుల్లలను తీసి, మరొకచోట ఉంచి మూడు చదరాలు తయారు చేయగలరా?

*   *   *

(గ) 24 అగ్గి పుల్లలను 2 వ బొమ్మలో చూపినట్లు అమర్చు. ఇందులో



[illegible] 4 అగ్గి పుల్లలు తీసివేస్తే 5 [illegible]లు ఏర్పడతాయి. అది ఎల్లాగ?

*   *   *




(ఘ) 2 వ బొమ్మలో నుంచి 8 పుల్లలు తీసివేసి 2 చదరాలు మిగల్చగలరా?

*   *   *

(చ) 2 వ బొమ్మలో నుంచి 8 పుల్లలు తీసివేసి 3 చదరాలు మిగల్చగలరా?

*   *   *

(ఛ) 2 వ బొమ్మలోనుంచి 8 పుల్లలను తీసి, వేరేచోట్ల ఉంచి, 3 చదరాలు తయారు చేయడం ఎల్లాగ?

*   *   *

(జ) 2 వ బొమ్మలో నుంచి 8 పుల్లలు తీసివేసి, 4 చదరాలు మిగిలేటట్లు చేయగలరా?

*   *   *

(ఝ) 2 వ బొమ్మలో నుంచి 6 పుల్లలు తీసివేసి 3 చదరాలు మిగిలేటట్లు చేయగలరా?

*   *   *

(ట) 2 వ బొమ్మలో నుంచి 8 పుల్లలు తీసివేసి 2 చదరాలు మిగిలేటట్లు చేయగలరా?

*   *   *

(ఠ) 2 వ బొమ్మలో నుంచి 10 పుల్లలు తీసివేసి 2 చదరాలు మిగిలేటట్లు చేయగలరా?

*   *   *

(య) 18 అగ్గిపుల్లలను 3 వ బొమ్మలో చూపినట్లు అమర్చు.



ఇందులోని 6 పుల్లలను కదిపి, 6 సమానమైన చతుర్భుజాలు చేయగలరా?

(ర) 3 వ బొమ్మలో నుంచి 6 అగ్గిపుల్లలు తీసివేసి 5 త్రిభుజాలు మిగిలేటట్లు చేయడం ఎల్లాగ?

(ల) 3 వ బొమ్మలోనుంచి 6 అగ్గిపుల్లలు తీసివేసి 5 త్రిభుజములు మిగిలేటట్లు చేయడం ఎల్లా?

*   *   *

(వ) 12 అగ్గిపుల్లలను 4 వ బొమ్మలో చూపినట్లు అమర్చు. ఇందు



లోని 4 పుల్లలను కదిపి, 3 సమబాహు త్రిభుజాలు చేయగలరా?

*   *   *

(శ) 4 వ బొమ్మలోనుంచి 3 అగ్గిపుల్లలను కదిపి 9 చతుర్భుజాలను తయారు చేయగలరా?

*   *   *

(ష) 15 అగ్గిపుల్లలను 5 వ బొమ్మలో చూపినట్లు అమర్చు. అందు



లోని 3 అగ్గిపుల్లలను కదిపి 2 చదరాలు తయారు చేయగలరా?

*   *   *

అగ్గిపుల్లలతో చేయదగ్గ గమత్తులలో ఇవి కొన్ని మాత్రమే. మీరు స్వయంగా కొత్త సమస్యలు తయారు చేయవచ్చు. ఏదైనా పార్టీకి వెళ్లినప్పుడు ఒక అగ్గిపెట్టె జేబులో వేసుకు వెళ్లడం మరువకండి. దానితో చాలా ఉపయోగాలున్నాయి.

(జవాబులు 63 వ పేజీలో)

## కొత్త శీర్షిక ప్రారంభం




## రంగులరాట్నం

# మృగరాజు

[పిల్లలకి ప్రత్యేకించబడిన ఈ శీర్షిక రచయిత శ్రీ జమ్మి కోనేటిరావు కడపలోని ప్రభుత్వ కళాశాలలో జంతు శాస్త్రోపన్యాసకులుగా పనిచేస్తున్నారు. వీరు జంతు శాస్త్రానికి సంబంధించిన అనేక పుస్తకాలను కూడా రాశారు.

—సం॥]

పిల్లి 'కుటుంబం'లో, సుమారు 50 జాతులున్నాయి. వాటికే కాక, మొత్తం జంతువులకే, రాజు అని సింహానికి ప్రతీతి. అంతే ఈ మృగరాజుకుండే ధైర్యం, మిగిలిన పిల్లిజాతులు కొన్నిటితో పోలిస్తే, తక్కువే! కొన్నిటికుండే వేగం కూడా లేదు. అంతంతగా చెడిన మాంసం తినడానికి కూడ దీనికి అభ్యంతరం లేదు! అయితే మగ సింహానికి ఉండే జూలు, ఈ రాజరికానికి ఆస్కారం ఇచ్చింది—అందంలో కూడ కొన్ని తోటి పిల్లులతో తీసికట్టయినా. పైగా 'గర్జన' సింహానికి ఒక ప్రత్యేకత నిచ్చింది.

సింహం ఎక్కువగా ఆఫ్రికాలో ఉంటుంది. ఇండియా గిర్ అడవుల్లో (సౌరాష్ట్ర) కూడా ఉంది. అయితే ఆఫ్రికా సింహం గాంభీర్యమే వేరు. అక్కడ కొన్నిచోట్ల మనిషి ఉన్నా పట్టించుకోక దరిదాపుల కొస్తాయి.

అవసరమొస్తే సింహాలు చెట్లుకూడా ఎక్కుతాయి. వాటి తోక వెనక కుచ్చు ఉంటుంది. అయితే అందులోనే, ఒక వాడి ఆయుధం లాంటిది ఉంది. దాని ఉపయోగం ఏమిటో మనకి తెలియదు.

సింహం పిల్లలు బాగా పెద్దవయితే కాని ఒంటిగా పోవు. అవి అసలు 'ఇల్లు' వదలవు. అవసరాన్నిబట్టి తల్లి గదమాయిస్తూంటుంది. పెద్దకాలంవచ్చే రోజులకి శక్తి ఉడిగి పోతుంది. ఇతర జంతువులు తినగా వదిలినదే శరణ్యమవుతుంది. అప్పుడే మానవుడి మీదకు దృష్టి మరుల్తుంది. ఆ రుచి మరిగితే కష్టం. అయితే మామూలుగా మనిషి జోలికి రావు.

సాధారణంగా సింహాలు కలిసి కట్టుగా గుంపులో ఉంటాయి. వేట కూడా మూడు నాలుగు కలిసే చేస్తాయి. వేటాడవలసిన జంతువులను ముందుతట్టుగా ఒకటిపోయి చూచాయగా తన 'వాసన', గాలి వాటు వీలుగా ఉండటంవల్ల, అందిస్తుంది. ఆ జంతువులు నెమ్మదిగా అక్కడ నుండి తప్పించుకొని వ్యతిరేకమార్గంలో ప్రయాణిస్తాయి—మేసుకొంటూనే. కాని ఆ క్రింద రెండు మూడు పొంచి ఉంటాయి. గాలి వాటం లేకపోవటంవల్ల వీటి వాసన ఆ అమాయక జంతువులకు అందదు. దరిదాపులో కొచ్చాక అకస్మాత్తుగా మీద పడతాయి. చిన్నజంతువులయితే పంజా దెబ్బకి పడిపోతాయి. అవసరమొస్తే జంతువు మీదకి యెక్కికాని, క్రిందనించి తల లాగి గాని మెడ విరిచివేస్తుంది. ఆతరవాత అన్నీ కలిసి తింటాయి సాధారణంగా సాయంకాలంనుండి అర్ధరాత్రివరకు ఈ వేట సాగుతుంది.

ఒకొక్కప్పుడు సింహం వేట ప్రయత్నంలో లేనప్పుడు జంతువుల దరిదాపుల్లో ఉన్నా, అది మీదపడనూ పడదు, ఇవి పారిపోనూ పారిపోవు. అదేదో వాటిమధ్య ఒప్పందం ఉన్నట్టు!

సింహాలు తమ పిల్లలకోసం, ప్రాణాలకు తెగించి పోరాడవు. ఒకొక్కసారి తమ పిల్లలు పట్టుబడ్డా, తమ ప్రాణంకోసం వెనకాడతాయి. కాని పిల్లను రక్షించుకోడానికి ముందుకు రావు!

—జమ్మి కోనేటిరావు

# పెద్దకథ




'ఇందిర ఒక ఆంగ్లో యిండియన్‌ని పెళ్ళాడిందట' హిస్టరీ లెక్చరర్ మిసెస్ మాధురీదేవి అంది బి. ఏ. క్లాసు తీసు [illegible] ఆ వాక్యం వింటూనే ఎలక్ట్రిక్ షాక్ తిన్నదానివలె వ్రాస్తున్న నా చేతిలోని కలం ఆగిపోయింది. [illegible]

బి. యస్సీలో ఉండేది సన్నగా, పొడుగ్గా, నల్లగా ... చాలా యాక్టివ్‌గా ఉండేది. ఆ అమ్మాయేనా?' అడుగుతున్నారెవరో.

'ఔను. ఆ ఇందిరే' అంది మాధురీ దేవి.

నా కళ్ళు బైర్లు కమ్మినట్లయినయ్. ఏదో తెలియని భావోద్రేకంతో ఊగిపోయింది నా మనసు. ఇందిర! ఔను ఆ ఇందిరే! ఈ క్షణంలో కనుక ఆ ఇందిర నా కంటబడితే ఖూనీ చేసేసి ఉందును! అనుకుంటున్నాను నేను.

ప్రశాంతమైన కొలనులో మట్టిబెడ్డ వేసి కెలికినట్లయింది నా మనసు ఇందిర పేరు విన్నంతనే. నా జీవితంలో ఎన్నడూ ఏ మనిషినీ అంతగా ద్వేషించలేదు. అసహ్యించుకోలేదు నేను. అందునా నా విద్యార్థినులంటే ఎంతో ప్రేమ నాకు. లెక్చరర్‌గా నా ఐదేళ్ళ అనుభవంలో ఏ స్టూడెంటూ నన్ను అగౌరవపరచలేదు, నిర్లక్ష్యం చెయ్యలేదు—ఆఖరికి ఇందిర కూడా. కాని ఒక అమాయక బాలిక జీవితాన్ని సర్వనాశనం చేసిన ఇందిరను నేనే కాదు — ఆ భగవంతుడు కూడా క్షమించలేడు.

అప్పుడు మధ్యాహ్నం రెండుగంటలయింది. నాకు క్లాసు లేంలేవు. అందుచేత ఏవేవో స్మృతులను నెమరువేసుకుంటూ ఒంటరిగా కూర్చుండిపోయేను నేను. 'లంచ్'టైమవటం వలన మిగతా లెక్చరర్లంతా కాంటీన్‌నుండి ఏవేవో టిఫిన్లు తెచ్చుకు తింటున్నారు. నాకుమాత్రం తిండిమీద ధ్యాసలేదు. కాఫీ తెప్పించుకు తాగేను.

'ఏం సుమిత్రా! అలా ఉన్నావే?' అనడిగింది కెమిస్ట్రీ లెక్చరర్ మిస్ రాధ నాకొర్లిగ్.

'ఏంలేదు. తలనొప్పిగా ఉంది' అని జవాబిచ్చేను ముక్తసరిగా.

మళ్ళీ 'ఒంటరి తనం,' ఆలోచనలు. సుజాత జ్ఞప్తికి వచ్చింది. సుజాత, ఇందిరల స్నేహం, వాళ్ళిద్దరూ మాయింటికి రావటం, నన్నుకూడా ఒక స్నేహితురాలి వలె భావించి చనువుగా ఉండటం, ఇందిర చలాకీతనం, విలక్షణమైన అదోరకం తెగింపు, సుజాతలోని ముగ్ధత్వం...అన్నీ గుర్తుకు రాసాగినయ్. కాని ఆతరువాత,

ఆ తరువాత—భగవాన్ ఆ ఉత్తరం! తల్చు కుంటానికే భయంవేస్తోందిప్పుడు.

ఆరోజు — ఆరునెల్ల క్రితం అనుకో కుండా సుజాతను విజయవాడలో కలుసు కోవటం...ఔను. చూడగానే ఆమెను గుర్తేపట్టలేకపోయేను. ఆనాటి ఆమె ముఖం యిప్పటికీ గుర్తుకు వస్తే నా హృదయాన్నెవరో కెలికినట్లవుతుంది. పచ్చగా, ముద్దబంతి పువ్వులా మిసమిస లాడుతూఉండే సుజాత సన్నగా చీపురు పుల్లలా అయిపోయింది. నిర్మలంగా, దివ్యంగా వెలిగిపోయే ఆమె కళ్లు నిర్జీ వంగా ఉన్నయ్. ఈ ప్రపంచంలో సర్వ స్వాన్నీ కోల్పోయినట్లున్న ఆమె ఆకారాన్ని చూసేసరికే నాకు కళ్లనీళ్ల పర్యంతం అయింది.

'అయ్యో! ఏమిటి సుజాతా! నువ్వేనా? ఏమిటిలా అయిపోయేవ్?' అన్నా నేను.

నీరసంగా నవ్వింది సుజాత 'ప్రారబ్ధం అంటారే! అదే మేడమ్! ఎంతచేసికొన్న వారికి అంతే ప్రాప్తి' అంది విరక్తిగా.

'అసలు సంగతేమిటో చెప్పకుండా ఏమిటీ మెట్టవేదాంతం? ఇందిర ఎక్క డుందిప్పుడు? ఆమె యెలాఉంది? ఈ మధ్య కనపట్టమే లేదు' అన్నా నేను.

ఇందిర మాట యెత్తగానే పాముకాటు తిన్నట్లుగా ముఖం పెట్టింది సుజాత. 'ఇందిర యెక్కడ ఉంటేనేం. అలాటి మనుషులు ఎక్కడ ఉన్నా, ఏంచేస్తున్నా సుఖంగానే వెళ్లిపోతయ్ వాళ్ల బ్రతుకులు. నాలాటి దౌర్భాగ్యులకు జీవితంలో మిగిలేది చీకటే మేడమ్' అంది.

ఇందిరను గురించి ఆమె అన్నమాటలు మరీ విచిత్రంగా తోచినయ్ నాకు. అంత స్నేహంగా ఉండేవాళ్లు— యిప్పుడేమిటిలా మాట్లాడుతోంది? అయినా వెంటనే వాళ్లిద్దరికీ మనస్పర్ధలు రావటం ఎంతో సహజమైన విషయంగా తోచింది నాకు. విరుద్ధ ప్రకృతులుగల వారిరువురి స్నేహంచూసి ఆనాడే నాలో లీలగా ఒక శంక పొడసూపేది. ఎందుకో సుజాతలాటి అమ్మాయిల మనస్తత్వానికి ఇందిర సరి పడదని నా కప్పుడే తోచింది.

'అయితే మరి మీ శ్రీవారి సంగతేమిటి? ఆయనేం చేస్తున్నారు?' అనడిగేను ఇందిర టాపిక్ మార్చేద్దామనే ఉద్దే శ్యంతో.

నేనలా అడగ్గానే సుజాత తలవంచు కుంది. పాలిపోయిన ఆమె చెక్కిళ్ల మీదుగా కన్నీటిధారలు ప్రవహించ సాగి నయ్. మునిపంటితో పెదవులను నొక్కు కుంటూ దుఃఖాన్ని దిగమింగుకోవటానికి శాయశక్తులా ప్రయత్నిస్తోందామె.

నాకు మతిపోయినట్లయింది. సుజాత జీవితంలో ఏవో సుడిగుండాలు బయలు దేరినట్లు స్పష్టాస్పష్టంగా తెల్సోంది. కాని ఆమెలాటి అతిసామాన్యమైన స్త్రీ జీవితంలో కూడా సుడిగుండాలుంటాయిని ఎవరూ ఊహించనుకూడా లేరు.

'ఏమయింది సుజాతా? ఆ రోజుల్లో స్టూడెంటుగా ఉండేప్పుడే నాతో ఎంతో చనువుగా ఉండేదానివి. ఇప్పుడెందు కిలా దాస్తావ్ నా దగ్గర? నీ బాధేమిటో చెప్పరాదా నాకు? నీకు అక్కయ్యు లెవ్వరూ లేరనీ, నన్నే అక్కయ్యగా భావించుకుంటాననీ అనేదానివి. ఇప్పుడిలా సంకోచిస్తావెందుకు? నీకు ఏమీ సహాయం చెయ్యలేకపోయినా కనీసం నీ బాధలో పాలు పంచుకోగల హృదయం నాకుంది. ఆ సంగతి కూడా నీకు వేరే చెప్పాలా?' అన్నాను. ఆమె వెంటనే కళ్లు తుడుచు కుని నా చేతిని పట్టుకుంది.

'తప్పకుండా మీకు చెప్తాను మేడమ్. కాని యిప్పుడు కాదు. మీరు ఈరోజే హైదరాబాద్ వెళ్లిపోతున్నారు కదూ? నా గురించి మీకు తెలిసినవి, తెలియనివీ కనీసం ఊహించనివీ- ఎన్నో విషయాలతో మీకు ఉత్తరం వ్రాస్తాను' అంది నా చేతిని మృదువుగా నొక్కుతూ.

అదే ఆఖరిసారి ఆమెను చూడటం. తరువాత రెండురోజులకు కార్చిచ్చులా ఆమె హృదయాన్ని దహించివేస్తున్న బాధ నంతటినీ మూటగట్టుకొని వచ్చింది ఆమె ఉత్తరం.

'మిసెస్ సుమిత్రారావ్? ఏమిటలా కూర్చుండి పోయేరు? ఈరోజు యింటికి వెళ్లదలచుకోలేదేమిటి?' అంటోంది మిసెస్ కుల్కర్ణి.

ఆలోచనలనుండి తేరుకుని లేచేను. వాచీ చూసుకునేసరికి టైము నాలు గయింది. బెల్లయిన శబ్దం కూడా విని పించలేదన్నమాట నాకు.

భారంగా అడుగులేసుకుంటూ ఉమెన్సు కాలేజి ఆవరణనుండి బయటపడ్డాను.

ఆ తరువాత ఎలా యిల్లుచేరిందీ కూడా సరిగ్గా గుర్తులేదు.

ఆయన క్యాంప్‌కి వెళ్లేరు. ఇంకా వారంరోజులకుగాని రారు. ఒంటరి తనం నాలోని దిగులును మరింత ఎక్కువ చేసింది.

వెంటనే స్టౌ వెలిగించి టీ చేసుకుని తాగేను. టీ కలుపుతున్నంతసేపూ సుజాత జ్ఞప్తికి వచ్చింది. 'నాకూ మీలాగానే స్ట్రాంగ్ టీ అంటే యిష్టం మేడమ్. మనిద్దరికీ చాలా పోలికలున్నయ్. తప్ప కుండా పూర్వజన్మలో మనిద్దరం అక్క చెల్లెళ్లమే అయి ఉంటాం. సందేహం లేదు.' అనేది సుజాత.

'అక్కడికి పూర్వజన్మ అనేదేదో ఉండి యేడిసినట్లు— బయ్యాలజీ స్టూడెంటు అయివుండి, రోజా కప్పల్ని, ఎలుకల్ని పరపర కోసేస్తూకూడా శరీరాల్లో ఆత్మ లవేవో ఉంటాయని, వాటికి జన్మలుంటాయనీ నమ్మే ఫూల్ని నేనెక్కడా చూడలేదు' అనేది ఇందిర.

'పోదూ! నీ నాస్తికత్వం నువ్వూనూ. ఇప్పుడా కప్పల సంగతెత్తకు బాబూ. వాంతొస్తోంది. ఇంత మంచి టీ కూడా వెళ్లిపోయేట్లుంది' అనేది సుజాత.

టీ తాగాక రీడింగ్ రూములోనికి వెళ్లేను. ఆర్నెల్ల క్రితం సుజాత నుండి వచ్చిన ఉత్తరాన్ని ఆర్గానిక్ కెమిస్ట్రీ బుక్కులో పెట్టేను. షెల్ఫులో పుస్తకాల దొంతరల మధ్య నిలువుగా పెట్టిన ఆ పుస్తకాన్ని చేతిలోకి తీసుకున్నాను.

అందులోనుండి ఉత్తరాన్ని తీస్తూంటే నా చేతులు వణికినయ్. ఉత్తరాన్ని చేతి లోకి తీసుకొని పుస్తకాన్ని టేబుల్‌మీద పడేసేను.

వెళ్లి కుర్చీలో కూర్చుని టేబుల్ లైటు వేసేను. గదంతా చీకటిగా ఉన్న ట్లనిపించి. నా ఆలోచనల్లో పడి వాతా వరణాన్ని గమనించనే లేదు. ఎప్పుడు ప్రారంభమయిందో కాని వర్షం, ధార లుగా కురుస్తోంది. బయట వున్న పూల మొక్కలు గాలికి అల్లల్లాడుతున్నాయ్. వాతావరణం చల్లగావుంది. నా మెదడులో మాత్రం ఏదో వేడి.

ఉత్తరం విప్పేను. ఆ ఉత్తరాన్ని యించుమించు ప్రతి సాయంత్రం వీలు చిక్కినప్పడల్లా చదువుతూనే వుంటాను నేను. కాని ప్రతిసారీ ఉత్తరం చదవటం అయ్యాగానే నా శరీరం, మెదడూ కూడా మొద్దుబారిపోతయ్. నేను చదివినదంతా

విజమా, కలా అన్న సంశయం కలుగుతుంది.

ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నాను. పైన డాబామీది తూములనుండి పెద్ద పెద్ద ధారలుగా, ఏనుగు తొండాల్లోనుంచి వస్తున్నట్లు వర్షపు నీరు పెద్దగా చప్పుడు చేస్తూ కింద పడుతోంది. రివ్వున వీస్తున్న గాలి. ఉండుండి అసహాయురాలైన స్త్రీ హృదయాన్ని చీల్చుకువచ్చిన రోదన ధ్వనిలా ఉరుములు ఫెళఫెళమంటున్నయ్.

కళ్ళు తెరిచేను. జాలిగా చూస్తున్న సుజాతకి విపించిండి ఉత్తరంలో. యాంత్రికంగా చదవటం ప్రారంభించేను.

డియర్ మేడమ్!

మీరీసరికి ట్రైన్‌లో ఉండి ఉంటారు. ఇప్పుడు రాత్రి పది గంటలయింది. ఇంట్లో అంతా నిద్ర పోతున్నారు ఆదమరచి. నా చుట్టూ చీకటి — చిక్కటి చీకటి. ఆ చీకటి మధ్య నా గదిలో కొవ్వొత్తి దీపం వెలిగించుకుని వాళ్ళకు నిద్రాభంగం కలగకుండా నిశ్శబ్దంగా కూర్చుని మీకీ ఉత్తరం వ్రాస్తున్నాను. ఈ ఉత్తరం మొదలెట్టే ముందు నా గత జీవితంలోకి వోసారి తొంగిచూసుకున్నాను అమాయకత్వం, నైర్మల్యం మూర్తీభవించిన ఆ మధుర జీవితంతో యిప్పటి నా జీవితాన్ని పోల్చుకుంటే నాకే ఆశ్చర్యంగా వుంది. సుఖదుఃఖాలు వెలుగునీడల్లా మానవ జీవితాన్ని అంటి పెట్టుకునే మాట నిజమే. కాని యిరవై సంవత్సరాలు నిండకుండానే శాశ్వతంగా చీకటి వలయంలో చిక్కుకుపోయే నాలాంటి నిర్భాగ్యు లెక్కడయినా ఉంటారా?

సరే. అసలు సంగతికి వద్దాం. నేను పియూసీలో చేరినప్పుడు ఎలా ఉండేదాన్నో మీకు గుర్తుండే ఉంటుంది. సనాతన కుటుంబంలో పుట్టి, పల్లెటూర్లో ఎస్సెల్సీ ప్యాసయి వచ్చిన నేను హైద్రాబాదు నగర వాతావరణాన్ని చూసి మొదట బెదిరిపోయిన మాట నిజం. కాలేజీలోని మిగతా అమ్మాయిల బట్టలు, మాటలు, నడత అన్నీ విచిత్రంగా, విలక్షణంగా కనిపించేవి నాకు. నాతోపాటు పియుసీలో చేరినవాళ్లే, నా వయసులోనివాళ్లే నా కంటికి అద్భుతంగా కనిపించేవాళ్ళు.

# తప్పెవరిది?

మొదట నా కట్టూబొట్టూ చూసి అంతా చిత్రంగా చూసేవాళ్ళు నా వంక. సభ్యతకోసం నా మొహంమీదే నవ్వక పోయినా వాళ్ళ కనుకొలకుల్లో లిప్తపాటు మెరసి మాయమయ్యే అపహాస్య రేఖను గుర్తించగలిగిన నేను సిగ్గుతో చితికిపోయేను. తరువాత కొద్దినెలల్లోనే నేను కూడా వాళ్లలో ఒకతెగా మారిపోయేననుకోండి.

ఆ సంవత్సరమే మీరు కొత్తగా ఎమ్మెస్సీ ప్యాసయి కాలేజీలో చేరేరు. మీరు ఎంతో సింపుల్‌గా ఉంటారనీ, చక్కని ఉచ్చారణతో యింగ్లీషు మాట్లాడతారనీ మా క్లాసమ్మాయిలంతా మిమ్మల్ని మెచ్చుకునేవారు. ఇక నాకు కెమిస్ట్రీక్లాసున్నరోజు పర్వదినంగా ఉండేది. ఎప్పుడు క్లాసుతీసుకుంటారా, ఎప్పుడు మీరు అడిగే ప్రశ్నలకు గడగడమని గుక్కతిప్పుకోకుండా సమాధానాలిద్దామా అని కాచుకునేదాన్ని క్లాసులో ఎప్పుడూ సరియైన సమాధానాలు చెప్తాననీ, పరీక్షల్లో ఫస్టుమార్కులు ఎప్పుడూ నాకే వచ్చేవనీ మీరు నన్నెంతో అభిమానించేరు. మీరు, ఇతర లెక్చెరర్లు నన్ను అభిమానంగా చూడటంతో మిగతా విద్యార్థినులలో అంతకుముందు నా మీదఉన్న నిరసన భావన పోవటమేకాక కొందరిలో నా మీద అసూయ కూడా బయల్దేరింది.

ఇక పోతే క్లాసు బయట నా జీవితం మరింత చిత్రంగా ఉండేది. కట్టూబొట్టూలో అయితే మిగతా విద్యార్థినులను అనుకరించటం నేర్చుకున్నాను కాని వాళ్ళభావాలు, ఆలోచనలు నా మనస్తత్వానికి సరిపడేవి కావెందుకో, వాళ్ళంతా మగవాళ్లను గురించి, సినిమాల గురించీ, నగరంలో ప్రముఖస్థానాల నాక్రమించిన వ్యక్తులను గురించీ వెలిబుచ్చే అభిప్రాయాలు విచిత్రంగా, దారుణంగా ఉండేవి. మగపిల్లలు ఆడపిల్లలను వెక్కిరించటం వెంటపడటం ఎరుగుదును కాని ఆడపిల్లలే ఒంటరిగా వెళ్తున్నమగపిల్లాడిపై ఛలోక్తులు విసరటం, వీలైతే అవమానపరచటం నా కెంతో ఆశ్చర్యాన్ని కలిగించేవి. ఉమెన్సు కాలేజీల్లో చదువుకున్న అమ్మాయి లందరూ అలాగే ఉంటారని కాదనుకోండి. కాని వాళ్ళ సంఖ్య చెప్పుకోదగ్గ సైజులోనే ఉండేది. స్వేచ్ఛమోతాదుని మించినప్పుడు పురుషులే కాదు, స్త్రీలు కూడా తమలోని విశృంఖల భావాలను వెల్లడి చెయ్యటానికి వెనుదీయరని తెలిసింది నాకు.

ఉదాహరణకి, మా కాలేజీ ఆవరణలో రకరకాల పూలమొక్కలేకాక చల్లని నీడనిచ్చే పెద్ద పెద్ద వృక్షాలు కూడా ఉన్నయ్ అందులో ఒక జామిచెట్టు కింద పదిమంది కూర్చునేందుకు వీలుగా ఒక పెద్ద రాతిబండ ఉండేది. దాన్ని అంతా 'లవర్స్‌రాక్' అని పిలిచేవాళ్ళు. మొదటిసారిగా ఆ మాట విన్నప్పుడు ఉలిక్కిపడ్డాను నేను. ఆ తరువాత తరచూ అమ్మాయిలు 'లవ్' అన్న పదాన్ని ఎంతో చవకగా, అసందర్భంగా వాడటం విని మరింత స్తంభించిపోయేను. ఎంత చదువుకున్నా స్త్రీలకి సిగ్గే సింగారమని భావించే కొద్దిమంది ఆధునిక యువతుల్లో నేనూ ఒకతిని. అంటే కాస్త వయసులోఉన్న పురుషుడు కనిపించగానే అష్టవంకర్లు తిరుగుతూ, ఓరచూపులు చూడాలనికాదు నా ఉద్దేశ్యం. పురుషులను గురించి అతిగా ఆలోచించటం, ఎల్లప్పుడూ వాళ్ళని గురించే మాట్లాడుకోవటం ఏదేశంలోనైనా, ఏకాలంలోనైనా స్త్రీకి శోభనివ్వదని నా అభిప్రాయం. అలా నా పీయూసీ అంతా 'అబ్జర్వేషన్'లోనే గడచిపోయింది.

బి యస్సీ లోకి వచ్చేసరికి నేను కూడా కాస్త కరుకుదేలేను—అంటే ఆ వాతావరణాన్ని చూసి చలించటం మానేశేను. ఆ స్థితిలో ఇందిర ప్రవేశించింది మా కాలేజీలో. ఆమె పీ యు. సీ బొంబాయిలో ప్యాసయి యిక్కడకు వచ్చింది. వాళ్ళనాన్న సెంట్రల్ గవర్నమెంటు ఉద్యోగి.

వస్తూనే ఇందిర కాలేజీ విద్యార్థినులందరిలోనూ కలవరం రేపింది. ఆమె స్నేహం చెయ్యని అమ్మాయి లేదు. ఆమెను మెచ్చుకోని లెక్చరర్ లేదు దానికి కారణం ఆమె మంచితనం, తెలివితేటలు కావు. ఆమెలో ఎవ్వరిలోనూ లేని కలుపుగోలుతనం ఉంది. కాస్త ఫ్యాషనుగా ఉండే అమ్మాయిలతో లిప్‌స్టిక్‌ని గురించీ, హెయిర్ స్టయిల్‌ని గురించీ, ఇంగ్లీష్ పిక్చర్లను గురించి

మాట్లాడేది. నాలాటి తెలివిగల విద్యార్థిను లనబడేవాళ్లతో క్లాసుపుస్తకాలను గురించి, యూనివర్సిటీ రాంకులు, గోల్డు మెడల్సు గురించి మాట్లాడేది. కొంచెం సనాతనంగా అమ్మాయిలతో 'మడి' కట్టుకోవటంలో మన పూర్వీకుల అంతరార్థం, వాళ్లుచేసే చాదస్తపు పరిశుభ్రమైన పనులు సైంటిఫిక్‌గా ఎలా ఆచరణీయమైనవో, గోంగూర పచ్చడి ఎలాచేస్తే రుచిగా ఉంటుందోలాటి విషయాలు మాట్లాడేది. అందుకే ప్రతి విద్యార్థినికీ ఆమె సన్నిహితురాలు కాగలిగింది వచ్చిన నెలరోజుల్లోనే.

అలాగే లెక్చరర్లదృష్టిలో పడటానికి క్లాసయిపోగానే, వాళ్లవెంట స్టాఫ్‌రూమ్‌కే వెళ్లి ఫలానా 'రియాక్షన్' ఎలా జరుగుతుందో, 'ఫలానా ఈక్వేషన్' ఎంతకీ బాలెన్సు కావటం లేదనో చెప్పి వాళ్లచేత మళ్లీ పాఠం చెప్పించుకునేది. దానికితోడు సహజంగా చురుకైనదీ, చమత్కారంగా మాట్లాడేదీ అవటంవలన లెక్చరర్లుకూడా ఆమె అంటే యిష్టపడేవారు. ప్రతి లెక్చెరరూ మిగతా విద్యార్థినులు 'విష్' చేసినప్పుడు ప్రతిగా విష్‌చేసి ముభావంగా వెళ్లిపోతారు. కాని ఆమెను చూడగానే ఎలాటివారైనా ఓచిరునవ్వు నవ్వేవాళ్లు. ఆఖరికి ఎంతో ముభావంగా ఉండే మిమ్మల్ని కూడా కవ్వించి దగ్గరకు రాగలిగింది.

ఇవన్నీకాక కొద్దిమంది విద్యార్థినులకు తప్ప అందరికీ తెలియని కొన్ని చిత్రమైన గుణాలున్నాయ్ ఇందిరలో. వాళ్ల నాన్నది తక్కువ ఉద్యోగమేం కాదు. ఆమె ఖరీదైన దుస్తులే ధరించేది. కాని ఒక్కనాడుకూడా కాంటీన్‌లో ఒకకప్పు కాఫీకి డబ్బులిచ్చేది కాదు. సాధారణంగా నలుగురైదుగురం కలసి జట్టుగా వెళ్తాండేవాళ్లం. సమయానికి ఎవరో ఒకరు బిల్లు చెల్లించేవాళ్లు. లేదా ఎక్కువ బిల్లయినపుడు ఇద్దరు కలసి చెల్లించేవాళ్లు. కొందరు పిసినార్లు ఎంతమందితో కలసివెళ్లినా తమ బిల్లు తాము చెల్లించుకోవటం చూసేనుకాని ప్రతిసారీ తన కాఫీకికూడా ఎదుటివాళ్లతో డబ్బిప్పించటం, అందునా ఒక ఆడపిల్లలో యిలాంటి రకమైన గుణం ఉండటం విడ్డూరంగా అనిపించేది. ఆమెకు కాలేజీలో, అందరూ ఫ్రెండ్సే అవటంవల్ల పియుసీ, ఫైనలియర్ అనే బాధలేకుండా రోజుకోజట్టుతోకలసి కాఫీ తాగటంవలన మొదట్లో యెవరికీ ఆమె డబ్బులివ్వటం లేదన్న ధ్యాస వుండేది కాదు. కాని క్రమంగా ఫస్ట్‌యియర్ అయిపోయేసరికి ఆమె బండారం కాస్త బయట పడిపోయింది. దానికితోడు కాలేజీ అయిపోయినాక రిక్షా పిలిచి అన్నీ మాట్లాడిన తరువాత పక్కనున్నామెతో 'చూడవోయ్. నాదగ్గర టెన్ రుపీ నోట్ ఉంది. నీదగ్గర వో అయిదారు ఛేంజి ఉంటే యిస్తావ్?' అనేది. ఆ అమ్మాయితోటి పరిచయం ఎంతమాత్రమైనదైనా కానీయండి ఆమె అడగటానికి సంకోచించేది కాదు. ఇక ఆ పక్కనున్న అమ్మాయి కూడా మొహమాటంకొద్దీ ఎంతడిగితే అంతిచ్చేది.

అంతేకాక ఎవరినన్నా పెన్సిలు, పెన్ను అడిగి తీసుకుందంటే మళ్లీ తిరిగి ఇచ్చేది కాదు. 'సారీ! పాయింటయ్ ఎక్కడో' అనో, లేక 'అరె. ఇంటి దగ్గర మరచి వచ్చేను. రేపు తప్పకుండా తెచ్చిస్తాను' అనో అనేది. ఆ 'రేపు' యెప్పటికీ 'రేపు' గానే వుండిపోయేది — ఏదో సామెత చెప్పినట్లు.

పోనీ యివన్నీ అల్పమైన లోపాలు అని సరిపెట్టుకోందా మనుకున్నా ఆమెలోని మరో దారుణమైన లక్షణం యేమిటంటే ఆమెకు మగవాళ్లంటే తగని 'పిచ్చి'! ఆశ్చర్యపోతున్నారా మేడమ్? నిజంగా నేనైతే మొదట్లో ఆమె ధోరణి చూసి హడలిపోయాననుకోండి. రిక్షావాడి దగ్గర నుండి పెద్ద పెద్ద ఆఫీసర్ల వరకు నఖశిఖ పర్యంతం పరీక్షగా చూసి విమర్శించేది. 'అతని ముక్కు చాలా బాగుంది కదూ!' 'వో...వాట్ హేండ్‌సమ్ పర్సనాలిటీ!' 'ఆయనలో ముసలితనం వచ్చినా

# తప్పెవరిది?

చూడు ఎంత రొమాంటిక్‌గా ఉంటారో!' 'ఇతను నచ్చు రాజకుమార్‌లా ఉన్నాట్లే!' 'అతడు నవ్వుతూంటే దిలీప్ కుమార్‌లా లేడూ?' 'ఈ పిల్లగాడెవడో ఆడపిల్లలా ముద్దొస్తున్నాడే' యిలా వుండేవి ఆమె మాటలు. మొదట్లో ఆమె వెలిబుచ్చే ఈ అభిప్రాయాలను చూసి మూర్ఛపోయినంతపన యేది నాకు. కాని ఆ తరువాత ఆమె వెలిబుచ్చే యిలా అమూల్యమైన అభిప్రాయాలను (మగవాళ్లను గురించి) మెచ్చుకునే అమ్మాయిలుకూడా ఉన్నారని గ్రహించేక మరింత విస్తుపోయేను.

కొంచెం వర్షం వచ్చిందంటే మేమంతా (స్వంతకార్లు ఉన్నవాళ్లు తప్ప) బస్సుల్లో, రిక్షాల్లో నానా అవస్థలుపడి బట్టలనిండా బురదనీళ్లు చల్లించుకుని కాలేజీకి వచ్చే వాళ్లం. కాని ఆమెమాత్రం పువ్వులా వాడకుండా కాలేజీకి వచ్చేది. 'బస్టాప్‌దగ్గర నించుండగా ఓకారు కనిపించింది. ఆపి 'లిఫ్ట్' యివ్వమన్నాను. ఆయనెవరో పెద్ద ఆఫీసర్‌లావే ఉన్నాడు, చాలా యంగ్‌ఫెలో. వెరీనైస్ జెంటిల్‌మన్. చాలాచక్కగా మాట్లాడేడు దారిలో వస్తున్నంతసేపు...' అలా చెప్పుకొచ్చేది.

ఇందిరకు మరోపిచ్చి ఉండేది—జ్యోతిషం అంటే పడిచచ్చేది. మా ఉమెన్సు కాలేజీ కాంపౌండు పక్కనే చిలక జోస్యం చెప్పే వాళ్లు వరసగా కూర్చునేవాళ్లు. అందులో ప్రతిఒక్కరి దగ్గరకూ వెళ్లి చెప్పించుకునేది అదేంచిత్రమో నిజంగానే వాళ్ల జ్యోతిష శాస్త్రపరిజ్ఞానంవల్లనైతేనేం, లేదా ఆమె ముఖాన్నిచూసి ఆమె మనస్తత్వాన్ని చదవగలిగినందునైతేనేం వాళ్లెప్పుడూ ఆమె పెద్ద ఆఫీసర్‌కి భార్య అవుతుందని, ఆమెది బ్రహ్మాండమైన జాతకమనీ చెప్తూండేవాళ్లు. అప్పుడు ఆమె ముఖంలోని భావాలుచూడాలి; నిజంగా ఆఫీసర్ భార్య అయినంత గర్వంగానూ చూసేది మావంక. ఫైనలియర్‌లోకి వచ్చేసరికి ఆమె ప్రవర్తన శ్రుతిమించటం మొదలెట్టింది. తను యింటినుండి కాలేజీకి వచ్చేలోపల ఎంతమంది 'రోమియో'లు వెంటబడిందీ వర్ణించి 'అబ్బ. యిదంతా చూస్తుంటే నోటీస్ గార్డులేంది ఈ బయట కెక్కడికీ కదలను' డేంజ్ యే' అనేది వినుగును ప్రదర్శిస్తూ. కాని ఆమె కళ్లలో పెదవులలో తృప్తితో కూడిన గర్వరేఖలు తొంగిచూస్తూ ఆమె హృదయాన్ని చెప్పకే చెపుతూ ఉండేవి. మరో చిత్రమైన విషయమేమిటంటే ఆమె అలా చెప్తుంటే మిగతా అమ్మాయి లందరూ ఆమెని అసహ్యించుకోవటం పోయి నోరెళ్లబెట్టుకుని వింటూండేవారు! పైగా ఆమెలో తమలో లేని ఏదో అధిక్యత ఉన్నట్లు భావించి 'యిన్ఫీరియారిటీ' ఫీలయ్యేవాళ్లు. కొందరు ఆమె యెదురుగా లేనప్పుడు ఆమెని విమర్శించినా అందులో అసహ్యంకన్న అసూయే యెక్కువగా కనపడేది నాకు. అదంతా చూస్తుంటే నా కనిపించింది. ప్రతి అమ్మాయిలోనూ ఓ 'ఇందిర' ఉందనీ, అవకాశాల్లేకో, ధైర్యం చాలకో మంచిగా కనిపిస్తారు తప్ప ప్రతిస్త్రీలోనూ ఆ విశృంఖలత ఉంటుందనీ, అందుకనే ఇందిర లాంటి స్త్రీలను చూసి అసూయపడినా లోలోపల ఆమెని అంతా యిష్టపడతారనీ అనిపించింది నాకు ఓక్షణం. వెంటనే నన్ను నేను ప్రశ్నించుకున్నాను. 'ఐతే నేను కూడా అలాటిదాన్నేనా?' అప్రశ్న సూటిగా నన్ను నేను వేసుకోగానే లజ్జతో, జుగుప్సతో నా శరీరం కుంచించుకు పోయింది. నేను పుట్టి పెరిగిన వాతావరణం, నేర్చిన సంస్కారం అలాటి ప్రశ్న వేసుకోవటానికే అంగీకరించవు.

ఇందిరను గురించి యింతగా ఎందుకు వ్రాస్తున్నానా, నా జీవితానికీ, ఆమెకూ గల సంబంధ మేమిటా అని మీరు ఆశ్చర్యపోవచ్చు. మా కాలేజీకి సుడిగాలిలా వచ్చిన యీ ఇందిర నా జీవితంలో సుడిగుండాలు లేపగలదని ఆనాడు కలలో కూడాతలచం లేను నేను. ఎప్పుడు మొదలయిందోఎలా అభివృద్ధి చెందిందోగాని మాయిద్దరి స్నేహం, క్రమంగా ఇందిర నా జీవితంలో ఒక భాగమైపోయింది. ఈ రకమైన మైత్రి కోసం మా యిరువురిలో ఎవరూ ప్రయత్నించలేదు. అతి సహజంగా అనివార్యంగా అప్రయత్నంగా జరిగిపోయింది మాస్నేహం. ఆ స్నేహం అభివృద్ధి అవుతున్నకొలదీ నన్నేదో విపరీతమైన భయం ఆవహించేది. ఆమె సమక్షంలో ఉండి ఆమెతో తిరుగు

తున్నంతసేపూ ఏవో నీలినీడలు నా జీవితాన్ని ఆవరించుతున్నట్లు ఊహించుకుని భీతిల్లేదానివి.

పల్లెటూరులో ఓ సనాతన కుటుంబంలో పుట్టిన నాకు ఇందిరతోటి స్నేహం హాయికన్న ఎక్కువగా బాధే కలిగించింది. కాని అదేం చిత్రమో యింటికి వెళ్ళాక ఆమెకు 'రేపటినుండి దూరంగా ఉండాలి' అని ఎంత గట్టిగా అనుకున్నా మర్నాడు కాలేజీకి వచ్చేసరికి నవ్వుతూన్న ఇందిర ముఖం ఎదురైనా ఆలోచనలన్నీ చెదరగొట్టేది.

చివరకు ఆమె స్నేహం నామీద యెంతటి ప్రభావాన్ని చూపిందంటే మధ్యాహ్నం క్లాసులు ఎగ్గొట్టి హోటళ్ళకీ, సినిమాలకూ వెళ్తూండే దానిని నేను ఆమెతో కలిసి.

'చదువు పాడవుతుందని నేను భయపడినప్పుడల్లా నిర్లక్ష్యంగా నవ్వేది ఇందిర. 'ఇదిగో అమ్మాయ్. నువ్విలా పుస్తకాల పురుగయ్యావంటే జీవితంలో ఎందుకూ పనికిరాకుండా పోతావే. కాబట్టి నే చెప్పినట్లు విను. ఒక మనిషి తన జీవిత కాలంలో అనుభవించే బంగారు క్షణాలు యేవంటే అది విద్యార్థి దశేనని చెప్పవచ్చు. మనసు, శరీరం వికసిస్తూన్న ఈ సమయంలో లోకాన్ని గురించి ఎంత తెలుసుకుంటే అంత మంచిది. కాలేజీ కాంపౌండే ప్రపంచమనీ, నువ్వు చదివే పాఠ్య పుస్తకాల్లోనిదే విజ్ఞానమని భ్రమపడకు. బయట కొచ్చి ఓసారి యీ విశాల ప్రపంచంలోకి చూడు. ఎంత జీవితం ఉన్నదో, ఎలాటి జీవితం ఉన్నదో యిక్కడ నీకే తెలిసి వస్తుంది' అనేది.

ఆమె వాక్కులో ఏం మహత్యం ఉందో కాని నాగ స్వరం విన్న పాములాగా ఆమె వెంట వెళ్ళేదాన్ని నేను. హోటళ్ళకి వెళ్ళటం, సినిమాలు చూడటం క్షమించరాని అపరాధాలు కాకపోవచ్చు. కాని ఆ వయసులో, పెద్దలకు తెలియకుండా యీ రకమైన జీవితాన్ని దొంగచాటుగా అనుభవించటం ఆడపిల్లలకి తగదని నా అంతరాత్మ గోలపెట్టూండేది. అంతటితో ఆగిపోయినా బాగుండేది. సాయంత్రం కాలేజీ వదిలే వేళకు ఆమె కోసం 'బాయ్ ఫ్రెండ్సు' బయట నిల్చుని ఉండేవాళ్ళు. ఆమె వాళ్ళను చూస్తూనే 'హలో!' అంటూ ఎంతో కాలం నుండి పరిచయమైన వాళ్ళతో వలె ప్రవర్తించేది. ఆ తరువాత వాళ్ళతో యెలా పరిచయమయిందీ అడిగితే ఆమె సమాధానం యేమిటో తెలుసా? ఒకతను కాలేజీకి వస్తుంటే తన కారులో 'లిఫ్టు' యిచ్చేడు. రెండవతను బస్సులో ఒకసారి నిల్చుండగా చేతిలోని పుస్తకాలు జారిపతే తీసి యిచ్చేడు. 'థాంక్స్' అని నవ్వేసరికి ఆయన తనేం చదువుతున్నదీ, తన పేరేమిటి వివరాలన్నీ అడిగేడట. దాంతో బస్సు దిగేలోపల వాళ్ళకు గాఢస్నేహం యేర్పడింది వాళ్ళిద్దరికీ. మరో కాయన్ని మొదటి సారిగా యెప్పుడు చూసిందీ గుర్తులేదటగాని కనపడినప్పుడల్లా నవ్వుతూ పలకరిస్తాడట!

ఇలాటివన్నీ వింటూ భయంతో బిగుసుకు పోయేదాన్ని నేను. రాత్రిళ్ళు ఒంటరిగా పడుకున్నపుడు ఆ పగలల్లా ఇందిరతో గడిపిన జీవితం జ్ఞప్తికి వస్తే నా గుండెను యెవరో పిండివేస్తున్నట్లు బాధపడేదానిని. ఆ రోజుల్లో ఆమెతో యెందుకలా తిరిగేనో యిప్పటికీ నాకు అర్థంకాదు. అప్పుడేదో పిశాచం ఇందిర రూపంలో నన్నావహించి నా యిష్టానికి వ్యతిరేకంగా నన్నా పనులన్నీ చేయించింది. ఆ రోజుల్లో ఒక రకంగా నా వంటిమీద పూర్తి స్పృహలేదని చెప్పాలి. కాని నా చుట్టూ దట్టమైన చీకటి వలయాలు వలయాలుగా తిరుగుతోందనీ, ఒకనాడు ఆ చీకటి పూర్తిగా నా జీవితాన్నే ముంచుతుందని నాకు తెలిసేది.

(ముగింపు వైవారం)



# కొయినా భూకంపం: కొన్ని వెలుగునీడలు

కొయినా నది మహాబలేశ్వరం కొండలలో పుట్టి వంకర వంకరగా దట్టమయిన అడవుల్లోనుంచి, పీఠభూముల మీద నుంచి కొంతదూరం దక్షిణంగా మరి కొంతదూరం తూర్పు వయిపుగా పారుతుంది...

1954 లో ప్రభుత్వంవారు కొయినా నగర్ ప్రాజక్టు మొదలు పెట్టారు. ఈ ప్రాజక్టుద్వారా తూర్పుకి పారేనదిని ఆనకట్టవల్ల పడమరకి తిప్పారు! పడమర వంపు పడే జలపాతం విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి ఉపయోగపడుతుంది. వ్యవసాయానికి కావలసినంత నీరు. ప్రాజక్టు 1962, మే 15 వ తేదీ ముగిసింది....కొయినా నగర్ ఒక చక్కటి ప్రదేశంగా మారిపోయింది...

11–12–1967 మధ్య రాత్రి ఒక భూకంపం వచ్చింది. బొంబాయినుంచి రత్నగిరి, గోవానుంచి పూనా, సతారా షోలాపూర్‌దాకా ఈ భూకంప ప్రభావం తెలిసింది. మొత్తంమీద 400 చదరపు మయిళ్ల ప్రాంతంలో 1100 గ్రామాలు దెబ్బతిన్నాయి. అన్నిటికన్నా ఎక్కువ పీడనకి లోనయినది కొయినా నగరే. 200 మందికి పయిగా ప్రాణాలు పోగొట్టుకున్నారు. చాలామంది వికలాంగులయిపోయారు. ఇక ఆస్తి నష్టం సంగతి చెప్పక్కరలేదు.

**వెలుగు**

ఈ ఆపద సమయంలో మనకి ప్రకాశమానంగా కనిపించేది ఎందరో ప్రజల త్యాగం, ధైర్యం, సానుభూతి.

**రఘుజీ**

రఘుజీ ఒక సైనికుడు. సెలవుమీద ఇంటికి వచ్చాడు. అతని ఇల్లు కూలిపోయింది. రఘుజీ లోపల ఇరుక్కుపోయాడు. కాని, ఆ రాళ్ల కుప్పకిందనుంచి ఎలాగో బయటపడ్డాడు. వెంటనే ఒక లాంతరు తీసుకుని శిథిలాల మధ్య వెతికి ముగ్గురు బిడ్డలని రక్షించగలిగాడు. ఇలాగే ఇంకా ఎందరి ప్రాణాలనో కాపాడాడు. అతని గ్రామంలో మొత్తం ఇద్దరుమాత్రమే చనిపోయారు.

**జోషి....**

వినాయక జోషి కొయినా నగర్ పవర్ హౌస్‌లో కాపలావాడు. భూకంపం దెబ్బకి అంతదూరం ఎగిరి పడ్డాడు. కాని తిరిగి లేచినుంచుని 12 నుంచి ఉదయం ఎనిమిది దాకా తన స్థానాన్ని వదలలేదు. తర్వాతనే ఇంటికి వెళ్లాడు. అతని ఇల్లు కూలిపోయింది. 8 ఏళ్ల కొడుకు దీపక్ బాగానే ఉన్నాడు. ఒక తమ్ముడికి చేతులు రెండూ పోయాయి. ఇంకొక సోదరుడి తల పగిలింది. తల్లి కూడా కూలిన ఇంట్లో ఉన్నప్పటికీ సురక్షితంగానే బయటపడింది.

**అజీజ్.....**

అజీజ్, అతని భార్యా, ముగ్గురుపిల్లలూ తమ ఇంటి శిథిలాలలో ఇరుక్కున్నారు. అతను బయటికి ప్రాకివచ్చి గాయపడిన తన కుటుంబం వారందరినీ కాపాడాడు. అందరినీ కర్హాద్ ఆసుపత్రికి తీసుకు వెళ్లాడు. అందరూ త్వరలోనే బయటపడ్డారు. 'అంతా అల్లా దయ!' అన్నాడు అజీజ్. 'ఇన్నేళ్లుగా రంజాన్ ఉపవాసం చేసేవాడిని కాను. ఈ ఏడు మాత్రం ఉపవాసం చేశాను. మా అందరి ప్రాణాలనీ అల్లా కాపాడాడు...'

**త్యాగం....**

తోటి మానవులపట్ల సానుభూతి విచిత్రంగా బయటపడుతూ ఉంటుంది. ప్రమాదం తర్వాత ఉచితంగా ఆహారధాన్యాలు పంచిపెడుతున్నారు. కొందరు 'దేవుడిదయవల్ల మా దగ్గర ఏదో కాస్త మిగిలి ఉంది, తక్కినవారికి ఇవ్వండి,' అంటూ వాటిని పుచ్చుకోలేదు. రెండుగ్రామాలవారు తమ పంట సిద్ధంగా ఉంది కాబట్టి అక్కర లేదన్నారు.

ఈ ఘోర ప్రమాదం గురించి వినగానే గోవానుంచి 35 మంది యువకులు ఓవోలి, జడోలి గ్రామాలకివెళ్లి ఒక వారం రోజులపాటు అక్కడే ఉండి బాధితులకి సహాయం చేశారు...

**యువతులదే ముందంజ**

ఒక యువతి తన రక్తాన్ని ధారాళంగా దానం చేసింది. ఆమెకి పద్ధెనిమిది సంవత్సరాలు నిండలేదనే నెపంతో డాక్టర్లు ముందు ఆమె దానాన్ని స్వీకరించలేదు. తర్వాత ఆమె పావడ బదులు చీర కట్టుకుని ఆసుపత్రికి వెళ్లింది. కొత్త వస్త్రధారణలో డాక్టర్లు ఆమెని గుర్తుపట్టలేదు. రక్తదానం అయిపోయింది...

రక్తదానం చేసిన యువతుల సంఖ్య యువకుల సంఖ్యకన్నా అధికంగా ఉంది. పూనాలోని ఎస్. పి. కాలేజిలో మగ విద్యార్థులే ఎక్కువ. కాని అక్కడనుంచి 55 మంది అబ్బాయిలూ 85 మంది అమ్మాయిలూ నెత్తురు ఇచ్చారు......

శ్రీ జయప్రకాష్ నారాయణ్ బీహారు క్షామనివారణ నిధినుంచి 50,000 ఇప్పించారు...

ఎందరో ఇతర ప్రాంతాలవారు మహారాష్ట్ర భూకంపం బాధితులకి ఎన్నో విధాల సహాయం చేశారు...

**శ్రీ పద్మనాభన్...**

ప్రభుత్వోద్యోగులు సయితం ఈ సందర్భంలో శక్తివంచనలేకుండా పనిచేశారు. వారిలో శ్రీ పద్మనాభన్ ఒకరు. ఈయన దక్షిణ ప్రాంతంవారు. సుప్రసిద్ధ మరాఠీ పత్రిక 'కేసరి' ఇలా రాసింది. 'సతారా కలెక్టరుగా పనిచేస్తున్న యువకులు శ్రీ పద్మనాభన్ తమ విశేషమయిన కృషిద్వారా సహ్యాద్రిలో గ్రామాలవారి కృతజ్ఞతకి

ప్రీతుడయ్యాడు. నిర్విరామంగా ఏకాగ్రతతో చేసిన ఈయన ప్రయత్నాల ఫలితంగా భూకంప బాధితుల కష్టాలు తగ్గాయి. ఈయన కృషి నిజంగా ప్రశంసనీయమయినది. ఈయనకి మరాఠీభాష అంతగా రాదు. కాని, వచ్చిన కొద్దిమాటలతో ఒక్కొక్కరి దగ్గిరికీ వెళ్ళి అనూనయ వాక్యాలు పలికేవారు, వీలయినంత సహాయం చేసేవాడు. నిజంగా ఆయన 'సతారా భూషణమే!'

### మమ్లత్‌దార్

ఫల్టాన్ కోయినా నగరానికి దగ్గరలోనే ఉంటుంది. అక్కడి 'మమ్లత్‌దార్' బాధితుల సహాయానికి వెళ్ళలేదు సరిదా కలెక్టరుకి విందు ఒకటి ఏర్పాటు చేశాడు. శ్రీ పద్మనాభన్ ఈ ఆహ్వానాన్ని స్వీకరించలేదు. కొందరు ప్రభుత్వం ఉద్యోగులు నిర్దాక్షిణ్య వయిఖరికి ఈ మమ్లత్‌దార్ ధోరణి ఒక నిదర్శనం...

### నీడ

ఇంతదాకా ప్రజల త్యాగబుద్ధి, సౌభ్రాతృ గురించి చెప్పాను. మరొక రకం ప్రవర్తన గురించి కూడా చెప్పాలి.

మొదటి రెండురోజులపాటూ కొయినా నగరానికి పోలీసు సిబ్బంది పంపలేదు.

కారణంగా దొంగతనాలు చాలా జరిగాయి...

సరయిన గృహాలు లేక ఎందరో చలి దెబ్బకి గురి అయ్యారు...

వైద్య సహాయం సకాలానికి అందలేదు...

### పి. కె. సావంత్

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ కొయినా నగరానికి వచ్చినప్పుడు దగ్గిర ఊరినుంచి వచ్చిన ఒక వృద్ధురాలు ఆమె కాళ్ళమీద పడి ఏడుస్తూ తమ కష్టాలు చెప్పుకుంది. ఆ నియోజకవర్గం నుంచి ఎన్నికయిన శ్రీ పి. కె. సావంత్ ఈ దృశ్యాన్ని చూసి తగిన సహాయం ఏర్పాటు చేస్తానన్నాడు. మూడువారాలదాకా ఆ వృద్ధురాలి పల్లెకి ఏ విధమయిన సహాయమూ లభించలేదు...

### ఆఫీసర్లకే అడ్వాన్సు

కోయినా నగర్ పవర్ హవుస్ ఆఫీసర్‌కి ఈ ప్రమాదం జరిగిన తర్వాత రు 4500 అడ్వాన్సు ఇచ్చారు. 200 మంది కార్మికులకి ఏమీ ఇవ్వలేదు......

### కాంగ్రెసువారి కొట్లాటలు

**లంచగొండితనమూ దొంగతనమూ మొదలయిన వేలాది** ఉదాహరణలు కోకొల్లలు. కొందరు కాంగ్రెసు నాయకులు ఆహారం మొదలయిన వస్తువుల పంపిణీకోసం ఎగబడ్డారు. వారి పోట్లాటలు కొందరు విలేఖరులు ప్రత్యక్షంగా చూసారు. ఒక ఎం. ఎల్. ఎ. తనకి ఎక్కువ వోట్లు పడ్డ గ్రామానికి ఎక్కువ ధాన్యం ఇప్పించాడు...

### 5000 కంపనలు

1961 నుంచి కోయినా నగరంలో 5000 భూకంపాలు — చిన్న చిన్నవి — రావటం శాస్త్రజ్ఞులు చూస్తూనే ఉన్నారు. 13 సెప్టెంబర్‌నాడు స్కూలు కట్టడం పడిపోయింది. 1962 లో ప్రజల కోరికపై ప్రభుత్వం ఒక విచారణ సంఘాన్ని కూడా వేసింది. ఇంతదాకా ఈ సంఘం నివేదిక బయటపడలేదు...

### దైవాగ్రహం

కొందరు అంటున్నారు. కొయినానదితో చెలగాటాలు ఆడరాదు. కావేరీనది ప్రాజక్టు కట్టినప్పుడు కావేరి దేవికి ఒక గుడి కట్టారు (బృందావన్‌లో) కొయినానదికి ఆలయం కట్టలేదు. ఎందరో కొయినా నగరవాసులకి ఆమె కలలో కనిపించి తన ఆగ్రహాన్ని వెలిబుచ్చింది......

— వి. ఎస్. సుక్థాంకర్



కొయినా నగరంలో భూకంపం వల్ల కూలిపోయిన ఒక పాఠశాలను బొంబాయి శాపర్స్ దళం సరిచేస్తున్న దృశ్యం.




పెద్ద చప్పుడు బ్రరుబ్రరు మని నామీంచి దొర్లుకుంటూ పోయింది. ఒక్క ఊపు ఊపినట్లై మూసుకుపోతున్న కంటిరెప్పల్ని బలవంతాన్ని విప్పిచూసేను. మసగ మసగ్గా కనీ కనిపించని ఆకారాల్ని పోల్చుకునేలోగా కంటిరెప్పలు బరువుగా కిందికి మళ్ళా వాలిపోయేయి.

తెలివిగా ఉన్నానా? నిద్రపోతున్నానా? అసలు ఎక్కడున్నాను? చిన్నచిన్న ప్రశ్నలు మగతగాఉన్న మెదడుని కుదిపి కుదిపి లేపుతున్నాయి. నా అవయవాలు నామాట వినటంలేదు. కాళ్ళా చేతులూ బరువెక్కి కదలిక లేకుండా పడి ఉన్నాయి.

ఉన్నట్టుండి కడుపు ఖాళీగా ఉందని తెలిసింది. అవును, నేనేం తిన్లేదు. చిన్నగా జ్ఞాపకం వస్తోంది. అన్నం వండేనా? లేదు. లేదే! అవునవును. అస్సలు కాఫీ కూడా పెట్టుకోలేదు. స్పృహలు మంచి వచ్చిందాన్ని......తిన్నగా.......ఇల్లు......ఉహూ అయితే నేను నా గదిలోనే ఉన్నాను. ఇది నా మంచం. ఆ చప్పడు—ఆఁ అది ట్రక్కు! వాటర్ వర్క్స్ వాళ్ళది. నామీంచి వెళ్ళలేదు. నాగది పక్కనుంచి వెళ్ళింది. రోడ్డుని ఆనుకున్న గది. రోడ్డునుంచి ఏంవెళ్ళినా నా గది లోంచి, నామీంచి వెళ్ళినట్టు అనిపిస్తుంది. టైమెంతయిందో? కళ్ళు బరువుగా ఉన్నాయి. మండుతున్నాయి. విప్పలేక విప్పలేక కళ్ళని విప్పి తల ఎత్తేను. కిటికీలోంచి వాటర్ టవరూ సరిగ్గా టవర్ మీదకి నిండుగా లేచిన చందమామా కనిపించేయి. గదిలోకి వెన్నెల కాంతి కిటికీలోంచి పడుతోంది. ఎత్తిన మొహాన్ని తలగడలో దూర్చేను. రెండు చేతుల్తో తలగడాని పట్టుకుని బోర్లా పడుకోవడం నా అలవాటు. సగం తలగడా గుండెల కిందకి ఉంటుంది. తలగడా తడితడిగా ఉంది. అవును, జ్ఞాపకం వస్తోంది. ఎడతెరిపి లేకుండా వెక్కివెక్కి ఏడ్చేను. ఏడుస్తూ ఏడుస్తూ ఎప్పుడో మగతలోకి జారిపోయేను.

ఏడ్చిన సంగతి గుర్తుకురాగానే మళ్ళా ఉన్నానంటూ దుఃఖం పొంగు కుంటూ వచ్చింది.

'ఏడవకు ఏడవకు! ఏడవకూడదు. ఏడవడం నీ గుణంకాదు. ఏడవకు బుజ్జీ!

ఏడవకు'

నాకు నేనే సముదాయించు కున్నా.

'ఏడవట్టంటావేం? ఏడవక ఏం చెయ్యనూ? ఏడిస్తే ఏడుస్తా. ఏడ వొద్దం డానికి నువ్వెవరివి?'

నాలోంచి నన్ను తిడుతూ ఏడుస్తున్న గొంతు వెక్కిళ్లలోకి మారింది.

నేనేమీ అనలేదు. వెల్లకితలా తిరిగి రెండు చేతుల్నీ గుండెమీద క్రాస్ చేసి పెట్టుకున్నా. నీరసంగా ఉంది. లేవాలని లేదు కిటికీలోంచి పడ్డ వెన్నెల్లో బట్టల స్టాండు హేంగర్కి వేళ్లాడుతున్న ఎర్ర జరీచీర మెరుస్తోంది. గోడకే ఉన్న అంపరామీదా, అలమరాలో ఉన్న పుస్తకాల మీదా కిటికీ గజాల నీడ పడుతోంది.

అలమరా అరలో పడేసిన 'రూపా' బొమ్మ 'పోనీటేల్' గాలికి ఊగుతోంది. ఆ బొమ్మ కనిపించగానే ఏడుపొస్తాయి మళ్లా పెరిగింది. కళ్లనిండా నీళ్లు కమ్ముకురావడంతో బొమ్మ అలుక్కుపోయి సరిగ్గా కనిపించడం మానేసింది.

'రూపా! పేరు కూడా ఎం చక్కటిది! షో కేస్‌లో దాన్ని చూసిన రోజు జ్ఞాపకం వచ్చింది. ఆ రోజు ఆ షాప్‌లో ఓసారి దాన్ని తీయించి పట్టుకుని ముట్టుకుని చూసేను. నవ్వుతున్న ఎర్రని పెదాలు, పెంకెతనంతో చూస్తున్న నల్లటికళ్ళూ, నైలాన్ జుట్టుతో మీదికెత్తి కట్టిన 'పోనీ టేల్', ఓ చెయ్యి పైగాదకెత్తి చూపుడు వేలుతో చూపిస్తూ ఏమిటో చెప్తున్నాది! ఫ్రాక్ బుట్టలాలేచి ఎగురు తోంది. మేజోళ్ళూ జోళ్ళూ తొడు క్కుని టిప్‌టాప్‌గా ఉంది. అచ్చుముచ్చు ముమ్మూర్తులా మున్నీలా ఉంది. మున్నీలా ఉందే అనుకుంటూనే షోకేస్‌వేపు చూస్తూ నిలుచుండిపోయేను. చూసి చూసి ఇంక పట్టలేక బొమ్మని పైకి తీయించేను. అటూ యిటూ తిప్పి అన్ని పక్కల్నించీ చూసేను. ఆ అందమైన 'పోనీటేల్'ని పైకి ఎత్తి ఆడించేను. పర్సులో డబ్బుల్లేవు. అయినా యిలాంటి 'డాల్స్' చాలా ప్రియంగా ఉంటాయి. ఎప్పుడూ కొన్లేదు. ఎంతుంటుందో? 'ఎంత'? అని అడిగేను. 'పదిహేను రూపా యిలు' అన్నాడు. రెండూ మూడుకీ రాదని తెలుసు కాని మరీ పదిహేనురూపాయిలా?

ఇరవయ్యోతారీఖున పదిహేను రూపాయి లెక్కడ్నించి తేడం? మున్నీకోసం పది హేను రూపాయిలు ఖర్చు పెట్టడానికి వెనకాడతానా?

'ఈ బొమ్మని వేరే ఉంచండి. ఫస్టు తారీఖున వచ్చి తీసుకుంటాను. ఎవ్వరికీ యిచ్చెయ్యకండి'

'అలాగే టీచర్' అని షాప్‌కీపర్ నా ఎదురుగానే కుర్రాణ్ణి పిలిచి 'రూపా'ని లోపల స్టోర్‌లో పెట్టించేడు. షాప్ కీపర్‌కి నేను తెల్సు. వాళ్ల చిన్న చెల్లెలు మా హైస్కూల్లోనే చదువుతోంది.

ఆలోచనలతో, జ్ఞాపకాల మధ్యలో నీటి మబ్బులు చెదిరిపోయేయి. ఏడ్పు సన్నగిల్లి అణిగిపోయింది. నాకు తెలీకుండనే నా ఎడం అరచెయ్యి నుదుటిమీంచీ, కళ్లని రాసుకుంటూ బుగ్గల్ని తుడిచింది.

అసలు ఈ ఊరికి రాకుండా ఉండా ల్సింది. వస్తే వచ్చేను కాని ఈ వీధిలో ఉండకుండా ఉండాల్సింది. ఉంటే ఉన్నాను కాని ఎదురింటివాళ్లతో పరిచయం పెంచు కోకుండా ఉండాల్సింది.

అది చెయ్యాల్సింది. ఇది చెయ్యాల్సింది ఇల్లా అనకుండా ఉండాల్సింది. అర్థం పర్థం ఉందా ఈ అనుకోవడానికి? అంతా నా చేతిలో ఉందా ఏం?

'నీ చేతిలో ఉన్నవని నువ్వు చెయ్యొచ్చు బుజ్జీ! ఇంకా ఇక్కడ ఉంటావా? అయిం దేదో అయింది. ఇక్కణ్ణించి వెళ్లిపో.'

ఇందాకట్నా ఏడవద్దన్నావ్. ఇప్పు డిక్కణ్ణించి వెళ్లిపో అంటున్నావు! అసా ధ్యాల్ని సాధ్యాలకింద మాట్లాడతావు. మహాజ్ఞానివి బయల్దేరేవు బోధపర్చడానికి! ఇక్కణ్ణించి ఎక్కడికిపోతా? ఎన్ని అగ చాట్లుపడితే ఈ కమిటీ హైస్కూల్లో ఈ టీచర్ గిరీ దొరికింది! ఎవరన్నా ఎక్క డన్నా బొట్టుపెట్టి పిలిచి పని యివ్వ డానికి సిద్ధంగా ఉన్నారా? అమ్మా? అబ్బా?

తప్పదు. బతకాలి. బతకాలి. చావలేక బతకాలి. గత్యంతరం లేక బతకాలి. ఏ కదలికా లేకుండా రాయి అవాలి. అవడం చేతకాకపోతే ఏడవాలి. ఆ ఏడవడమైనా ఘట్టిగా ఏడ కూడదు. ఏడుస్తున్నట్టు ఎవరూ చూడకూడదు. అన్నీ హద్దులు —అన్నీ గీతలు.

'అమ్మా!' అని మూలిగేను. రెండు చేతుల్తో తల పట్టుకుని రెండుకాళ్లనీ పొట్టలోకి పెట్టి మూడంకెలా ముడుచుకు పోయేను. కడుపులోకి కాళ్లు పెట్టుకో గానే నీరసం శరీరమంతా చుట్టుకుంది. నిస్సత్తువతో వళ్లంతా చెమట పట్టింది.

ఇంక లే. ఒక్కసారి లేచి కాస్తంత కాఫీ తాగు. కాఫీ ఎవడు పెడ్తాడంటావా? అయితే పాలే తాగు. పాలు చల్లగా తాగ లేవా? సరే, ఆ గ్లాసులో ఉన్న పెరుగు తాగు. లేదూ, కాస్తంత పంచదార నీళ్లలో కలుపుకుని తాగు. పొద్దు న్నెప్పుడో మూడు మెతుకులు తిన్నావు. సాయంత్రంకూడా ఏం తిన్లేదు. ప్రాణం కడంటి పోతుంది!

పోతేపోనీ, పీడాపోయింది!

నిజమే, పొద్దున్న స్కూలుకి వెళ్లే తొందరలో భోజనం సరిగ్గా చెయ్యలేదు సాయంత్రం ఇంటికి రాకుండా అట్నించటే తిన్నగా బజారుకి వెళ్లిపోయేను.

రూపాని కొనాలి. మున్నీకివ్వాలి. ఒకటే జపం. ఈ ఫస్టుకోసం ఎంత ఎదురు చూసేను. ఫస్టు వచ్చేసినట్టే. ఇంకొక నాలుగురోజులు. మరో మూడు రోజులు. ఏముందీ—రేపే ఫస్టు అనుకుంటూ లెక్క పెట్టుకున్నాను.

ఫస్టు వచ్చింది. వచ్చి ఏడిపించింది ఏడిపిస్తోంది.

ఫస్టేం చేసింది? ఎంచక్క తెల్లా రింది. కొండలనుంచీ లేస్తున్న సూర్య బింబాన్ని చూస్తూ కిటికీదగ్గర ఎంత సేపు నిలుచుండిపోయేను. ఎలక్ట్రిక్ తీగ మీగాద కొండ పిచుకలు కిచకిచ లాడు తున్నాయి. పొడుగ్గా ఉన్న తోకల్ని ఆడి స్తున్నాయి. పొద్దున్న ఎంతో ఉల్లాసంతో స్కూలికి వెళ్లలేదూ?

మరి? మున్నీ మున్నీ వించే అంతా వచ్చింది.

ఛీఛీ సిగ్గులేదూ? పసిపిల్లని అందు లో మున్నీనా నువ్వు తిట్టుకునేది? మున్నీనే లేకపోతేఈ ఆరునెలలూ నవ్వుతూ తుళ్లుతూ గడిపేదానా? ఆ అమ్మాయేకాని దొరక్కపోతే రోజులు ఊదురోమని ఏడ్చేవి.

మున్నీ అందంగా ఎందుకుండాలి! చలాకీగా మిలమిలా మెరిసే కళ్లతో కబుర్లెందుకు చెప్పాలి? అన్నీ తెలుసుకోవా

లన్న కుతూహలం అంతెక్కువగా ఎందు కుండాలి? ఉంటే ఉందికాక నా దగ్గరికి ఎందుకు రావాలి? రోజూ పొద్దున్నా సాయంత్రం నన్ను చూడకపోతే నాతో కబుర్లు చెప్పకపోతే ఎందుకు ఏడవాలి??

ముద్దపప్పులా మెద్దులా ఉన్న పిల్లే అయితే తంటా లేకపోయేది!

నా మొట్టమొదటి స్నేహితురాలు ఆ పసిపిల్లే! కొత్తగా వచ్చేను. ఎవరీ తెలీదు. ఎవరూ తమంతటతాము పలకరించి స్నేహపూర్వకంగా 'ఓహో మీరే నన్నమాట కొత్తగా వచ్చిన టీచర్! మా యింటికి రండి' అని ఆహ్వానించలేదు. ఆ వీధిలో ఉన్న 'ఆడంగులు' సాయంత్రం వీధిగుమ్మాల్లో కూర్చుని పిచ్చాపాటీ చెప్పుకుంటూ నన్ను ఎగాదిగా చూసి ఊరుకున్నారు. కలుపుగోలుతనంతో నా అంతట నేను పూనుకుని మాట్లాడితే ఏమనుకుంటారో?? ఆ భయంతో ఎవరింటికీ వెళ్ళలేదు ఎవరితోనూ మాట్లాడలేదు.

చెంగుచెంగుమని గెంతుకుంటూ మున్నీ నా దగ్గరికి వచ్చింది. ముద్దు ముద్దు మాటలతో తనెవరో చెప్పింది.

'మలేమో నేను మున్నిని. మీలు ఈ గదిలో ఉంటాలా? అల్లదేం అల్లదే మా యిల్లు. మీలు లాకముందు 'దాదా' ఉండేవాలు.' మున్నీకి 'ర' పలకదు.

నాకు ముందు ఈ ఇంట్లో ఒకబ్బాయి ఉండేవాట్ట. అతణ్ణి మున్నీ దాదా అని పిల్చేదిట. ఉత్తరదేశంలో ఉండిరావడంతో 'చిట్టి' 'చిన్నా' 'బుచ్చి' 'పాపా'కి బదులు మున్ని పేరు 'మున్నీ' అయింది.

మున్నీ నా దగ్గరికి అల్లా రాకపోతే వాళ్ళింటికి నే వెళ్ళేదాన్నా? వాళ్ళతో మాట్లాడేదాన్నా? వాళ్ళెవరో, నేనెవరో?

'ఏం లేదు. మున్నీ నీ దగ్గరికి రాకపోతే నువ్వే మున్నీ దగ్గరికి వెళ్ళేదానివి. మున్ని వాళ్ళమ్మ అన్నమాట అబద్ధమా? పిల్లల దేముంది? ప్రేమతో దగ్గరికి పిలిస్తే; చనువిస్తే నెత్తికెక్కి తొక్కుతారు. కసిరితే మర్యాప్రాంతాలకి రారు. నువ్వే మున్నిని చేరదీసేవు'

నా మీద నాకే కోపం వచ్చింది. ముడుచుకున్న కాళ్ళని ఒక్కసారిగా చాచి, విడదన్ని రెండు చేతుల్నీ మీదకెత్తి పడుకునే ఒళ్ళు విరుచుకున్నాను. బోర్ల పడుకుని తలగడని రెండు చేతుల్తో పట్టుకున్నాను.

# శరణ్యం

చేరదీస్తే చేరదీసేను. అందులో తప్పేముంది. ఆ పాపతో ఆడుకుంటూ పాడుకుంటూ పద్యాలు చెప్పుకుంటూ వాళ్ళింట్లోనే సాయంత్రాలు గడిపేను. ఏం? వాళ్ళమ్మాత్రం వాళ్ళమ్మాయి తెలివితేటలకి గొప్ప పడిపోలేదూ?

'మందార మకరంద మాధుర్యమున దేలు' అంటూ మున్నీ పద్యం చెప్తూ ఉంటే ఆవిడ కళ్ళు తళతళ్ళాడేయి. ఆయనా పొంగిపోయేడు. అందరికీ చెప్పుకుని, అందరి దగ్గరా చనువిచ్చి వాళ్ళమ్మాయి విద్యని ప్రదర్శించుకోలేదూ?

'లాయంచ చనునే తలంగిణులకు' కళ్ళు తిప్పుతూ మున్నీ ఎంత అందంగా చెప్తుంది!

అసలు నువ్వు పిచ్చిదానివి. మొదట్లోనే పోల్చుకోవల్సిన సంగతి. వాళ్ళ యిష్టాయిష్టాలవేపు నీ దృష్టే లేదు. నీ సొద నీది. నీ గోల నీది. మున్నితో ఆడుకోడమే నీకు తెల్సు. ఎవరేమనుకుంటున్నారో వెనక్కి తిరిగిచూసేవా? ఉహుఁ నీ కంత బుద్ధి ఎక్కడిది?

'నే నిక్కడింక ఉండలేను బాబోయ్! నాకు తెలీకుండానే పైకి గట్టిగా అన్నాను. నీరసంగా ఉందేమో నా గొంతు నాకే చిత్రంగా వినిపించింది. బుర్రెత్తి కిటికీ వేపు చూసేను. వాటర్ టవర్ వెన్నెల్లో ఎత్తుగా నిటారుగా ఠీవిగా కనపడుతోంది.

'వాటలు టవలు ఎక్కితే ఆకాశం అందుతుంది కదూ?' మున్నీ ఓ రోజు అడిగింది. ఆవేళ వాటర్ టవర్ మీంచి పెద్ద హరివిల్లు పొడిచింది

ఏడు రంగులతో ముచ్చటగా ఉన్న హరివిల్లుని చూసి మున్నీ గెంతింది.

'హలివిల్లు! హలివిల్లు! ఆ హలివిల్లు మీదకి ఎక్కి ఇటోకాలూ అటోకాలూ వేసి కూలుచుందాం' వాటర్ టవర్ మీంచి మున్నీ హరివిల్లు ఎక్కడానికి ప్లాను వేసింది. ఆ రోజు మున్నిని వాటర్ టవర్ ఎక్కించేను. అంత ఎత్తుమీంచి కిందకి చూసి భయంతో నన్ను కౌగలించుకుంది. ఓ రెండు నిమిషాల్లో భయం పోయి, ఆకాశం ఇంకా ఎత్తుకుపోయిందే అనీ, హరివిల్లు మీదకి ఎక్కడానికి వీల్లేదే అని, కిందనున్న ఇళ్ళల్లో మనుష్యులూ ఇంతింత పిసరున్నట్టున్నారనీ కబుర్లు చెప్పింది. మున్నీకి భావనాశక్తి ఉంది.

వాటర్ టవర్ వేపు చూస్తూ ఉండిపోయేను. చందమామ కిందికి వాలిపోతున్నాడు. పలచటి మబ్బులు చంద్రుణ్ణి కప్పుతున్నాయి. వెన్నెల కాంతి తగ్గిపోయింది.

గొంతుక ఎండారిపోయింది. అయినా మంచంమీంచి లేవాలనిలేదు. నాలికతో రెండు పెదిమల్నీ తడుపుకున్నాను.

'రూపాని మున్నీకి యిచ్చేసి రావల్సింది. వెధవపనే చేసేను. వాళ్ళమాటలు వినకుండా ఉండాల్సింది గుట్టిగా మాట్లాడుకుంటూ ఉంటే దెబ్బలాటలాగ వినపడితే గుమ్మందగ్గర ఆగిపోయి ఎందుకు వినాలి?

నా ఎదురుగుండా ఆయనకాని ఆవిడకాని ఎప్పుడూ ఏమీ అన్లేదే! నేనెలా ఏముప్పు అనుకుంటానూ?

ఆవిడ భయానికి, ఆవిడ తప్పుడు ఊహలకీ నాకు నవ్వే వచ్చింది. ఛీ ఆవిడ యింత తక్కువ బుద్ధిదా? ఆవిడా మున్నికి తల్లి అనుకున్నాను. ఆడబుద్ధి అలాంటిదని ఉత్తినే అంటారా?

మున్నీ ముద్దుముద్దుగా పద్యాలు చెప్తూ ఉంటే ఆయనకి మహాసంతోషం కలిగింది.

'నాకా తీరుబడి ఉండదు. ఆవిడకి ఓపికా లేదు, శ్రద్ధాలేదు. మీరు మున్నీకి బాగా దొరికేరు మీరు చెప్పబట్టే కదా దాని కన్నీవస్తున్నాయి' సందు దొరికినప్పుడల్లా పొగుడుతూ ఉండేవాడు.

'వాటర్ టవర్ ఎక్కించేరా?' ఆవేళ అడిగేరు.

'ఎక్కించక ఏం చెయ్యనూ? మేం యిద్దలం హలివిల్లు ఎక్కి యిటోకాలూ అటోకాలూ వేసి కూలుచుందాం, ఓసారి సైలు కొట్టేవద్దాం అనుకున్నాం. వాటలు టవలు అంతెత్తుంది కదా—అది ఎక్కేసి అక్కణ్ణించి అలుగెక్కినట్టు హలివిల్లు ఎక్కలేమా అని! ఉహూఁ తీరా మేమూ ఎక్కేసరికి ఆకాశం మరీ మీదకి వెళ్ళిపోయింది. అందిందే కాదు. మరేం—అటువేపు మబ్బులున్నాయా, అవి బలే మెత్తగా ఉన్నాయి. మనింట్లో ఉన్న డన్లప్పిల్లో కన్నా మెత్తగా ఉన్నాయి. వెన్నముద్దలా ఉన్నాయి. ప్చ్!

అందేయి కాదు. తేలిపోతేనా?"

మున్నీ చెప్పినట్టు నేను చెప్పేసరికి వినోదం ఎక్కువై ఆయన ఘట్టిగా నవ్వాడు! మున్నీ నవ్వింది. నేనూ నవ్వేను. ఇప్పుడు జ్ఞాపకం వస్తోంది. అప్పుడు ఆవిడ మొహం మాడ్చుకుంది. మున్నీతో ఆడుకోవడంలో పడి ఆవిడ మొహం మాడ్చుకున్నాదన్న సంగతి నేను సరిగ్గా గుర్తించలేదు. మున్నీతో సమానంగా చిన్నపిల్లనైపోయి, ఆ తక్కులాడి, గెంతుతూ ముద్దుమాటలు మాట్లాడుతూ చుట్టూ ప్రపంచాన్నే మర్చిపోయేను.

ఆవిడ డబ్బులాట విన్నాక నా కబుర్లూ నా నవ్వూ అంతా ఆవిడకి వేరేగా కని

పించిందన్న సంగతి తెలిసింది.

'హుం'

మరో గత్యంతరం లేనిమాట నిజమే— ఇక్కణ్ణుంచి వెళ్ళిపోవాలి. ఎక్కడికి వెళ్ళాలి? ఏం చెయ్యాలి?

ఆవిడలా అన్నందుకా ఏడ్చేస్తూ! ఏడుస్తూ ఉంట! నేను ఊర్నుంచి వెళ్ళిపోతే ఆవిడ అమ్మయ్య అనుకుంటుంది. వాళ్ళ దెబ్బలాట నేవిన్నట్టూ—ఆవిడకి తెల్సు. నే వెనక్కి తిరిగి వచ్చేస్తూ ఉంటే ఆవిడ చూసింది.

ఊహూ, ఆవిడ మాటలకి బాధ కలగలేదు. వెర్రావిడ! ప్చ్! ఆవిడ గొడవ ఆవిడది!

కాని ఆయన అన్నమాటలు??

రూపా బొమ్మ మున్నీ కివ్వడానికి వెళ్ళకపోయి ఉంటే, వాళ్ళిద్దరి దెబ్బలాటా వినకపోయిఉంటే! నామనస్సు నాకు తెలీకుండానే ఉండేదా?

నిజం! పచ్చి నిజం! ఈ నిజాన్ని ఈ పచ్చి నిజాన్ని పదిలంగా వెయ్యి పొరల మధ్యని అట్టడుగుని—నాకే తెలీకుండా ఉన్నదాన్ని ఆయన ఎలా పోల్చేసేడో??

ఏంకాదు—అది నిజంకాదు. అబద్ధం. ఉత్తి భ్రమ. ఉత్తుత్తిదే ఊహించుకుని ఆయన ఆపాదించేడు.

సరే, ఆయన ఉత్తుత్తిదే ఆపాదిస్తే, రూపా బొమ్మని మున్నీకి యివ్వకుండా, మున్నీని చూడన్నా చూడకుండా, వాళ్ళింట్లోకి అడుగుపెట్టకుండా గుమ్మంలోంచే ఎందుకు తిరిగొచ్చేసేనూ? తిండీ తిప్పలూ మాని, వెక్కివెక్కి ఏడుస్తూ సొమ్మసిల్లి నాకు తెలీకుండానే మగతగా ఎందుకు పడుకున్నానూ?

'నీకో గమ్మత్తు యిస్తాను' అంటూ మున్నీని ఈ పదిరోజులూ ఊరించేనే. ఆ పసిపిల్లకి ఆశ పెట్టేనే!

'భగవాన్!'

నిజాన్ని ఎత్తిచూపెడితే గిలగిల్లాడి పోతున్నావ్! నిన్ను నువ్వు మరిపించుకొని నవ్వుతూ ఓ పోజుకొట్టి బతుకుతున్నావనీ నీలోపల ఏంలేదనీ, ఉత్తి డొల్ల అనీ ఆ డొల్లని నింపడం నీతరం కాదనీ బుర్రలో పిసరంతన్నా తెలివున్నవాడు పోల్చేస్తాడు!

కళ్ళుమూసుకుని పాలు తాగితే ఎవరికీ తెలీకుండా ఎలా ఉంటుంది?

నిన్ను నువ్వు మభ్య పెట్టుకుంటావు.

# శరణ్యం

పోసి, మరిపించుకుంటావు. నీకు తెలీనట్టే నువ్వుంటావు. కాని లోలోపల నీకు తెల్సు లోలోపల డొల్ల అనీ గుల్ల అనీ తెలుసు. నీకు భయం! అది ఒప్పుకోడానికి భయం!!

గంభీరమైన దాన్ననీ, నా కడుపులో రాముడే ఉన్నాడో భీముడే ఉన్నాడో ఎవరికీ తెలీదనీ అనుకుంటావు. ఆ గాంభీర్యం లోతైనది కాదనీ, నీ ప్రతిమాట వెనకా, నీ ప్రతి చేష్ట వెనకాతలా, నువ్వెవరివో ఖచ్చితంగా నువ్వు నువ్వుగా పారదర్శకమై కనిపించి పోతావని నీకు తెలీదు!

'బాబోయ్!' బాధతో మూలిగేను.

ఈ ఊరినుంచి వెళ్ళిపోతాను. మున్నీకి దూరంగా వెళ్ళిపోతాను!

మరో ఊళ్ళో ఇంకో మున్నీ ఉండదా? మరో ఊర్లో ఇంకో మున్నీకి అమ్మా, నాన్నా ఉండరా?

నిజమే! ఏ ఊర్లో అయినా మున్నీలు ఉంటారు! మున్నీల అమ్మలు ఉంటారు! మున్నీల నాన్నలు ఉంటారు!!

కాని నేనా మున్నీలవేపు చూడను. వాళ్ళతో మాట్లాడను. పద్యాలు చెప్పను. వాళ్ళతో ఆడుకోను!

అంటే? రాయివై పోతావా?

కళ్ళనిండా నీళ్ళు నిండుకొచ్చేయి.

'ఆవిడ్నీ నువ్వు అర్థం చేసుకోవేం? అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తే నువ్విలా మాట్లాడవ్' ఆయన అంటున్నాడు.

'నేనేమీ అర్థం చేసుకో అక్కర్లేదు. మీరు చాలా గొప్పగా అర్థం చేసుకున్నారుగా? అది చాలు! ఆవిడ మాటెలా ఉన్నా మీ సంగతి బాగా అర్థం చేసుకుంటున్నా. ఆవిడ వచ్చేసరికి మీ మొహం మెర్క్యురీ దీపంలా వెలిగిపోతుంది. కబుర్లు చెప్పడానికి, ఇంటికప్పు ఎగిరిపోయేటట్టు నవ్వడానికీ ఎక్కడలేని ఓపికా వచ్చేస్తుంది! నే చదువురానిదాన్నే కాని లోకాన్ని బోధపర్చుకోవడం ఎంతసేపూ? ఇలాంటి రకాల్ని యిట్టే పోల్చొచ్చు. నాకళ్ళు తెరుచుకునే ఉన్నాయి. అదిమాత్రం గుర్తుంచుకోండి.'

'ఛీఛీ, ఏవిటా పెడర్ధపు మాటలు? తోటి ఆడదాన్ని అలా అనకు! ముఖ్యంగా ఆవిడ్నేమీ అనకు. నువ్వూ ఆడదానివే! తల్లివే! ఆవిడా నీ యీడదే! మున్నీలాంటి అమ్మాయి ఆవిడకీ ఉండాలని అనిపించదూ?'

'పెడర్ధమా? అంటే అంటాను. ఆవిడ్నెందుకు అలా సమర్థించుకు పోతున్నారు? అంత పిల్లలే కావాలని ఉంటే నిక్షేపంలా పెళ్ళి చేసుకోమనండి. సలక్షణంగా పిల్లల్ని కనుక్కొని అనుభవించమనండి. అంతేకాని పక్కవాళ్ళ కాపరాల్లో......'

'అన్నీ అందరికీ నిక్షేపంలాగా జరగవు. సలక్షణంగా సాగవు. అలాంటి వాళ్ళలో ఆవిడొకర్తి! నీలాగే నిక్షేపంగా ఉంటే, ఆవిడకి నీ మున్నీలాంటి మున్నీ ఉంటే ఆవిడ మనింటికి వచ్చేదే కాదు. మున్నీతో ఆడుకునేదీ కాదు. నువ్వు బలిమాలినా మున్నీకి పద్యాలు చెప్పేదీ కాదు! ఆవిడకో యిల్లంటూ ఉంటే నీ యిల్లూ నీయిల్లూ ఎందుకు తిరుగుతుందీ? నీ పిల్లనీ నీ పిల్లనీ దగ్గరికి తీసుకుని ఎందుకు ఆడుకుంటుంది? పాపం ఆవిడ కింతకంటే శరణ్యం లేదు. నో ఎస్కేప్! ఏంచేస్తుందీ? అర్థం చేసుకో. అంతేకాని అభాండాలు రుద్దకు. పెడర్థపు మాటలు మాట్లాడకు!'

ఇంక వినలేక గిర్రుని వెనక్కి తిరిగి వచ్చేసేను. నిజం నిజం! ఆయన నిజాన్ని పట్టుకున్నాడు.

ఒంటరితనాన్ని పోగొట్టుకోడానికి లోలోపల ఏరోజు కారోజు పెరిగిపోతున్న శూన్యాన్ని కృత్రిమంగా నింపుకోడం కోసం మున్నీతో ఆడుతున్నాను!

తీర్చడానికి వీల్లేని లోటుని మరిచిపోడానికి మున్నీతో ఆడుతున్నాను!

ఈ నిజాన్ని అట్టడుగున జాగ్రత్తగా నాక్కూడా కనిపించకుండా దాచేసుకున్నాను! నన్ను నేను మభ్యపెట్టుకున్నాను!

కళ్ళు ఘట్టిగా మూసుకున్నాను.

'ఆవిడ కింతకంటే శరణ్యం లేదు. నో ఎస్కేప్!' ఆయన మాటలు గింగురుమంటున్నాయి, చెవుల్లో హోరు పెడుతున్నాయి. మొహం తిరుగుతున్నట్టనిపించింది కాళ్ళూ చేతులూ తొక్కల్లా వేళ్ళాడి పోతున్నాయి. తలని తాళ్ళవేసి బిగించి కట్టేసినట్టుంది. గుండెలమీద పెద్ద బరువు పెట్టినట్టుంది. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి.

'నో ఎస్కేప్! నో ఎస్కేప్!'

నా గుండెలమీంచి బర్ బర్ మని చప్పుడు చేసుకుంటూ వాటర్ వర్క్సు వాళ్ళ ట్రక్కు వెళ్తోంది!! ●

# వారఫలం

**15-3-68 శుక్రవారం మొదలు**
**21-3-68 గురువారం వరకు**

**మేషం.** మీకు ఇష్టంలేకపోయినా, ఇతరుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది. వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఆందోళన కలుగుతుంది

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**వృషభం** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు మీద ఆధారపడి ఇతరులకు వాగ్దానాలు చేయడం తగదు. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది సాటివారిలో గౌరవం లభిస్తుంది ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మిధునం:** కొన్ని వ్యవహారాల్లో మీ మంచి తనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది భారీయెత్తున చేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది సాహసముతోకూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు దైవకార్యాలు నెరవేరుతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**కర్కాటకం** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది వృత్తిలో అనుకూల వార్తలను వింటారు ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

**సింహం** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండ నెరవేరతాయి అధికార్ల వలన జరగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది ప్రయాణాలు ఫలిస్తాయి సజ్జనసాంగత్యం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు

**కన్య:** మీ ఆత్మవిశ్వాసమే అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించగలదు. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బుచేతికి వస్తుంది ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలాసవస్తువులు కొంటారు

**తుల:** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగ ఉంటాయి. వ్యాపారంలో సాటివారితో యేర్పడిన పోటీ తగ్గుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం** వృత్తిలో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికివస్తుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి

**ధనుస్సు:** ఇప్పుడు మీరు చేసే ప్రయత్నాల్లమున్ముందు చాలా ఉపయోగంఉంటుంది వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. వారం ఆఖరులో చికాకులు కలుగుతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉండవు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది సాహిత్యకళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

**మకరం.** వృత్తిలో అనుకూలమైన మార్పులు వస్తాయి. వ్యాపారంలో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. కోర్టు వ్యవహారాలు ప్రోత్సాహకరంగ ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు.

స్త్రీలకు— సాటివారిలో గౌరవం లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కుంభం** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడుతుంది సాహిత్యకళారంగాల్లో మీకృషికి ఆటంకాలు వస్తాయి. వారం మధ్యలో అనుకూలత లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో స్వల్పభేదాభిప్రాయాలు వస్తాయి సంతోషకరమైన వార్తలను వింటారు

**మీనం** పూర్తిగా నెరవేరేవరకు యే వ్యవహారన్ని నమ్మడానికి అవకాశంలేదు సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. అలంకార వస్తువులు కొంటారు.

—మహేష్






# పాపం పసివాడు!

కె. కామలక్ష్మి

'పాపకి తొమ్మిది నెలలు దాటిపోయాయి. ఓక్షణం తెరిపిగా ఉండనివ్వడంలేదు. ఇంక ఉత్తరాలెక్కడ రాయను? రోజూ తలైనా దువ్వుకోడంలేదు' అంటూ వాపోయిందో కొత్త తల్లి. నిస్సహాయంగా పడుకుని ఉండే పసివాడు కాస్తా తొమ్మిది పదినెలలు వచ్చేసరికి కొత్త రకం వ్యక్తిత్వాన్ని పుంజుకుని 'స్వాతంత్ర్యం నా జన్మ హక్కు' అంటాడు. ఆ చేతకాని తనంతోనే కొత్త కొత్త సంగతులు తెలుసుకోవడానికి నేర్పును సంపాదించడానికి తెగ తాపత్రయ పడుతాడు.

అన్నం ముద్దగా పెడితే తల తిప్పి తోసేయడం లాంటివి ఓ సంవత్సరం పూర్తి అయేలోపలే ప్రారంభిస్తాడు. అంతేకాదు. నోట్లో పెట్టినది అందంగా అంతటా పడేలా ఉమ్మేస్తాడు. అర్ధాకలితో ఎక్కడుంటాడో అని బెంగపెట్టుకునే తల్లి ఓ లెక్కా వాడికి? ఇలాంటప్పుడే బలవంతంగా అన్నం కుక్కడం ప్రారంభిస్తారు. అదేమంత మంచిపని కాదు. ఇలా తినడం అలవాటైతే ఓ పట్టాన స్వంతంగా తినే ప్రయత్నం చేయడు. అందుకే తనే తింటానన్న చిన్నవాణ్ణి తీసుకు తిననియ్యాలి. కొంచెం పని ఎక్కువ చేస్తాడు తప్పించి అంతకుమించిన ప్రమాదం ఉండదుకదా! మనం తినిపిస్తే తిన్నంత కడుపునిండా తినడన్న బెంగ అక్కరలేదు. ఎంత కావాలో అంతా తింటాడు. బతిమాలి తినమంటే అసలే తిననని మొండికి వేయవచ్చు. భోజనం దగ్గర చిన్న యుద్ధరంగంలాగా తయారు చేయడంలో అర్థం ఉండదు. ఎలాగా పసివాడే గెలుస్తాడు! అంచేత నేర్పుగా తల్లి చూస్తూ తిన్నంత తిననిచ్చి ఊరుకోవాలి.

నిద్ర విషయంలో కూడా అంతే. మరీ నెలల పిల్లాడుగా ఉన్నంత నిద్ర ఎదుగుతున్నకొద్దీ ఉండదు. బొద్దుగా ఉండే పసివాళ్లు ఎక్కువగా పడుకోవచ్చు. పగటిపూట కూడా ఓ గంటో అరగంటో ఇలాంటి వాళ్లు నిద్రపోతారు. కాని సన్నగా పీలగా ఉండే పిల్లలకి అంత నిద్ర అవసరమే కనబడదు. రెండేళ్లు వచ్చేటప్పటికే పగటి నిద్రకి స్వస్తి చెప్తారు వీళ్లు! మనం ఒకటి గుర్తు పెట్టుకోవాలి. పిల్లవాణ్ణి నిద్రపొమ్మనడం మనతరం కాదు. వాడు నిద్రపోతాడు, అందుకు మనం దోహదం మాత్రమే కల్గించాలి. పడుకోబోయేముందు ఒళ్లు శుభ్రంగా తుడిచి ఉతికిన చొక్కా తొడిగి పడుకోపెట్టాలి. కథ అర్థం చేసుకునే వయస్సయితే ఓ అరగంట ఊకొట్టిస్తే నిద్రపోతారు. ఒళ్లు తిరిగేలా ఉయ్యాల ఊపడం తల దిమ్మెక్కేలా జో కొట్టడంలో అర్థం లేదు. నిద్ర లేచినప్పుడల్లా మంచినీళ్లో పాలో పడతూ ఉంటారు కొందరు తల్లులు. అదే బాగుందని వాటికోసం అడపా తడపా లేవడానికే ప్రయత్నిస్తాడు పసివాడు.

వింత స్వతంత్రంగా ఉండాలని ప్రయత్నించినా పసివాడు పసివాడే. వాడికి ముద్దుచేయడం, లాలించడం ఎంతో అవసరం. అసంతృప్తి, ఏదో తెలియని ఆరాటం, తోచకపోవడం వంటివి పిల్లవాడిని వేలు చప్పరించేలా చేస్తాయంటారు. వేళ్లకి కట్లు కట్టి వగరు పదార్థాలు పూసీ, నోట్లో వేలు పెట్టుకున్నందుకు శిక్షించీ ప్రయోజనం ఉండదు సరికదా, అలవాటు మరీ బలపడుతుంది. పాలపళ్లు ఊడి శాశ్వతమైన దంతాలు వచ్చేలోగా ఇలాంటి అలవాటునుంచి పిల్లలని తొలగించాలి. లేకుంటే ముందరిపళ్లు వంకర వస్తాయి.

పిల్లలకి శక్తికిమించిన పనులు చేయాలని ఉంటుంది. శక్తి ఉంటుంది. కాని శరీరబలం సరిపోదు. అప్పుడప్పుడే శక్తిహీనత కోపంగా ఏడుపుగా అర్థంలేని అల్లరిగా బయట పడుతుంది. ఇంట్లో ఇంకో చిన్న అన్నగారో అక్కగారో ఉంటే ఇలాంటివి ఎక్కువగా ఉండడం కూడా సహజమే. పోటీ కదా మరి!

పిల్లవాణ్ని పెంచి పెద్ద చేయడం అంటే — ఎదగడానికి స్వేచ్ఛ నిస్తూ, దాంట్లోనే క్రమశిక్షణకీ, రక్షణకీ స్థానం కల్పించడం అన్నమాట. అప్పుడప్పుడు దగ్గరకి తీసుకోవడం, ఓ పొగడ్త పారేయడం, లాంటివి అతని ఆత్మ సంతృప్తికి బలాన్నిస్తాయి. ఎంత అల్లరిచేసినా, గోల చేసినా తిక్కగా ప్రవర్తించినా అంతరాంతరాలలో పసివాడికి ఒకటే ఊహ ఉంటుంది. అదే తల్లిని ప్లీజ్ చేయడం! అంతకంటె తల్లికేం కావాలి? ●

వంటలు:

## రవ పుట్టు

ఒక పౌను రవ. కమ్మగా వాసన వచ్చేలా వేయించి ఉప్పునీళ్లుజల్లి ఉంచాలి. ఈ తడిపిన రవ్వ అత్తుకుని విడిపోయే పదునులో ఉండాలి. ఈ రవ్వ ఆవిరిమీద ఉడికించి దింపుకోవాలి. తీపి యిష్టమయితే— పంచదార ఏలకపొడి వేయించిన జీడిపప్పు కలిపి వడ్డించవచ్చు. లేకుంటే ఉప్మాకిలాగా— ఆవాలు, జీలకర్ర, కరివేపాకు ఉల్లిపాయ, పచ్చిమిరప, అల్లం ముక్కలు పోపువేసి, ఏ కొబ్బరి పచ్చడో నల్చుకుందుకు వేసి వడ్డించుకోవచ్చు. ఈ పుట్టు ఆరోగ్యమే కాకుండా చాలా రుచిగా ఉంటుంది. ●

# యాచనను మించిన త్యాగం



## ధర్మపథం

**బులుసు వేంకటరమణయ్య**

కొందరు వదాన్యులు అడిగిన దాని కంటె అధికంగా ఇచ్చి యాచకులను తృప్తిపరుస్తారు. తమ దగ్గర లేక పోయినా సరే—ఏ విధంగానయినా సంపాదించి యిచ్చి తృప్తి పరుస్తారు. అట్టి వదాన్యులలో అగ్రస్థానాన్ని ఆక్రమించిన వాడే రఘు మహారాజు!

రఘు మహారాజు గొప్పదాత! ఆయన సర్వజిద్యాగం అనే గొప్ప యాగం చేసి, తనకు వున్న సర్వస్వాన్నీ అందరికీ దానం చేశాడు. కట్టుకున్న బట్టలూ, అవసరమైన కొన్ని మట్టిపాత్రలూ తప్ప అతని దగ్గర మరేవీ లేవు.

అలాంటి సమయంలో ఆ మహారాజును అపారమైన ధనాన్ని యాచించడానికి కౌత్సుడనే ముని కుమారుడు వచ్చాడు. రఘు మహారాజు పరిస్థితిని చూచి చాలా దిగులు పడ్డాడు.

ముని కుమారుడికి ధనం ఎందుకు కావలసి వచ్చిందీ? అతని స్వంతం కోసం ధనరాశి అక్కర్లేదు.

కౌత్సుడు వరతంతు మహాముని దగ్గర శిష్యుడుగా చేరాడు. ఎక్కువ వినయ విధేయతలతో గురు శుశ్రూష చేశాడు, ఆయన అభిమానించి పద్నాలుగు విద్యలు బోధించాడు. ప్రతిభావంతుడైన కౌత్సుడు ఆ విద్యలన్నిట్లోనూ పరిపూర్ణ పాండిత్యం సంపాదించాడు.

ఇక ఆశ్రమం విడిచి వెళ్లిపోవడానికి గురువుగారు కౌత్సుడికి అనుమతి ఇచ్చారు. కాని, గురుదక్షిణ యివ్వకుండా వెళ్లిపోవడం అతనికి యిష్టంలేదు. 'గురుదక్షిణ యేమి కావాలో తెలపాల'ని శిష్యుడు గురువును ప్రార్థించాడు.

'నువ్వేమీ యివ్వనక్కర్లేదోయ్. నీవు చేసిన సేవయే గురుదక్షిణ, అది చాలు' అన్నాడు మహాముని. 'నేను దక్షిణ యివ్వాలనే సంకల్పించుకున్నాను. మీరేమి కోరేదీ చెప్పక తప్పదు' అని కౌత్సుడు నిర్బంధించాడు.

ఆ నిర్బంధంతో వరతంతు మునికి శిష్యునిపైని తీరని కోపం వచ్చింది. ఆ కోపంతో 'నన్ను నిర్బంధిస్తున్నావు కాబట్టి చెప్తున్నాను. నీవు నేర్చుకున్న పద్నాలుగు విద్యలకూ పద్నాలుగు కోట్ల సువర్ణ నాణాలు దక్షిణగా ఇయ్యి' అన్నాడు.

ఆ మాటకు కౌత్సుడు కొంచెం చకితుడయినా దిగులు పడలేదు. రఘు మహారాజు దగ్గరకు పోయి యాచిస్తే, ఆ ధనం తప్పక లభిస్తుందని అతని ధైర్యం. ఆ ధైర్యంతోనే రఘు మహారాజు దగ్గరకు వచ్చాడు. వచ్చి పరిస్థితులను గ్రహించాడు. ఒక్కసారిగా దిగులూ కలిగింది,

ఈ విషయం అతడు రఘు మహారాజుతో చెప్పి మరో చోటికి యాచనకు వెళ్లాలని యత్నించాడు.

'అయ్యా! నీవు నా వద్దకు వచ్చి ఉత్త చేతులతో వెళ్లడం నాకు అవమానకరం! ఈ దినం ఉండు. రేపు తెల్లవారే సరికి నీకు కావలసిన ధనం యిస్తాను' అని చెప్తూ, రథం సిద్ధం చెయ్యవలెనని సారధికి ఆజ్ఞ యిచ్చాడు, ధనం కోసం కుబేరుడి మీదికి దాడి వెడలడానికి.

ఈ సంగతి ఎలాగో కుబేరుడికి తెలిసింది. తెల్లవారే లోపలే రఘు మహారాజు కోశాగారం సువర్ణంతో పండిపోయింది.

ఆ ధనం పద్నాలుగు కోట్లు మాత్రం కాదు. అంతకు ఎంతో ఎక్కువగానే ఉంది. ఆ ధనం అంతా తీసుకోవల్సిందని మహారాజు కౌత్సుడిని కోరాడు. పద్నాలుగు కోట్లకంటె ఒక నాణెం కూడా అధికంగా తీసుకోనని కౌత్సుడు అన్నాడు.

కొంతసేపు రఘువూ, కౌత్సుడూ యీ విషయంలో వాదులాడుకున్నారు.

రఘు మహారాజు వదాన్యతను దేవతలు కూడా ప్రశంసించారు. అడిగిన దానికంటె ఎక్కువ ఇస్తానన్నవారు ఎవరుంటారు? ఎక్కువ ఇస్తూ వుంటే వద్దనేవారు కూడా అరుదే!

# డాక్టర్ కబుర్లు

## ఆహార పానీయాలు, ప్లాస్టిక్ పాత్రలు

శుభ్రంగా ఉండే ప్లాస్టిక్ పాత్రలలో ఆహార వస్తువులు పెడితే ప్రమాదం ఏమీ లేదు. అయితే కొందరు ఇటువంటి పాత్రలలో పెట్టిన వాటిని పుచ్చుకోలేరు.

గాజు, ప్లాస్టిక్ పాత్రలలో ఉంచితే తేడాని ఇటువంటివారు కనిపెట్ట గలుగుతారు. ప్లాస్టిక్ సీసాలో పెట్టిన నీరు తాగితే గొంతుక బిగుసుకోవటం, మింగటానికి కష్టం, ముక్కు దిబ్బడి వెయ్యటం, వికారం రావచ్చు.

ప్లాస్టిక్ పాత్రలలో మనుషులకి హాని కలిగించే రసాయన పదార్థం ఉన్నట్లు తోచదు. కాని ఇటువంటి వారికి ఈ ఇబ్బందులు రావటానికి ఏదో కారణం ఉండి ఉండాలి! పరిశోధనం అవసరం.



హెచ్. ఎల్. హెర్వెన్సన్

(కాపీరయిటు)

# చీకటి కడుపున కాంతి

సి. ఆనందారామం

### జరిగిన కథ

**వారిజ ఆ వూరికి కొత్తగా వచ్చింది. రామచంద్రని ఆకర్షించింది. అతనిని ఇంటికి ఆహ్వానించింది. ఆమె వివరాలు సేకరిద్దామనుకున్న రామచంద్ర ప్రయత్నం ఫలించదు. వారిజ అతనిమీద అనురాగాన్ని ప్రకటించినా అర్థం చేసుకోలేకపోతాడు. అతనికి తెలిసిందల్లా ఒకటి. ఆమె మెడలో నల్లపూసలున్నాయి. ఆమెకి పెళ్ళయింది. తను దూరంగా వుండాలి అని.**

## 2

రామచంద్ర వస్తాడనే ఆశ ఏ కోశానా లేకపోయినా తెల్లవారు జామున లేచి ఏటి కట్టుకు బయలు దేరింది వారిజ—తన కంటె ముందుగానే అక్కడ కూర్చున్న రామచంద్రను చూడగానే ఆమె కళ్ళు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి. సంభ్రమంతో మిల మిల లాడాయి — సంతోషాధిక్యంతో వెలిగి పోయాయి——

'మీరు వచ్చారు—'

అంది—ఏదో అపూర్వమైన సంపద తనకు లభించిన పసిపాపలా — ఎడంగా కూర్చుంది.

'అవును—వచ్చాను— మీ స్నేహం నాకు కావాలి—'

ఏదో పెద్ద సాహసకార్యం చెయ్యడానికి తెగిస్తున్న వీరుడిలా తలెగరేసి అన్నాడు—

'అయినా స్నేహితులుగా ఉన్నంతలో తప్పేముంది?' నీరసంగా అన్నాడు—ఆ మాటలు వారిజతో అంటున్నట్లు లేవు—తనకు తాను సంజాయిషీ ఇచ్చుకున్నట్లు ఉన్నాయి—

'భగవంతుడా! ఆనందం పట్టలేక నా గుండెలు బ్రద్దలవుతాయేమోనని పిస్తోంది. బ్రతుకు నా కోసం ఇంకా ఇంత ఆనందాన్ని దాచిందని నే నాశించ లేదు—'

ఆరాధనా భావంతో రామచంద్రను చూస్తూ అంది వారిజ—

'నిజమా! నా స్నేహం మీ కంతటి ఆనందాన్ని కలిగిస్తుందా?' వారిజముఖంలో తన ప్రశ్నకి సమాధానం స్పష్టంగా తెలిసి పోతున్నా అడిగాడు—వారిజ పక పక నవ్వింది.

'మీకు కలిగిన ఆనందమే నాలోనూ ప్రతి ఫలిస్తోంది.'

ఒక్కక్షణం ముఖం ఎర్రబడ్డా తనూ నవ్వేసాడు రామచంద్ర——

'ఇవాళ నన్ను మీతో మీ పొలానికి తీసి కెళతారా? పచ్చని పంట పొలాలు చూడా లంటె నాకెంతో సరదా—'

'అలాగే! సినిమాలలోలాగ నేను నాగలి పట్టుకుని దున్నుతాననుకునేరు! అన్నీ కూలీలే చేస్తారు — నేను స్వయంగా దగ్గరుండి చూసుకుంటా నంతే! కాని—'

'ఏమిటి?——'

'మీ వారు ఏమైనా అనుకుని మీకు—'

కిల కిల నవ్వింది వారిజ—

'మహానుభావా! ఆ విషయం పూర్తిగా మర్చిపొండి— మా వారికి నాలో సంపూర్ణ విశ్వాసం ఉంది—ఆయన ఒక్క నాటికీ ఏమీ అనుకోరు——నాకే ఆపదా రాదు.'

వారిజా రామచంద్రలు కలిసి పొలాని కెడుతూంటే పల్లె పల్లె అంతా విరగబడి చూసింది—

'వాళ్లంత వింతగా చూస్తున్నారో చూడండి—' అన్నాడు రామచంద్ర—

వారిజ నవ్వింది—

'న్యాయానికి వాళ్లను తప్పు పట్టడం దేనికి? ఆ మాటకొస్తే మన ఈ ప్రయాణం మనకే వింతగా లేదూ?!'

రామచంద్ర కూడా తేలిగ్గా నవ్వేసాడు—

'నిజమే! ఇప్పటికీ ఇదంతా నిజమో, కలో అర్థం కావటంలేదు నాకు—'

పొలం సమీపిస్తుండగానే ఎదురొచ్చాడు వీరన్న. వారిజను వింతగా చూస్తూ ఆగి పోయాడు—

'ఈ విడ వారిజగారు వీరన్నా!.'

నర్వస్‌గా నవ్వుతూ అని ఆగి పోయాడు రామచంద్ర, అంతకంటె ఏం చెప్పాలో తెలీక—

వీరన్న పులుకు పులుకున వారిజ వంక చూసాడు—

'ఇతను వీరన్న — మా పాలేరు—కానీ, నాకు ప్రాణానికి ప్రాణం — ఇంతకంటె మంచి స్నేహితుడు నాకీ ఊళ్లో ఎవరూ లేరు—ఇప్పుడు నాదగ్గిర చదువు కుంటు న్నాడు—మొన్ననే మెట్రిక్ పాసయ్యాడు—'

వీరన్నను వారిజకు పరిచయం చేసాడు రామచంద్ర. వీరన్న ముఖంలో ఒక్క క్షణం చిరునవ్వు చిందులాడినా వారిజను చూడ గానే ముడుచుకు పోయింది—

'మీరాపాకలో కూచోండి — నేనిప్పుడే వస్తాను—'

అంటూ గిరున తిరిగి వెళ్లిపోయాడు.

వారిజ బాధపడుతుందేమో నన్నట్లు నొచ్చుకుంటూ చూసాడు రామచంద్ర—

వారిజ నిర్వికారంగా నవ్వింది—

పొలానికి పక్కనే చిన్న డేరాలాగ ఒక పూరిల్లు కట్టుకున్నాడు రామచంద్ర — ఒక వారగా బల్ల, కుర్చీ, కొన్ని పుస్తకాలూ, కాగితాలూ ఉన్నాయి—వారిజ లోపలికి వచ్చి కుర్చీలో కూర్చుంది—

'కూలీలు సరిగ్గా చేస్తున్నారో లేదో చూస్తూ వాళ్లకు సలహాలిస్తూ మధ్య మధ్య ఇక్కడ విశ్రాంతి తీసుకుంటూ ఉంటాను—మీరు కాస్సేపిలా కూర్చోండి—నే నొక్కసారి కూలీలతో మాట్లాడి వస్తాను—'

వారిజ ముందు కొన్ని పుస్తకాలు పడేసి, చకచక బయటికెళ్లిన రామచంద్ర పది నిముషాల్లోనే తిరిగి వచ్చేసాడు—

'అప్పుడే వచ్చేసారే!'

అప్పుడప్పుడే ఏదో పుస్తకం తెరవ బోతున్న వారిజ అంది—

'మీ ఒక్కరికే ఏం తోస్తుంది మరి?'

వారిజ నవ్వి కుర్చీలోంచి లేచింది—

'పంట పొలాల మధ్య నడుస్తూంటే నాకు

చాలా సరదా! వెళ్దాం పదండి—'

'మరి, మీరు నడవగలరా?'

'మామూలుగా అయితే ఏమో! మీరు పక్కనుండి కబుర్లు చెపుతోంటే ఎన్ని మైళ్ళన్నా నడవగలను—' రామచంద్ర గబుక్కున తలవంచుకున్నాడు— అంతలో తలెత్తి—

'మీకు పుణ్యముంటుంది — ఇలా మాట్లాడకండి—' అన్నాడు—

'ఏం? నేను మాట్లాడిన మాటల్లో తప్పేముంది? స్నేహితులతో కబుర్లు చెపుతోంటే శ్రమ తెలుస్తుందా?'

ఒక్కసారి వారిజ ముఖంలోకి చూసి రాబోతున్న నిట్టూర్పు నాపుకుని 'పదండి—' అన్నాడు—

వరిచేలు వయ్యారంగా ఊగిపోతున్నాయి— మడుల మధ్య ఇరుకు గట్ల మీదుగా నడుస్తూ వాటిని చూడటం ఎంతో హాయిగా ఉంది వారిజకు — సూర్యుడు పైపైకి వస్తున్నా శీతాకాలపు చలిగాలులలో వేడి కరిగిపోయి సూర్యకిరణాలు శరీరాలను వెచ్చగా తాకుతున్నాయి— కంకులతో బరువుగా వరిగిపోతూ, ఆకులతో పచ్చగా కళకళలాడుతూ ఎవరో వనదేవతలు గుమికూడి నాట్యం చేస్తున్నట్లుగా ఉన్నాయి పంటచేల్కు— దూరంగా నిండుగా నిదానంగా పారుతోన్న ఏరు—

గట్టుమీద నడుస్తోన్న వారిజ కాలుజారి పడబోయింది— చటుక్కున ఆమెను తన చేతులలో పొదువుకొని పడకుండా ఆపాడు రామచంద్ర. అతని భుజంమీద వాలింది ఒక్క క్షణం వారిజ శిరసు—అంతలో సర్దుకుని పక్కకు నిలిచి కిలకిల నవ్వింది —'నవ్వటం కాదు — కాలు జారిందంటే ఆ బురదలో పడేవారు — అప్పుడుండేది తమాషా!'

గంభీరంగా అన్నాడు రామచంద్ర.

'మీరున్నారుగా నా ప్రక్కన! నా కాలు జారకుండా కాపాడటానికి!'

వారిజ నవ్వుతూనే అన్నా, రామచంద్రకి అదోలా వినిపించింది — తలెత్తి సూటిగా వారిజ ముఖంలోకి చూసాడు—

వారిజ నవ్వి 'నా మాటల్లో అర్థాలు వెతక్కండి—పదండి—' అంటూనే అతని చెయ్యి పట్టుకుంది — ఒక్కసారిగా రామచంద్ర అణువణువూ ఝల్లుమంది. ఆమె చెయ్యి విదిలించుకోవాలనే ఆలోచన లోలోపల కలిగినా, కనీసం ఆ ప్రయత్నం కూడా చెయ్యలేకపోయాడు—పైగా తన చేతిలో ఉన్న ఆమె చేతిని మరింత దృఢంగా పట్టుకున్నాడు—

రామచంద్ర చేతిలో తన చెయ్యి బంధింపబడగా, ఆహ్లాదకరమైన వాతావరణంలో సుందరమైన ప్రకృతి మధ్య నిల్చిన వారిజ 'మానవజీవితం చాలా మధురమైంది—' అంది—

అప్పటికి తనలో ఉవ్వెత్తున్న చెలరేగు



# చీకటి కడుపున ...

తోన్న చంచలత్వాన్ని నిగ్రహించుకోగలిగాడు రామచంద్ర—

ఆమె చేతిని అలాగే పట్టుకుని ఉన్నాడు—

'అవును. మానవజీవితం మధురమైంది—సృష్టి—సుందరమైంది. ఈ సౌందర్యాన్ని మాధుర్యాన్ని అనుభవించడానికి మనకి సున్నితమైన మనస్సుండాలి కాని, ఈ సున్నితత్వం సౌందర్యాన్ని మాధుర్యాన్నే కాక క్రోధమూ, అసహనాన్ని, అశాంతినీ కూడా అంతే వాడిగా గ్రహిస్తుంది. వీటికి భయపడి సున్నితమైన మనసు బండ చేసుకుని జీవితంనుండి పారిపోతారు కొంతమంది—కానీ, అప్పుడూ జీవితాన్ని మానవజీవిత మన డానికి వీల్లేదు—అది పాశవికం—సృష్టికర్త మానవులకు ప్రసాదించిన అపురూపమైన అత్యుత్తమ వరాన్ని నష్టపరచుకొన్న దౌర్భాగ్యుల దుస్థితి అది—'

వారిజ క్రిందపెదవి పళ్ల మధ్య నలిగి రక్తాన్ని చిమ్ముతోంది. కళ్లు దిగంతాలలో ఏవో వెతుక్కుంటున్నాయి—

రామచంద్ర ఒక్కసారి వారిజను కుదిపి 'ఏమిటి?' అన్నాడు గాబరాగా—

తన వంట్లో జీవమంతా ఎవరో లాగేసుకున్నట్లు అక్కడే ఆ గట్టుమీద కూలబడిపోయింది వారిజ—

'చూశారా! మీరు నడవలేరని నాకు తెలుసు—చెప్పే వినలేదు — ఇప్పుడెలా? ఉండండి—నా పాకలో కెళ్లి—ఫ్లాస్కులోది కాస్త కాఫీ తీసుకొస్తాను—' కంగారుగా అని వారిజ వారించేలోగానే వెళ్లిపోయాడు రామచంద్ర—

ఒక్కసారి భోరుమని ఏడవగలిగితే బాగుండుననిపించింది వారిజకు—

చిత్రం! ఒక్క కన్నీటిబొట్టు కూడా రాలేదు.

ఆ కన్నీరు సహితం కొందరు అదృష్టవంతులకే లభిస్తుంది—

ఫ్లాస్కు, గాజుగ్లాసు తీసుకుని వచ్చాడు రామచంద్ర—కాఫీ గ్లాసులో పోసి వారిజ ముందుంచి, 'ముందు ఇది త్రాగండి—తరువాత వెనక్కు తిరిగి వెళ్లిపోదాం—మిమ్మల్ని ఎత్తుకుని తీసికెళ్లేవాడినే! నా మీద మీరుంచిన నమ్మకాన్ని వమ్ము చేసుకోలేను—' అన్నాడు—

కాఫీ అందుకుని అతని ముఖంలోకి చూసింది వారిజ—

తీక్షణంగా మెరుస్తోన్న ఆ కళ్లల్లో ప్రతిఫలిస్తోన్న నైర్మల్యానికి తట్టుకోలేక తల దించేసుకుంది—

రామచంద్ర అందించిన కాఫీ తనలో ఏదో జీవశక్తిని నింపినట్లనిపించింది వారిజకి—

వెనుకటి దిగులు కరిగిపోగా నవ్వుతూ త్రుళ్ళుతూ పాకను సమీపించింది—

'ఇంక ఇళ్లకు పోదాం—తాలూకా ఆఫీస్ పక్కనున్న పెంకుటిల్లు మాది — ముందు పూలమొక్కలుంటాయి — మీ కెప్పుడు రావాలనిపిస్తే అప్పుడు మా ఇంటికిరండి—'

నిస్సంకోచంగా నిండుగా నవ్వుతూ అన్నాడు రామచంద్ర—ఆ నవ్వులోని పావిత్ర్యానికి మనసులో శ్రద్ధాంజలి ఘటిస్తూ, నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసింది వారిజ—

* * *

ఫెళ్లు ఫెళ్లుమని వినిపిస్తోన్న దెబ్బల చప్పుడుకు ఆశ్చర్యపోతూ లోపల ప్రవేశించిన వారిజ వీరన్న చెంపలు పగలకొడుతున్న రామచంద్రను చూసి నిర్ఘాంతపోయింది — మెరుపులా వెళ్లి, అడ్డుగా నిల్చుంది—

'ఆగండి! ఏమిటిది? నిన్ననేకదా నా ప్రాణానికి ప్రాణమని చెప్పారు? ఇదేనా స్నేహమంటే? ఎందుకిలా కొడుతున్నారు?'

'చూడండి మరి, వాడేం వాగుతున్నాడో? మీరు...మీరు...ఛీ! నా నోటితో అనలేను...'—

అన్ని దెబ్బలు తిన్నా ఎదిరించని వీరన్న రోషంగా తలెత్తాడు—

'నేనే అంటాను—ముఖ మెదురుగానే అంటాను — ఈ వారిజ చెడిపోయింది—నిన్ను సర్వనాశనం చెయ్యటానికి నీ దగ్గర చేరింది—ఈవిడకి దూరంగా ఉండు రామచంద్రబాబూ! ఈవిడను వెంటనే పంపెయ్యి బయటికి — నన్ను చంపినాసరే! ఈవిడ వలలో నువ్వు పడటానికి ఒప్పుకోను...'

వారిజముఖం పాలిపోయింది—నిలబడలేక తూలింది—ఆ ముఖం చూసిన రామచంద్రలో ఆగ్రహం అవధులు దాటింది—చేతి కందుబాటులో ఉన్న గాజు గ్లాసును విసిరి వీరన్నమీదకు కొట్టాడు—అది వీరయ్య నుదుటికి కొట్టుకుని రక్తం చిమ్మింది—వారిజ కళ్లలోంచి రక్తం చిమ్మింది—

'ఛీ! ఛీ! ఏమిటిలా తయారవుతున్నారు మీరు? మీరు సహించలేని ఒక మాటన్నందుకు మిమ్మల్ని అభిమానించే వ్యక్తిని అంతగా హింసిస్తారా? వీరన్న అనటం కాదు—నే నంటున్నాను—అవును—నేను చెడిపోయినదాన్నే! ఏం? అలా తెల్లబోయి నిల్చున్నారేం? నా మీదకే విసరండి ఒక గ్లాసు—వీరన్న మీ సేవకుడు కనుక కొట్ట



# బిన్నీవారి

# వానిటీ

·SANFORIZED·

## ముద్దులొచ్చే 20 రకాలు మిమ్ములను ఆకర్షిస్తాయి!

అందాలు చిలికే 20 ఛాయలు మీరు ఎన్నుకోడానికి, ఇదేబట్ట కావాలని మీరు ఎంతో కాలంనుంచీ అనుకుంటున్నారు! ఇప్పుడు ధావిషేరు...వానిటీ-బిన్నీవారి సున్నితమైన పాప్లిన్ బట్ట.

**బిన్నీ – బట్టలకు పెట్టినది పేరు**




ఈ సైను బోర్డును ప్రదర్శించే బిన్నీ స్టాకిస్టుల వద్ద మీకు కావలసిన బిన్నీ బట్టలు కొనండి.

బెంగళూరు ఉల్లెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెనీ లిమిటెడ్, అగ్రహారం రోడ్డు, బెంగళూరు-23.
బిన్నీ & కో లిమిటెడ్, మద్రాసువారి అంగసంస్థ.

bm-4176

## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దానిరచయిత గాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచనేనని, దేనికీ అనుకరణ కాదనీ హామీ వ్రాసి పంపాలి. అటువంటి హామీలేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు
ఆంధ్రసచిత్ర వారపత్రిక

## చీకటి కడుపున ...

గలిగారు — నన్నూ కొట్టండి — సందేహం దేనికి?'

రామచంద్ర మూఢుడిలా వారిజ ముఖం కేసి చూసి అక్కడినుంచి పారిపోయాడు—

వారిజ లోపలికెళ్ళి ఒక గిన్నెతో నీళ్ళు తీసుకొచ్చి వీరన్న పక్కన కూర్చుని తన రుమాలు నీళ్లలో తడిపి అతని గాయాన్ని తుడవబోయింది—

'వద్దమ్మా!' అన్నాడు వీరన్న బాధగా—

'ఏం వీరన్నా! నన్నూవలతో వేసుకుంటానని భయపడుతున్నావా? ఫరవాలేదు వీరన్నా! యజమాని క్షేమం కోసం రక్తం చిందించగలిగిన నీలాటి ధీరుల్ని ఎంతటి వగలాడి మాత్రం ఏం చెయ్యగలదు? నీ రక్తం చూడలేకపోతున్నాను. తుడవనియ్యి—'

వీరన్న ఆశ్చర్యంగా వారిజ ముఖంలోకి చూశాడు — అతని కళ్లలోంచి బుటబుట నీళ్ళు రాలాయి—

ఏం మాట్లాడలేకపోయాడు—

వారిజ అతని కళ్లలో నీళ్ళు చేతో తుడిచి, తడి రుమాలుతో రక్తం తుడిచి; మరో తడిగుడ్డ గాయంమీద ఉంచింది—

'ఇంతకంటె ప్రస్తుతానికి నేనేం చెయ్యలేను వీరన్నా! వెళ్లి డాక్టర్ని పంపిస్తాను —డాక్టర్ వచ్చి ఏ అయొడినో రాసి కట్టు కడితే త్వరలోనే తగ్గిపోతుంది—'

'డాక్టర్ అక్కర్లేదమ్మా! అదే తగ్గిపోతుంది—' అని ఒక్క క్షణం ఆగి బరువుగా ఊపిరి వదిలి మళ్లీ అన్నాడు—

'మా బాబు సంగతి నీకు తెలీదమ్మా! ఆయన ప్రతిదీ చాలా తీవ్రంగా తీసుకుంటాడు — ఏ పని చేసినా మనసారా చేస్తాడు—ఆయన నిన్ను ప్రేమిస్తే తన కంఠంలో ప్రాణం ఉండగా నిన్ను మరవలేడు—అప్పుడు ఆయన బతుకేం కావాలి? నువ్వు......నన్ను క్షమించమ్మా!'

'నిన్ను క్షమించటానికి నేనెవర్ని వీరన్నా! నా కంటె ఎన్నో రెట్లు ఉన్నత శిఖరాల మీద ఉన్నావు—నువ్వు చెప్పింది అర్థమయింది — ఇంకమీదట మీ బాబుకి దూరంగా ఉంటాను. సరేనా!'

'అమ్మా! నీకు కష్టం కలిగిస్తున్నాను —నాకు తెలుసు...కాని...'

'నాకు కష్టమా! హు! నా కసలు కష్టమనేది లేదు వీరన్నా! అదీగాక మీ బాబు మనసారా నన్ను ప్రేమించి ఆ కారణంగా జీవితాంతం బాధ పడటం నేనే సహించలేను — సరే వెళ్ళి డాక్టర్ని తీసుకొస్తాను —'

వారిజ లేచేలోగానే డాక్టర్ని తీసుకుని రామచంద్ర వచ్చాడు —

డాక్టర్ వీరన్న నుదుటి భాగాన్ని మళ్ళీ కడిగి, మందురాసి కట్టుకట్టి వెళ్ళిపోయాడు—

'వీరన్నా!' దుఃఖంతో పూడుకుపోతున్న గొంతు చిల్చుకుంటూ అన్నాడు రామచంద్ర—

'నువ్వు నన్ను కొట్టు వీరన్నా!'

వీరన్న నవ్వుతూ రామచంద్రను సమీపించి మృదువుగా చెంపలు తట్టాడు—

'బాబూ! వాది పొరపాటే! వారిజమ్మ దేవత—'

తల వంచుకొని అనేసి వెళ్లిపోయాడు—

రామచంద్ర వారిజ వంక చూశాడు —

వారిజ నవ్వింది—

వారిజ నవ్వును ఇంతవరకు ఎన్నోసార్లు చూశాడు రామచంద్ర—కొన్నిసార్లు పులకరించాడు—కొన్నిసార్లు పరవశించాడు— కొన్నిసార్లు ముగ్ధుడయ్యాడు—కొన్నిసార్లు లజ్జపడ్డాడు — కొన్ని సార్లు ఉద్రిక్తుడయ్యాడు—

కాని, ఇలాంటి నవ్వును ఇంతవరకూ ఎన్నడూ చూడలేదు—

ఆ నవ్వు చూస్తూనే అతని హృదయం ద్రవించిపోయింది —అంత దీనంగా ఉందా నవ్వు—

'వద్దు! వారిజా అలా నవ్వకు—మామూలుగా నవ్వు—' కాతర స్వరంతో అన్నాడు—

వారిజ నవ్వలేదు— కానీ ఆవిడ ముఖం గంభీరంగా మారిపోయింది.

'నేను వెళ్తాను — మళ్లీ మీ ఇంటికి రాను—మీరు రావద్దు — నే నిక్కడనుంచి వెళ్లేటప్పుడు మాత్రం మీకు చెప్పి వెళ్తాను—'

చటుక్కున వారిజ రెండు చేతులూ పట్టుకున్నాడు రామచంద్ర—

'వద్దు వారిజా అలా అనకు — నువ్వు రావాలి—రోజూ రావాలి...'

మృదువుగా చేతులు విడిపించుకుంది వారిజ—

'ఎందుకు?'

'అమ్మో!'

'ఇలా స్పష్టంగా ఆలోచించుకోలేక పోయాడు—'

'ఆలోచించక్కర్లేదు—ఒక్కరోజు నిన్ను చూడకపోతే నాకు పిచ్చెక్కుతుంది—'

'ఎప్పటికో ఒకప్పటికి విడిపోవలసిన వాళ్ళమేగదా! అప్పుడేం చేస్తారు?'

'విడిపోవలసిన వాళ్ళమా?'

ఏదో కొత్త విషయాన్ని వింటోన్నట్లు అడిగాడు—

'విడిపోక? ఏం చేద్దామనుకుంటున్నారు?'

కొన్ని క్షణాలు వారిజ నల్లపూసల మీద నిలిచాయి రామచంద్ర చూపులు—భరించ లేని బాధతో క్రిందకు వాలాయి—

'ఏంచెయ్యను—కానీ, నువ్వు రా వారిజా! అలా వాగ్దానం చేస్తేకాని వెళ్ళనియ్యను—'

వారిజ దారికి అడ్డంగా నిలిచాడు రామచంద్ర—

'ఊహూ! రాను — రాదలచుకోలేదు — ఇట్లాంటి ఆశలు అంతకంతకు ఎక్కువవుతాయే కాని అణగిపోవు—అయినా మీ మనస్సు కాని దానిమీద మీ కింత వ్యామోహం దేనికి?'

'వ్యామోహమా? నాకా? నీ మీదా?'

'ఇదంతా ఏమిటి మరి? అడ్డు లేవండి...'

పాలిపోయిన ముఖంతో అదురుతోన్న పెదవులతో నిప్పులు రాలుతోన్న కళ్ళతో తన ఎదురుగా నించున్న రామచంద్రను తప్పించుకుని బయటకు నడిచింది వారిజ—

కన్నీళ్ళుకూడా రాని తన మండే కళ్ళను బరువుగా మూసుకుని, తన గుండెలు ఎందుకు బద్దలు కావా అని ఆశ్చర్యపోతూ పక్కమీద దొర్లింది వారిజ ఆ రాత్రంతా—

* * *

నాలుగురోజులు రామచంద్రను కలుసుకోకుండా నిగ్రహించుకున్న తరువాత తన కింక ఆ ఊళ్ళో ఉండవలసిన అవసరం లేదనిపించింది వారిజకి — తన సామాన్లు సర్దుకుని వెళ్ళేముందు, సెలవు తీసుకునేందుకు రామచంద్ర ఇంటికి బయలు దేరింది—సంధ్య పలచబడిపోతోంది—చిక్కని చీకటి మెత్తగా పరుచుకుంటోంది—

ఏదో అపరాధం చేయబోతున్న దానిలా వణికింది వారిజ — అయినా ఆమె వణుకుతున్న చేతివేళ్ళు రామచంద్ర గేటు తలుపు తెరిచేసాయి—లోపలికి అడుగుపెట్టింది—

అడుగుల చప్పుడు విన్న రామచంద్ర 'ఎవరు? వీరన్నా!' అన్నాడు—

ఆ కంఠస్వరం విన్న వారిజ ఉలికి పడింది—అతి నీరసంగా నూతిలోంచి వచ్చినట్లుగా ఉంది — గదిలో చీకటి—స్విచ్ వేసింది—లైట్ కాంతిలో వారిజను చూసిన రామచంద్ర ముఖం ఒక్కసారి వెలిగింది—

'వారిజా!' అన్నాడు రెండు చేతులూ జాపి—

ఆ చేతులలో వాలిపోయింది వారిజ—

రామచంద్ర చేతులు వారిజను బలంగా చుట్టేసాయి—కాల్చేస్తున్నాయి— వారిజ శరీరాన్ని—జ్వరంతో—వేడితో—

'వారిజా!...వారిజా!...వచ్చావు...నామీద కోపం లేదూ?' విరిగిపోతోంది అతని కంఠస్వరం—ఉద్రేకంతో—నీరసంతో—

'మీ మీద కోపమా? భలేవారు-మీ మీద ఎందుకుకోపం — ఈ నిర్భాగ్యురాలికి జీవితమాధుర్యాన్ని రుచి చూపించినందుకా?'

రామచంద్ర చేతులు సడలిపోయాయి — అతని గుండెలమీదనుంచి లేచి పక్కనున్న కుర్చీలో కూర్చుంది వారిజ—

మాసిపోయిన అతని గెడ్డాన్ని, పాలిపోయిన ఆతని చెక్కిళ్ళనూ, నీరసంగా ఉన్న కళ్ళనూ బాధగా చూస్తూ 'జ్వరంవచ్చిందా? మరి నాకెందుకు కబురు చెయ్యలేదూ?' అంది—

'ఎందుకు కబురు చెయ్యాలి? మీరు నా కెవరని?' తల్లిమీద అలిగిన పసిపిల్లాడిలా రోషంగా అన్నాడు— జ్వరంతో కాలిపోతున్న అతని చేతిని తన చేతిలోకి తీసుకుని నవ్వింది వారిజ—

'ఎవరినని రాగానే అలా ఆర్తిగా కౌగలించుకున్నారు?'

పాలిపోయింది రామచంద్ర ముఖం—

'మీరు వెళ్ళిపొండి ఇక్కణ్ణుంచి వెంటనే!'

'వెళ్ళను గాక వెళ్ళను — మీకు జ్వరం నెమ్మదయ్యాక కాని నే నిక్కణ్ణుంచి కదలను.'

దీర్ఘంగా నిట్టూర్చాడు రామచంద్ర —

'అలా కాదు వారిజా! నువ్వన్నమాట అబద్ధం కాదు—నీ మీద నాకు వ్యామోహం వుంది—చాలా చాలా వుంది— నా శక్తులన్నీ ఉపయోగించి కూడా ఈ వ్యామోహాన్ని జయించలేకపోతున్నాను — మన స్నేహాన్ని స్నేహంగా నిలపగలిగేశక్తి సన్నగిల్లిపోతోంది నాలో! ఇలాగేఉంటే ఏనాడో నిన్ను నాశనం చేసి నేను నాశనం అవుతాను — వెళ్ళిపో వారిజా!'

వారిజ అతని కళ్ళలోకి చూస్తూ నవ్వింది—

'నాకసలు భయంలేదు — వెళ్ళవలసిన అవసరమూలేదు — మీది వ్యామోహమే






అయితే మనస్నేహం ఇంత గాఢంగా అల్లుకునేదే కాదు—మీకున్నది వ్యామోహం కాదు—ప్రేమ! మీరు నన్ను ఏనాటికీ నాశనం చెయ్యలేరు—నేనెంత క్షుద్రురాలి



# చీకటి కడుపున...

నయినా మీ ప్రేమను అపురూపంగా గుండెల్లో దాచుకున్నాను—మిమ్మల్ని పతనం కాకుండా కాపాడుకోగలను—'

'నువ్వు క్షుద్రురాలివా? నేను నమ్మను—'

'నమ్మకండి—'

వారిజ నవ్వుతూ లేచి అతనితల తన తొడమీద పెట్టుకుని మెల్లిగా నిమురుతూ సాగింది—

రామచంద్ర ఆమెచేతిని గట్టిగా పట్టుకుని

'వీల్లేదు వారిజా! నువ్వలా! ఇంత అతిచనువు వద్దు—' అన్నాడు—

'ఏం?' అంది వారిజ లేవకుండానే అతని శిరసు నిమురుతూ—

రామచంద్ర చెయ్యి వారిజ చెయ్యిమీద బిగుసుకుంది—

'నాకిది అర్థం కావటంలేదు వారిజా! ఈ అనుబంధాన్ని సెక్స్‌తో ముడిపెట్ట లేను—ఎన్నటికీ అంత నీచానికి పాల్పడ లేను గనుక—సెక్స్‌తో సంబంధం లేదని అనలేను—నువ్వు స్త్రీని కాకపోతే నీకోసం ఇంత అలమటించేవాణ్ణికాదు గనుక—మనుష్యుం మనసులిలా ఆకర్షణల సుడి గుండాలలో ఎందుకు కొట్టుకు పోతుం టాయో నీకు తెలుసా?'

'ఏం చెప్పగలను? ఈ విశ్వమంతా ఆకర్షణమీద ఆధారపడేకదా పరిభ్రమి స్తోంది? ఈ ఆకర్షణలనుండి తప్పించుకో గలిగిన వాళ్లెవరు? మీరిప్పుడా విషయా లన్నీ ఆలోచించకండి—కళ్లు మూసుకు పడుకోండి—'

'వారిజా! నీవళ్లో తలపెట్టుకుని ఇలా నువ్వు తలరాస్తోంటే ఇంతకుమించి నాకేమీ అక్కర్లేదనిపిస్తోంది—నీ స్పర్శ నేను అనుభవించ గలిగినంతవరకూ ఎంతటి బాధయినా నాకు సౌఖ్యకరమే అవుతుంది—

వెళ్లిపో వారిజా! నువ్వు మరొకరి సొత్తువి—ఈ సౌఖ్యాన్ని పొందే అర్హత నాకులేదు—వెళ్లు—'

బలవంతాన తనతల ఆమె వళ్లోంచి తొలగించబోయాడు రామచంద్ర—

వారిజ అతనిని లేవనియ్యకుండా అదిమి 'ఉద్రేక పడకండి—మీరేం తప్పుచెయ్యటం లేదు—నే నెవరి సొత్తునూ కాను—ఒక్క మీకు తప్ప ఎవరికీ చెందను—నా సేవను పొందే అర్హత మీకుంటే ఎవరికీ ఎక్కువ లేదు—చూడండి—'

అంటూ సూత్రం గొలుసులా ఉన్న తన గొలుసును పైటలోంచి బయటికి తీసింది—దానికి ఏదో చిన్నలాకెట్ ఉంది—మాంగ ల్యాలు లేవు—

'నల్లపూసలూ అంతే! ఒకరు కట్టినవి కావు—నేను సరదాకి కట్టుకున్నవి—'

రామచంద్రకు వళ్లుతెలీలేదు—రెండు చేతులతో వారిజను దగ్గరగా లాక్కుని బలంగా గుండెల కదుముకుని, చెక్కిళ్ల మీద కన్నులమీద ముద్దుల వర్షం కురిపించాడు—ఆవిడ పెదవులమీద పెదవు లొత్తి ఆవిడ జీవశక్తిని తాను గ్రహిస్తూ తన జీవశక్తిని ఆమె కందించాడు—ఆర్తితో ఆవిడ శరీరాన్ని పెనవేసేసుకున్నాడు—

'అబ్బబ్బ! ఆగండి...అవతల జ్వరం...'

కష్టంమీద విడిపించుకుని నవ్వుతూ అంది వారిజ—

'ఉహు! జ్వరం కాదు—నాకు ఒక్క క్షణం దూరం కాకు వారిజా ఇంత! ఇన్నాళ్లూ నేను విరహంతో ఎలా కాలి పోయానో నీకేం తెలుసు? నువ్వు మరొ కరి సొత్తువన్న భావనతో ఎంత చిత్ర హింస ననుభవించానో ఎలా ఊహించగలవు? నన్నింత హింస ఎందుకు పెట్టావో చెప్పు?'

మళ్లీ వారిజ చెయ్యిపట్టుకుని మీదకు లాక్కుంటూ అన్నాడు—అతని గుండెల మీద వాలిపోయిన వారిజ చటుక్కున లేవలేకపోయింది—

'చెప్తాను—అంతా చెప్తాను—కాని విన్నాక నన్నిలా దగ్గరకి తీసుకుంటారో? లేదో?'

'నువ్వు మరొకరి సొత్తువు కాకపోయిన తరువాత ఎంతటి బలమైన కారణమూ నిన్ను నానుండి వేరు చెయ్యలేదు—చెప్పు—'

'అహా! ఇప్పుడుకాదు—మీకు నయ మయ్యాక...'

'అదేం కుదరదు—ఇప్పుడే చెప్పు—'

'ఇలా పెంకితనం చేస్తే నేను వెళ్లి పోతాను—నేను చెప్పినట్టు వినాలి మరి—'

'ఆ!—ఆ! వెళ్లిపోకు [illegible] నీ ఆజ్ఞ అతిక్రమించను—' అన్నాడు రామ చంద్ర.

రామచంద్రకు వచ్చింది మామూలు జ్వరమే! రెండురోజుల్లోనే తగ్గిపోయింది— ఆ రెండు రోజులూ వారిజ రామచంద్ర దగ్గరే ఉండిపోయింది—ఊరు ఊరంతా ఏ ఇద్దరు తారసపడ్డా ఆ విషయమే చెప్పుకున్నారు—

వీరన్న మనసులో ఏమనుకున్నాడో ఆ రెండు రోజులూ ఆ ఇంటి ఛాయలకు కూడ రాలేదు—కనీసం జ్వరం ఎలా ఉందని అయినా పలకరించలేదు—

అతనికి భోజనం వడ్డిస్తూ యథాలాపంగా గోడమీదకి చూసిన వారిజ అక్కడి ఫోటో చూసి 'ఆ ఫోటో ఎవరిది?' అని అడిగింది—

'మా అమ్మా, నాన్నగారూ—వాళ్ల చిన్నప్పటిది...'

'ఆయనను ఎక్కడో చూసినట్లనిపిస్తోంది...'

'ఎక్కడ చూసి ఉంటావు? ఎప్పుడైనా కాకినాడ వెళ్ళావా?'

'ఎప్పుడూ వెళ్లలేదు—'

'కొన్నాళ్ళు మా నాన్నగారు బెజవాడలో కూడా ఉన్నారు. కాని అప్పటికి నువ్వు పుట్టివుండవు—'

ఉలికిపడింది వారిజ—

'బెజవాడా?'

'అవును—అక్కడ మీవాళ్ళున్నారా?'

'అదే మా స్వస్థలం...'

కాని మా నాన్నగారు అక్కడినుంచి చాలాకాలం క్రిందటే కాకినాడ వచ్చేసారు—ప్లీడర్ సత్యనారాయణగారిదగ్గర గుమస్తాగా ఉండేరోజుల్లో బెజవాడలో ఉన్నారు—సత్యనారాయణగారు వ్యసనాలకు బానిసయి ఆస్తినీ ప్రాక్టీస్‌నీ కూడా నాశనం చేసుకున్నాక కాకినాడ వచ్చేసి ఏదో కంపెనీలో కర్కుగా చేరారు—నేనూ మా చెల్లెలూ ఇద్దరే సంతానం మా తలిదండ్రులకు—గుమస్తా అయినా కష్టపడి మమ్మల్నిద్దరినీ పైకి తీసుకొచ్చారు—చెల్లికి పెళ్లయింది—అత్తవారింట్లో ఉంది—'

వారిజ కర్ణమయిపోయింది—అతడు తన తండ్రి దగ్గర గుమస్తా—ఏందో ఫంక్షన్‌లో తీయించుకున్న గ్రూప్ ఫోటోలో తండ్రి పక్కన అతనున్నాడు—ఫోటోలో చూసింది అతణ్ని ఇదివరలో—

'ఏమిటాలోచిస్తున్నావు? నాకేదో చెప్తానన్నావు—చెప్పవా?'

'ఇప్పుడు కాదు—పూర్తిగా కోలుకున్నాక మా ఇంటికి భోజనానికి రండి—సావకాశంగా అన్నీ చెప్తాను—నేను వెళ్తాను—'

'అప్పుడేనా?'

'అప్పుడేనా! రెండు రోజులున్నాను—మీకు తగ్గిపోయిందిగా! నా అవసరం లేదు—అదీగాక...'

ఆగిపోయి నవ్వింది వారిజ—

'అదీగాక...?'

'మీరు జ్వరంతో ఉన్నప్పుడు నిశ్చింతగా ఉన్నాను. ఇప్పుడింక మీ వాలకం చూస్తోంటే భయం వేస్తోంది బాబూ!'

'భయం దేనికి? నువ్వు నాదానివేగా!'

దగ్గరగా లాక్కోబోయాడు—నవ్వుతూనే దూరంగా జరిగింది—

'కాస్త కళ్ళెయ్యండి గుర్రాన్ని—ఎల్లుండి రండి మా ఇంటికి—'

నవ్వుతూ వెళ్లిపోయింది వారిజ—

ఆ రాత్రి ఎంత ప్రయత్నించినా వారిజ కళ్ళు మూతపడలేదు—తనతండ్రి ప్లీడరు—ప్రాక్టీస్ ఉంది—ఆస్తి ఉంది—అయినా ఆయన సంతానంలో ఒక్కరూ కూడా సుఖపడటంలేదు — తన తండ్రిదగ్గర గుమస్తా శంకరంగారు—ఆయన పిల్లలిద్దరూ పైకి వచ్చారు—హాయిగా బతుకుతున్నారు—

ఎక్కడుంది లోపం? ఎవరి పొరపాటు ఈ దురదృష్టానికి కారణం? అతనికి తన సంగతి చెప్పాలి—

అవును—చెప్పి తీరాలి — ఎలా చెప్పాలి? చెప్పాక ఏమవుతుంది? భగవంతుడా!

పగిలిపోతోన్న వారిజ హృదయం తాను విన్నవీ, చూసినవీ, తెలుసుకున్నవీ విషయాలను కలబోసుకుంటూ గతంలో పర్యటించ సాగింది—

(ఇంకా ఉంది)

---

రాత్రి నాకో మాంచి కలొచ్చిందోయ్! — బియ్యం ఎక్కడ పడితే అక్కడ - ఎంత పడితే అంత ఇస్తున్నట్లు!





'తల్లిప్రేమ'లో రామారావు, సావిత్రి.

# సినిమా

### ఉగాది విడుదల

శ్రీ డి. వి. ఎస్. రాజు నిర్మించిన 'తిక్క శంకరయ్య' సాంఘిక చిత్రంయొక్క షూటింగు ఫిబ్రవరి 29 తో పూర్తయినట్లు, రీ–రికార్డింగ్ మార్చి 4 నుండి ప్రారంభమయినట్లు, చిత్రం ఉగాది శుభ దినాన విడుదల చేస్తున్నట్లు వారి ఆఫీసులో వెల్లడించారు. ఈ చిత్రం రిలీజు అయిన పదిరోజులకు మరొక చిత్రాన్ని ప్రారంభించదల్చినట్లు యిందులో కూడా పద్మశ్రీ రామారావు నాయకుడిగా నటించనున్నట్లు, 'తిక్కశంకరయ్య' చిత్రంలో నటించిన కృష్ణకుమారి, జయలలిత, సూర్యకాంతం, రేలంగి, పద్మనాభం, నాగభూషణం, అల్లు రామలింగయ్య, రాజ్ బాబు, రాజనాల, సాంకేతిక బృందం తనతో అన్నివిధాలా సహకరించి వేసుకున్న ప్లాన్ ప్రకారం చిత్రం విడుదలయ్యేందుకు దోహదకారులుగా వుండినందుకు తన కృతజ్ఞతలను వెల్లడించారు నిర్మాత.

### '21 న విడుదల చెయ్యాలనుకుంటున్నాము'

డి వి ఎస్. ఆఫీసునుండి సుభాషిణీ పిక్చర్స్‌కు వెళ్లాము ముఖద్వారం వద్ద నిల్చునివున్న అధినేత హేమాంబరధరరావు లోపలికి రమ్మన్నారు, ఏమిటండీ, ఎక్కడికయినా ప్రయాణమా ? అని ప్రశ్నిస్తూ వుండే సమయంలో శ్రీ ఛాయచిత్ర నిర్మాత శ్రీరామరాజు గబగబా వస్తూ, 'రండి పోదాం ఎడిటింగ్‌కు' అని రావును పిల్చారు 'అంటే షూటింగు అయినట్లేనా', అని నేను అందుకున్నాను. 'చాలవరకు అయినట్లే. కొంత తిరుపతిలో తియ్యాల్సి వుంది ఆ పని జరిగిపోతే రీ–రికార్డింగ్‌ను ప్రారంభించి మార్చి 21కు 'దేవకన్య'ను విడుదల చెయ్యాలనుకుంటున్నా' అన్నారు.

### 'టేస్ట్‌కి తగిన సబ్జక్టు'

'దేవకన్య' చిత్రాన్ని విడుదల చెయ్యగానే శ్రీ రామరాజు వెనువెంటనే ఒక చక్కటి యితివృత్తం గల కుటుంబ కథను నిర్మించడానికి నిశ్చయించారు. 'మంచి సాంఘిక చిత్రాలను నిర్మించాలనే వుద్దేశ్యం మొదటి నుంచి వుందండీ; కానీ నా టేస్టుకు తగ్గ సబ్జక్టు దొరకడం కాస్త ఆలస్యం అయినందువల్ల, వీటూరి వ్రాసిన 'దేవకన్య'ను నిర్మించాను', అన్నారు శ్రీ రాజు 'దేవకన్య'లో కాంచన, కాంతారావు, రాజనాల, ప్రభాకరరెడ్డి, బాలకృష్ణ, అల్లు రామలింగయ్య, పద్మశ్రీ నాగయ్య, రమాప్రభ ముఖ్య పాత్రల్ని పోషించారు శ్రీ టి వి రాజు చెవులకింపయ్యే సంగీతాన్ని విన్పించారు.

### సెట్టుకి నిండుదనం

జనరంజనీ పిక్చర్స్ యొక్క షూటింగు ఫిబ్రవరి 23నుండి 28వరకు వాహిని స్టు

ఫ్లోర్‌లో 'గుమ్మడి యింటి సెట్టు'లో పని జరిగింది. ఈ చిత్రం యొక్క ప్రారంభోత్సవానికి శ్రీ పి ఎ పి. సుబ్బారావు, డి రామానాయుడు, వందనం సాంబశివరావు, పి బి శ్రీనివాస్ అనంతలక్ష్మి నిర్మాతలు, దాశరధి, శ్రీశ్రీ, రేలంగి, రాజ్‌బాబు, మాగాపు రామన్ హాజరై తమ శుభాకాంక్షలను నిర్మాత లయిన శ్రీ చలపతిరావు, సుబ్బయ్య చౌదరిలకు అందచేసారు శ్రీ ఎ వి సుబ్బారావు స్విచ్ ఆన్ చెయ్యగా శ్రీ గుమ్మడి, అంజలీదేవి షాట్ లో పాల్గొన్నారు ఎ వి ఎం షూటింగులో వుండిన శ్రీమతి జమునారమణారావు రావడంతో, సెట్టుకు విందుదనం వచ్చింది. ఈ చిత్రంలో



'పన్నీరు-కన్నీరు'లో కృష్ణకుమారి

కథానాయికగా జమున, నాయకుడిగా హరనాథ్ నటిస్తున్నారు. శ్రీ ప్రభాకరరెడ్డి, రాజ్‌బాబులు రెండు ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు. 'బ్రహ్మచారి' చిత్ర దర్శకుడు శ్రీ టి. రామారావు దర్శకత్వం వహిస్తున్న ఈ సాంఘిక చిత్రంలో శ్రీ ఎం.కె రాజా కెమెరాను, చలపతిరావు మ్యూజిక్‌ను నిర్వహిస్తున్నారు.

**'నాటకరంగస్థలనిర్మాణం అవసరం'**

జనరంజని షూటింగులో పాల్గొన్న శ్రీ గుమ్మడిని కల్సుకోగా, ఈ మధ్య ఆయన ప్రజా నాట్యమండలి సదస్సులో వెల్లడించిన అభిప్రాయాలను గూర్చి ప్రస్తావిస్తూ, ఆంధ్రప్రదేశ్‌లో నాటక రంగాన్ని పునరుద్ధరించడానికి నాటకాలను ప్రదర్శించడానికి కావలసిన థియేటర్ల నిర్మాణ ఆవశ్యకతను మన కళాకారులు గుర్తించి, దానికి యథోచితంగా పాటుపడడానికి పూనుకోవాలని చెప్పినట్లు నాతో వివరించారు. మద్రాసులోవలె మన రాజధానిలో నయితేనేమి, మన ముఖ్య నగరాల్లో నయితేనేమి నాటక రంగస్థల నిర్మాణం చాల అవసరమని తాము వ్యక్తిగతంగా భావిస్తున్నట్లు వృద్ధాటినా ప్రజానాట్య మండలిని సాంస్కృతిక రంగానికే పరిమితం చెయ్యడం వుచితమని సలహా యిచ్చినట్లు చెప్పారు.

# అమానుష హత్య

మాంబళంలోవున్న తమిళ హాస్యనటుడు శ్రీ నగేష్ ఇంటిలో సెల్వరాజ అనే అతని శవం దొరికింది ఇంట్లో ఫ్యాను కొక్కానికి వురి పోసుకుని చనిపోయినట్లువుంది. సెల్వరాజ నగేష్ బావమరదట. ఈ శవాన్ని పోలీసు శాఖ 12 వ తేదీన స్వాధీనపరచుకుని, "ఆత్మహత్య"గా నిర్ణయించారు. అనక 'ఆత్మహత్య'కు గల కారణాలు ఏవిట అని ఆలోచించేసరికి, ఏవీలేక, ఒక వేళ ఇది హత్య కాకూడదా అనే అనుమానం వచ్చింది. శవపరీక్ష చేసిన డాక్టరు "అవును. ఇది ఆత్మహత్యకాదు. వురి పోసుకున్నందువల్ల ప్రాణం పోలేదు. దెబ్బల మూలంగా చనిపోయాడు" అని తేల్చారు. దాంతో నగేష్ ఇంట్లో పని చేసే వాళ్ళని అరెస్టు చేసేసరికి కొన్ని విషయాలు వాటంతటవే బయట పడ్డాయి.

శ్రీ నగేష్‌కి మద్రాసులో చాలా యిళ్ళున్నాయి. అడయారు క్లబ్ ప్రాంతంలోవున్న ఒక ఇంట్లో సెల్వరాజుని అతని యిద్దరు సోదరులూ, కొంతమంది పనివాళ్ళూ కలిసి కర్రలతో, ఇనుపకడ్డీలతో చితకొట్టారట అనక అతన్ని స్టేషన్‌కారులో పడేసి, నుంగంబాకంలోవున్న మరో యింటికి తీసుకువెళ్ళి అక్కడ మరోసారి తన్నేసరికి సెల్వరాజు చనిపోయాడట. దాంతో అతని శవాన్ని కారులోపడేసి, మాంబళంలోవున్న ఇంకో యింటికి తీసుకెళ్ళి "ఆత్మహత్య"గా నిరూపిస్తూ అతని శవాన్ని తాడుకుకట్టి ఫ్యాను కొక్కానికి వ్రేలాడదీసి చక్కాపోయారట. పోలీసులు ఆ మూడు ఇళ్ళలోనూ, కారులోనూ అక్కడక్కడ రక్తం మరకలు చూచారు ఆ రక్తం తుడిచిన కొన్నిగుడ్డలు కూడా దొరికాయి.

12వ తేదీకి ముందురోజు (11వ తేదీ, సెల్వరాజ బాగా తాగివచ్చి తన తండ్రి (మురి ముత్తుపిళ్లె)ని డబ్బు కావాలని అడిగాడని, ఆయన లేదు పొమ్మనేసరికి కోపంతో ఆయన్ని చితకతన్నాడని వార్తలు కొన్ని వచ్చాయి.

ఈ సందర్భంలో పోలీసులు నగేష్‌తో కలిసి నటించే మనోరమ అనే నటి యింటికి వెళ్లి అనుమాన నివృత్తికోసం ఆమెనూ కొన్ని ప్రశ్న లడిగారట. హతుడు సెల్వరాజ రక్తసిక్తమైన చొక్కా ఒకటి నగేష్ ఇంట్లో దొరికిందట. నుంగంబాకం హైరోడ్డు మీదున్న యింట్లో మారణాయుధంగా ఉపయోగించబడి వుండాలి అనుకున్న ఇనుప కడ్డీ ఒకటి దొరికిందట.

రాజన్, ఆల్బర్ట్ అనే అతని సోదరులు, తోటమాలి కుమారస్వామి, మరో ముగ్గురు పని మనుష్యులు—వెరసి ఆరుగుర్ని 19 తేదీనాటికి అరెస్టు చేశారు. దాంతో మొత్తం ఎనమండుగుర్ని అరెస్టుచేసి, నగేష్‌కివున్న అన్ని యిళ్ళనూ సోదాచేసి, సెల్వరాజ తండ్రిని, నగేష్ సెక్రటరీని కూడా అరెస్టు చేశారట.

నగేష్ భార్యపేరు రజని. ఈమె రక్తపు పోటువల్ల లేడి వెల్లింగ్టన్ ఆసుపత్రిలో చికిత్స పొందుతోందట. పోలీసులు ఆమెనూ అనుమానించి, గవర్నమెంటు ఆసుపత్రికి ఆమెను మార్చి, సాయుధ పోలీసులను కాపలా పెట్టారు.

సెల్వరాజ అసలు తాగుబోతని, తాగివచ్చి డబ్బు అడుగుతాడని, ఎంతిచ్చినా చాలదంటాడని, ఇవ్వకపోతే తండ్రినీ, సోదరులనీ, చెల్లెళ్లనీ కూడా తంతాడనీ— ఇది పడలేక వాళ్ళు విసుగెత్తి వుంటారనీ కొందరంటున్నారు సెల్వరాజ పోయిన ఏడు ఒకామెను ప్రేమించి పెళ్లిచేసుకున్నాడు అతనికి 8 నెలల పిల్లకూడా వుంది

ఇంకా ఈ కేసు ఓ దరికి రాలేదు ఇప్పుడే డొంకంతా కదలబారుతోంది యం జి రామచంద్రన్— యం ఆర్ రాధ కేసు తరువాత తమిళనాడులో సినిమా ప్రపంచానికి సంబంధించిన మరో పెద్ద కేసయ్యిం దిది— ఇదీ గాథ.

— ఫాలాక్షుడు



'మంచికుటుంబం'లో కాంచన, గుమ్మడి

## శుభలేఖపై సాయిబాబా!

సినిమా

శ్రీమతి అంజలీదేవి సత్యసాయిబాబా ఆశీర్వాదాన్ని పొంది రావడం ఆమెకు అల భక్తురాలు నెలకు ఒకసారి అయినా వారి వాటు

శ్రీమతి అంజలీదేవి, ఆదినారాయణ రావుల కుమార్తె సౌభాగ్యవతి సుహాస వహినికి, చిరంజీవి కృష్ణ కుమార్ (ఎం.బి.,బి.ఎస్.)కు వారి స్వగృహంలో యిటీవల వివాహం జరిగింది 'శుభలేఖపై ఎవరి చిత్రపటం వుందో తెలుసా!—సాక్షాత్తూ సత్యసాయిబాబాదే!

## 'తెలుగువారి ప్రతిభ...'

7వ ఫ్లోర్ నుండి బయటికి రావడమే తరువాయి కల్పన చిత్ర నిర్మాత శ్రీ బాబురావు తమ సెట్లులోకి రమ్మని పిలిచారు. 5వ ఫ్లోర్‌లో శ్రీ హరనాథ్, విజయనిర్మల, జయంతికి సంబంధించిన డైలాగు సీనును శ్రీ సంజీవరావు డైరెక్టు చేసారు. 'అత్తగారు—కొత్తకోడలు' షూటింగు (ఇన్‌డోర్) పూర్తయింది 'ఈ చిత్రంలో చాలా విశేషాలున్నాయి; మీకు తెలుసా', అన్నారు నిర్మాత 'అబ్బే, ఏమిటి?' అన్నా 'ఏరేం లేదండీ — మన తెలుగు వాళ్ళ ప్రతిభను తెలుగు ప్రేక్షకులకు చూపిస్తున్నాం' అన్నారు ఒదేమిటో మీకూ చెప్తా, ప్రముఖ ఛాయాగ్రాహకుడు శ్రీ కె ఎస్ ప్రసాద్‌ను మన తెలుగు పరిశ్రమ దాదాపు మరచిపోయినట్లే ఆయన యీ చిత్రానికి కెమెరామెన్ అలాగే తెలుగు వాడయిన జి కె వెంకటేష్ సంగీత దర్శకుడు, ఒదేవిధంగా ఎ ఎం రాజా చాలా కాలం తర్వాత యిందులో పాడాడు.

## 'మొదట్లో పౌరాణికమా లేక జానపదమా...?'

వాహిని ఎడిటింగ్‌రూంలో రామానాయుడు కన్పడ్డారు 'పాపకోసం'చిత్రాన్ని మార్చి 15న రిలీజ చేస్తున్నానంటూ, తమవద్ద సుమారు అరడజను జానపద కథలున్నాయని, మొదట్లో పౌరాణికమా లేక జానపదమా అనే సమస్యలో పడ్డట్లు, యేదయినాసరే ఏప్రిల్ రెండవవారానికి మరొక చిత్రాన్ని ప్రారంభించడం ఖాయమని వెల్లడించారు 'పాపకోసం' జనానికి నచ్చి బాగా ప్రదర్శింపబడితే, ఒదే సబ్జెక్టును తమిళంలో కూడ తీస్తామని అన్నారు. 'పాపకోసం'లోని ఆర్టిస్టులు, టెక్నిషియన్లు తమతో చాలా సహకరించి, పెద్దపెద్ద షెడ్యూలు వేసుకున్నా విసుగులేకుండా పనిచేసినందుకు, వారికి తన ప్రత్యేక అభినందనల్ని తెల్పారు.

## సినిమా డైరీ

● రేఖా అండ్ మురళీ ఆర్ట్స్ నిర్మిస్తున్న 'శ్రీరామకథ' పౌరాణిక చిత్రం యొక్క మొదటి పాట రికార్డింగ్ విజయా గార్డెన్స్‌లో శ్రీ కోదండపాణి సంగీత దర్శకత్వంతో మార్చి 1న జరిగింది శ్రీ పద్మనాభం యీ చిత్రానికి దర్శకులు

● రాజా పిక్చర్స్‌కు సంబంధించిన స్వప్నదృశ్యపు పాటను కుమారి ఎల్ ఆర్ ఈశ్వరి సత్యం సంగీత దర్శకత్వంలో పాడగా మార్చి 1న విక్రం స్టూడియోలో రికార్డు చేశారు

● శ్రీ ఆత్రేయ వ్రాసిన "అందం ఉరికింది వయసులో, పందెం వేసింది మనసులో" అనెడి పాటను బాలా ప్రొడక్షన్స్‌కు గాను శ్రీమతి సుశీల, ఘంటసాల భరణీ రికార్డింగ్ థియేటర్లో పాడారు ఈ చిత్రానికి పూర్ణచంద్రరావు సంగీత దర్శకులు

● శ్రీ ఎస్ డి లాల్ నిర్మించే చిత్రంలో పద్మశ్రీ రామారావు, రాజనాల, రాజబాబు జ్యోతిలక్ష్మి నటిస్తున్నారు.

● ఫిబ్రవరి 11న కుమారి కృష్ణకుమారి, ఎస్ వి రంగరావు, దాశరథిగార్లకు కావలి మిత్రమండలిలో ఘన సన్మానం జరిగింది

● సుజాత ఫిలింస్ నిర్మిస్తున్న తెలుగుచిత్రంలో శ్రీమతి జూనియర్ శ్రీరంజని, చంద్రమోహన్‌కు అక్కగా నటిస్తున్నది

● శ్రీప్రొడక్షన్స్ నిర్మిస్తున్న తెలుగు చిత్రంయొక్క షూటింగు మార్చి 6 నుండి 'ఏర్ కాడ్'లో ప్రారంభమవుతుంది ఈ షెడ్యూలులో కృష్ణ, కాంచనలు పాల్గొంటారు

● ఎస్ వి ఆర్ పిక్చర్స్‌లో చంద్రమోహన్ ప్రేయసిగా కుమారి రుక్మిణి నటిస్తున్నది. ఈ చిత్రానికి దర్శకులు శ్రీ ఎస్ వి రంగరావు

● విశ్వశాంతి పిక్చర్స్ నిర్మించే 'వైజాగ్—టు—హైదరాబాద్' చిత్రం యొక్క షూటింగు మార్చి మూడవవారంలో ప్రారంభమవుతుంది

● నితిన్‌బోస్ నిర్మించే హిందిచిత్రంలో ధర్మేంద్ర, ముంతాజ్ ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు

● రవి ప్రొడక్షన్స్ నిర్మించనున్న రెండవ చిత్రంయొక్క షూటింగు గోదావరి ఒడ్డున మార్చి నెలలో ప్రారంభమవుతుంది.

● శ్రీ షమ్మీకపూర్, బబితా మొట్టమొదటిసారిగా కలిసి నటిస్తున్న చిత్రం 'తుమ్‌సే అచ్ఛా కౌన్ హై' ఈ చిత్రాన్ని ప్రమోద్‌చక్రవర్తి నిర్మిస్తున్నారు.

### 'అత్యుత్తమంగా ఉండేందుకు సర్వవిధాల ప్రయత్నం'

వాహినీనుండి వీనస్ స్టుడియోకి వెళ్లాను. అక్కడ శ్రీ ఎస్. వి. రంగారావు నటుడిగా, దర్శకుడిగా తన 'బాంధవ్యాలు' చిత్రానికి పనిచెయ్యడం చూచి ఆశ్చర్యపోయాను. ఆయన చాలా అలసినట్లుగా కన్పడ్డారు. 'ఏమిటండీ చాల నీరసంగా వున్నారే' అని అడిగాను. 'ఏమిలేదండీ, నా పిక్చర్‌ను అత్యుత్తమంగా తీసేందుకు సర్వవిధాల ప్రయత్నిస్తున్నా' అన్నారు.

* * *

కష్టించి, సంపాదించిన కర్షకుడు శ్రీ రంగారావు. ఆయన తమ్ముడు ధూళిపాళ. ఒట్టి అమాయకుడు + ఆవేశపరుడు. ఆయనకు లక్ష్మిలాంటి భార్య వుంటూ, సంసారాన్ని చక్క దిద్దుకుంటూ వస్తుంది. ఆమెయే సావిత్రిగణేష్. ఈమెకు తన పెనిమిటి అన్నగారయిన రంగారావంటే యెనలేని గౌరవం, విశ్వాసం అంతేకాదు అతడు యీమెకు దైవ సమానుడు అందుకే ఆయన ఏ కాస్త బాధపడ్డట్టు కన్పించినా, యీమె నొచ్చుకుంటూ వుంటుంది దీనికంతా కారణం యేమిటో తెలుసా! శ్రీ రంగారావుది అమృత హృదయం; తన సంసారానికి పంచప్రాణం; తనకు కులదైవం. కానీ భగవంతుడు సావిత్రికి ముగ్గురు మొద్దబ్బాయిలను ప్రసాదిస్తాడు వాళ్లు డబ్బును వృధాచేస్తూ, పెదనాన్నను సూటిపోటు మాటలు అంటూ వుంటారు వారి బాధకు తట్టుకోలేక ఒకరోజు రంగారావు ప్రక్కవీధిలో గల ఆచారి యింట్లో పోయి దాక్కుంటాడు ఆయన కన్పడక పోయేసరికి సావిత్రి పరిగెత్తుకొంటూ వెళ్లి ఆయన్ను ఇంటికి తీసుకొస్తుంది ఈ సన్నివేశాన్ని శ్రీ రంగారావు, నందనరావు సహాయంతో చాల సహజంగా చిత్రీకరించారు కెమరాను శ్రీ సింగ్, శేఖర్‌లు నిర్వహించారు

### 'ఈ సంవత్సరం మంచి పాత్రలు'

'బాంధవ్యాలు' చిత్రంలో శ్రీ రంగారావు తమ్ముడిగా నటిస్తున్న ధూళిపాళకు యీ పాత్ర రావడం ఒక ప్రక్క అదృష్టమనే చెప్పొచ్చు మరియొకప్రక్క తన నటనావైదుష్యాన్ని చూపించడానికి చక్కటి అవకాశం అని అనొచ్చు 'ఈ సంవత్సరం నాకు మంచి పాత్రలొస్తున్నాయండీ (పొంఫీకాలు)' అని చెప్పినప్పుడు వారిముఖంలో అపరిమితమయిన ఆనందం, వుత్సాహం వెల్లివిరిసింది. ఇప్పుడు ఎన్. వి ఆర్, ఎస్. వి ఎస్, బాబూ మూవీస్, నవభారత్ ఫిలింస్‌లో విభిన్నమయిన పాత్రలను ధరిస్తున్నట్లు చెప్పారు.

## ఏమి తెలుసా?

ప్రముఖ హాస్యనటుడు రాజ్‌బాబు ఆకుపచ్చరంగు ఫియట్ కారు కొన్నాడు.

తెలుగునటి మీనాకుమారి చాక్లెట్ రంగు ఫియట్‌కారు కొనింది

నటి రాజశ్రీకి మేలుజాతి కుక్కపిల్లలంటే చాల యిష్టం.

నటి వాణిశ్రీకి లక్కీ నెంబరు ఎనిమిది.

సత్యనారాయణకు పొలాలు కొనడం ఒక సరదా.

హీరో కృష్ణ యిటీవల 150 గేదెలను కొన్నాడు.

రాంమోహన్‌కు సరదాగ జరదాకిల్లీ నములడం అలవాటు.

పి. బి. శ్రీనివాస్ ఉదయం భోజనం ముగించకుండా యేపని చెయ్యడు.

### వైవిధ్యంగల పాత్ర

క్యారెక్టరు యాక్టరు ప్రభాకరరెడ్డిని గిండీ ఫారెస్టులో పోలీసులు తరుముతున్నారని తెలిసి, ఆశ్చర్యపోయాను. నిన్నగాక మొన్న వీరాజా మేకప్ రూంలో చూచాను. మరి యింతలో ఈ వైపరీత్యం యేమిటని ఆందోళనపడ్డాను. తీరా విచారిస్తే బాలా ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న చిత్రంలో యిది ఒక సన్నివేశం అని తెలిసింది. ఈ చిత్రంలో ప్రభాకరరెడ్డికి యివ్వబడిన వేషం చాల ముఖ్యమయినది. దొంగలు పేరులో కన్పించే రెడ్డి గెటప్, మేకప్ మిగతా పిక్చర్లన్నిటికన్నా వ్యత్యాసంగా వుండడమేగాక, ఈ పాత్రద్వారా తాను ఒక గుణచిత్ర నటుడు అని నిరూపించుకునే అవకాశం యేర్పడింది. ఈ చిత్రాన్ని శ్రీ రామినీడు డైరెక్టు చేస్తున్నారు. శ్రీ విక్రమసింహ, శ్రీ వి. సత్యనారాయణ నిర్మిస్తున్న యీ చిత్రంలో హరనాథ్, జమున, గుమ్మడి, బాలయ్య, టి. జి కమలాదేవి, రాజ్‌బాబు, రమాప్రభ ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు. శ్రీ స్వామి కెమరాను కదిపిస్తున్నారు. శ్రీ పూర్ణచంద్రరావు సంగీతాన్ని విన్పిస్తున్నారు.

### దేశనాయకుల మూర్తులలో పిల్లలు

చక్రవర్తి సంస్థ నిర్మించిన 'సుడిగుండాలు' చిత్రంలో 'స్వాతంత్ర్య నృత్య నాటిక' అత్యద్భుతంగా వున్నట్లు రష్షెస్ చూసినవాళ్లు చెప్పారు ఈ నాటికలో మన దేశీయ నాయకులయిన మహాత్మాగాంధీ



'తిక్కశంకరయ్య'లో కృష్ణకుమారి, రామారావు.

సుభాష్ చంద్రబోసు, జవహర్‌లాల్ నెహ్రూ, ప్రకాశం, రామకృష్ణ పరమహంస అందరూ కన్పిస్తారు. ఈ పాత్ర లన్నింటినీ పసిపిల్లలు ధరించారు. ఈ కుర్రాళ్లకు రూపశిల్పి కుమార్ తన హస్తకళా నైపుణ్యంతో ఆ నాయకుల మూర్తులను వీళ్లకు అచ్చు గుద్దినట్లు రంగరించి, అందరిచే సెభాష్ అనిపించు కున్నారు.

**కన్నడం పూర్తి చేసిన తర్వాత తెలుగు**

'మంచి మనిషి' చిత్ర నిర్మాతల్లో ఒకరయిన శ్రీ సుబ్బరాజు మార్చి 10 నుండి ఒక కన్నడ చిత్ర నిర్మాణాన్ని ప్రారంభించడానికి నిర్ణయించారు. మొదట్లో నాగేశ్వరరావుతో ఒక తెలుగు చిత్రాన్ని నిర్మించాలనుకున్నారు. ఆ తర్వాత శ్రీ ఎస్. కె. ఎ. అచారి దర్శకత్వంతో రవిచంద్రన్, జయలలితలను పెట్టి తమిళం తీయాలనుకున్నారు. కానీ, ఇప్పుడు కన్నడం మొదట్లో పూర్తిచేసి, ఆ తర్వాత తెలుగు తీయాలనుకుంటున్నట్లు చెపుతూ, తన పిక్చర్‌ను రాజా ప్రొడక్షన్స్ బ్యానర్‌లో నిర్మిస్తున్నట్లు చెప్పారు.

**'కోటివిద్యలూ...'**

ఎం ఎస్ ఆర్. ప్రొడక్షన్స్ అనే నూతన చిత్రనిర్మాణసంస్థ 'కోటివిద్యలు కూటికొఱకే', సబ్జెక్టును శ్రీ సముద్రాల చేత వ్రాయించి, ఏప్రిల్‌నుండి సెట్సుకు వెళ్ళే ప్రయత్నంలో వున్నట్లు నిర్మాత రావ్ తెలియచేశారు. ఈ చిత్రాన్ని బి సూర్యం డైరెక్టు చేస్తారు. హరనాథ్ నాయకుడిగా వుండగలడు.

* * *

శ్రీ ఎస్. భావనారాయణ మంచి చిత్రాన్ని నిర్మించారు. కానీ ప్రజల ఆదరణ దొరకలేదు 'పాలమనసులు'లాంటి నీట్ చిత్రం తియ్యడం శుద్ధ నిష్ప్రయోజనం అని తేలిపోయింది. అందుకే మరలా విక్రమాదిత్యుని కథను నిర్మించే ప్రయత్నంలో వున్నాను' అన్నారు యిటీవల వారిని కలిసినప్పుడు.



'వీరపూజ'లో చంద్రిక.

**వినూత్నమైన పాత్ర**
**విశిష్టమైన నటన**

రవీంద్రా ఆర్టుపిక్చర్స్ నిర్మిస్తున్న చిత్రానికి 'బంగారు గాజులు' అని నామకరణం చేసారు ఈ చిత్రం ఎనిమిదిరీళ్ళు పూర్తయింది. శ్రీ సి. ఎస్. రావ్ దర్శకత్వంలో పద్మశ్రీ నాగేశ్వరరావు ఒక వినూత్నమయిన పాత్రలో విశిష్టమయిన నటనను ప్రదర్శిస్తున్నట్లు శ్రీ కృష్ణమూర్తి చెప్పారు అన్నా, చెల్లెల్ల అనురాగం యెంత వున్నతమైనదో తెల్పే యీ చిత్రంలో చెల్లెలుగా విజయనిర్మల వున్నతంగా నటిస్తున్నట్లు చెప్పారు.



'పాలమనసులు'లో జమున, హరనాథ్.



'నిలువుదోపిడి'లో జయలలిత.

**మార్చిలో చిత్రాలు**

మార్చి 1న 'సతీ అరుంధతి', మార్చి 8న 'తల్లిప్రేమ', 15న 'మంచి కుటుంబం', 'పాపకోసం', 29న 'తిక్క శంకరయ్య', 'వీరాంజనేయ' చిత్రాలు విడుదలవుతున్నాయి

**'మరొక ప్రయోజనాత్మక చిత్రం'**

'ఆడపడుచు' లాంటి ఉత్తమ సాంఘిక చిత్రాన్ని నిర్మించిన శ్రీ హేమాంబధర రావు మే నెలలో మరియొక చక్కటి కుటుంబ యితివృత్తాన్ని తనకు సహాయ కుడిగా వుంటూ వుండే శ్రీ గోపాలక్రిష్ణ నిర్మించే దానికి దర్శకుడిగా వుండగలరు. ఈ చిత్రంలో పద్మశ్రీ రామారావు నాయకుడు. ఈ చిత్రం పూర్తికాగానే, సుభాషిణి ఆర్ట్స్ బ్యానర్‌లో మరి యొక ఉత్తమ ప్రయోజనాత్మక చిత్రాన్ని నిర్మించనున్నట్లు, అందులో కూడ పద్మశ్రీ రామారావు నాయకుడిగా నటించేందుకు అంగీకరించినట్లు వెల్లడించారు.

**'పాతాళభైరవిని మరపించేచిత్రం!'**

జయంతి పిక్చర్స్ నిర్మిస్తున్న జానపదంయొక్క షూటింగు పూర్తయినట్లు. శ్రీ కె వి రెడ్డి నిర్దేశకత్వంలో పద్మశ్రీ రామారావు, సరోజాదేవి, రాజనాల, సురభి బాలసరస్వతి, రమణారెడ్డి ముఖ్య భూమిక లను ధరించారు. జానపద చిత్రాలను విజయవంతంగా నిర్మించగల శ్రీ కె. వి రెడ్డి యీ చిత్రాన్ని 'పాతాళభైరవి' విజయాన్ని మరిపించే రీతిగా తయారుచేసి నట్లు, ఈ చిత్రం తప్పక బాక్సాఫీస్ హిట్ కాగలదని పరిశ్రమలోని పెద్దలు యెదురుచూస్తు వున్నారు ఈ చిత్రంలో శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు పసందయిన బాణీలను విన్పించారు. 'కృష్ణార్జున యుద్ధం'లాగే యీ చిత్రంకూడ నిర్మాత శ్రీ. పి. ఎన్. రెడ్డికి ఘనవిజయాన్ని చేకూర్చగలదని ఆశించవచ్చు.

**మూడు షెడ్యూలూ**
**మూడు పాటలూ**

పద్మశ్రీ పిక్చర్స్ 'వింత కాపురం'లో భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలు ప్రేక్షకుల్ని కడుపుబ్బ నవ్వించక మానవు. ఇప్పటికి మూడు షెడ్యూల్సు పూర్తి యింది, మూడుపాటల చిత్రీకరణ జరిగింది. సది రీళ్ల చిత్రం తయారైంది. కృష్ణ, కాంచన, పద్మనాభం, రమాప్రభ, ప్రభాకరరెడ్డి, విజయలలితకు సంబంధించిన సన్నివేశాలను ఫిబ్రవరి 26నుండి మార్చి 1 వరకు సారథి స్టుడియోలో శ్రీ అబ్బి దర్శకత్వంలో చిత్రింపబడింది. శ్రీ వి. వెంకటేశ్వర్లు నిర్మిస్తున్న యీ చిత్రంలో మాష్టర్ వేణు చక్కటి పాటలను విన్పిస్తారు. —శ్రీనివాస్



'ప్రేమకథ'లో కె. ఆర్. విజయ.

# పుస్తకాలు

## కనుపించని కాంతి

**కనుపించని కాంతి:** రచన శ్రీ కె. ఎన్. రెడ్డి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2, వెల 1.00.

ఈ పుస్తకంలో 'కాంతి'కి సంబంధించిన సమాచారం గురించి అందరికీ అర్థం అయ్యేలాగ రాయాలని రచయిత ప్రయత్నించినట్లు తోస్తుంది. ప్రయత్నం సఫలమయినదీ లేనిదీ పాఠకులే నిర్ణయించుకోవాలి. 'కాంతి అనేది ఒక రూపంలో వున్న ఎలక్ట్రో మాగ్నెటిక్ రేడియేషన్. మొదటి మాటను విడదీసి చూడండి. విద్యుత్తు, అయస్కాంతము ఉన్నాయి కదూ? దీనినిబట్టి కాంతికి విద్యుత్తు అయస్కాంత లక్షణాలున్నట్టు స్పష్టమవుతున్నది'...... 'ఫలానా నక్షత్రం ఐదుకాంతి సంవత్సరాల దూరంలో ఉన్నది అంటారు. దీని అర్థమేమిటి? ఆ నక్షత్రం నుండి బయలుదేరిన కాంతి కిరణాలు భూమిని చేరుటకు ఐదు సంవత్సరాలు పడుతుందని భావం'...... 'రేడియో తరంగాలలో బహు చిన్నవానిని మైక్రోవేవ్స్ లేక మైక్రో తరంగాలు అంటారు'........ ఇవి గ్రంథశైలికి ఉదాహరణలు.

—కె.

## పైలాపచ్చీసు

**గేయాలు.** శ్రీ ఆరుద్ర రచన. 56 పుటలు. వెల రెండు రూపాయలు. యం. శేషచలం అండ్ కంపెనీ ప్రచురణ.

'ఎర్రజెండా తోడ........ కదలవే కదలవే కొత్త మార్గాలకై.......' అన్నారు పురోగమిస్తూ ఆరుద్ర. ఇది ఈ సంకలనానికి నాందీ ప్రస్తావనగా ఎంచుకుంటే 'విత్తనంలోకి మళ్లీ వెళ్లిపోస్తిమంటావా? ఎత్తి నా గొంతుక ఏడ్చేమంటావా?' అనేది పైలాపచ్చీసు గేయ ప్రాయాన్ని ముగించే ఆరుద్ర వింత కోరిక!

ఆరుద్ర కవిత్వంలో దీటయిన మాటలు, శ్లేష గల ప్రాసలు మైలురాళ్ళు. మాటమీద మాట పడుతున్నప్పుడు, ప్రాసలలో ప్రాస దొర్లుతున్నప్పుడు భావము దానికదే మాటల్ని, ప్రాసల్ని వెదుక్కుంటూ పరుగెత్తుకు వస్తుంది. కవిత్వం భావప్రధానమైనదిగా వెలుగులోకి వస్తుంది! ఇది ఆరుద్రకవిత్వంలోని గొప్ప తనం.

ఇరవయ్యయిదు ఏళ్లనాటి ఆరుద్రకి, ఈనాటి ఆరుద్రకి అభ్యుదయ భావాల ముద్రలోగాని, ఆశయసిద్ధిలోగాని ఎక్కడా భేదభావం స్ఫురించదు. పైలపచ్చీసు నోట ఏమాట పలికిందో అదే పాటగా ఇప్పుడు పలుకుతున్నది. ఇందుకు కి. శే. దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారి అంచనా ఒక ఉదాహరణ.

25 గేయాలతో కూర్చిన పైలాపచ్చీసు తమకి షష్ఠిపూర్తి కానుకగా సమర్పించడం సముచితంగా వుందని శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు తమకి తాముగా ఆనందించారు. గేయ కవిత్వ సంకలనాలకి ఉదయించిన మరో తార ఆరుద్ర పైలాపచ్చీసు. ఆరుద్ర కవిత్వానికి ఇదొక మెరుపులేని ముద్రణ.

—సికరాజు

## ధన్యభిక్షువు

**హిందీమూలం:** శ్రీ ఆరిగపూడి. **అనువాదం:** శ్రీకాళీపు వీరభద్రుడు, క్రౌను 250 పుటలు. వెల నాలుగు రూపాయలు. ప్రకాశకులు: దేశీ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, శరత్ బిల్డింగ్స్, విజయవాడ—2.

శాతవాహనుల నాటి దేశచరిత్రకు సంబంధించిన నవల ఇది. ఆంధ్ర చక్రవర్తి యజ్ఞశ్రీ శాతవాహనుడికీ, రుద్రదమనుడికీ జరిగిన యుద్ధాల నాటి దేశపరిస్థితి పడమట కనుమలలో నాసిక దగ్గర నుంచి తూర్పుకనుమల్లోని ధన్యకటకం వరకూ ప్రజల జీవితం, గ్రామాల పరిస్థితి, సైనికుల అత్యాచారాలూ, చేసేదిలేక ఆత్మరక్షణ కోసం, ఆత్మీయులను రక్షించడం కోసం యువకుల్ని సైనికులకు స్వాధీనం కావడమూ, గ్రామీణ్యులకు గల శిల్పకళాభినివేశమూ, దేవాలయ నిర్మాణోత్సాహమూ ఇందులో చిత్రించబడ్డవి. కథాంశాన్ని బట్టి చూస్తే ఆకాలంలో సైనిక పరిపాలనే అమలులో ఉన్నట్లూ, సైనికులు ప్రజలను చిత్రవధ చేసినా, గ్రామాలను కాల్చివేసినా, దేవాలయాలను పడగొట్టినా, అమూల్యమైన శిల్పకళను ధ్వంసం చేసినా, ధనధాన్య సంపదను కొల్లగొట్టినా రాజులు కలుగజేసుకున్నట్లు లేదు. చరిత్రకంగా యిది ఎంత యథార్థమో తెలియదు కాని, పుస్తకాన్ని చదువుతూ వుంటే శాతవాహనుల యుగంలో మనం వున్నట్లు భ్రాంతిని కలుగజేస్తుంది.

అగ్నివర్మ అనే అనార్యుడు ఆర్యుడైన శిల్పాచార్యుని వద్ద శిల్పకళను నేర్చుకున్నాడు. గురుపుత్రి అయిన మైత్రేయిని ప్రేమించాడు. ఈ సంగతి తెలిసి ఆర్యులు రాళ్లతో కొట్టి అగ్నివర్మను నాసిక నుంచి తరిమి వేశారు. పిడికిట్లో ప్రాణాలు పెట్టుకుని అతడు ఒక గ్రామం వచ్చాడు. అక్కడి గ్రామికుని ఆశ్రయం సంపాదించి దేవాలయ నిర్మాణానికి పూనుకున్నాడు. గ్రామికుని కొడుకు ధనంజయుడు పుష్పవల్లి అనే యువతితో స్నేహం చేసి వినోదిస్తూ వుండేవాడు. ఆమె మనస్సు అగ్నివర్మ మీదికి మళ్లిన సంగతి గ్రహించడు. అదే సమయంలో గ్రామికుడు దేవాలయానికి మంచి కలశాలు తేవడానికి అగ్నివర్మను ప్రతిష్ఠానం వెళ్లమన్నాడు. ప్రతిష్ఠానానికి వెళ్లి అగ్నివర్మ కలశాలు తెచ్చాక, అతన్ని ఊళ్లో ఉండనివ్వకుండా ధనంజయుడి జట్టువాళ్లు రాళ్లతో కొట్టి వెంట తరిమారు. అతడు ప్రతిష్ఠాననగరానికి వెళ్లాడు. ఈలోగా రుద్రదమనుడి సైనికులు వచ్చి గ్రామికుడు ధనంజయుడు మొదలైనవారిని చంపి గ్రామాన్ని దహించి, దేవాలయాన్ని పడగొట్టారు. పుష్పవల్లి సైనికులను సంతోషపరచి ప్రాణాలను దక్కించుకొని ప్రతిష్ఠానానికి వెళ్లింది. ఆమె రుద్రవర్మ యెడల అనురాగాన్ని ప్రకటించింది. కొన్నాళ్లు అతనితో కలిసి ఉన్నది. ఆమె గర్భవతిగా ఉన్నప్పుడే రుద్రవర్మ ఆమెను విడిచిపెట్టి ధన్యకటకానికి ప్రయాణమవుతాడు. అతనికి మైత్రేయి కనబడుతుంది. ఆమె రుద్రవర్మ సహాధ్యాయుడు కీర్తిమంతుణ్ణి వివాహం చేసుకుంటుంది. ధన్యకటకంలో కీర్తిమంతుడు జీవిక కోసం మైత్రేయిని వేశ్యావృత్తిలోకి దింపుతాడు. ఈ పరిస్థితి చూచి అగ్నివర్మకు ధన్యకటకంలో కూడా ఉండ బుద్ధి పుట్టలేదు. దానికి సమీపంలో ఉన్న కొండలో శిల్పాలు చెక్కుతూ ఉంటాడు

అదృష్టవశాత్తూ అగ్నివర్మకి నాగార్జునాచర్యుల వారి శిష్యుడు చైతన్య భిక్షువుతో పరిచయం కలిగింది. అతని మూలంగా ఆచర్యుల వారి దర్శనం చేసుకుని ఆయన వాత్సల్యానికి, ప్రోత్సాహానికీ పాత్రమై ఇప్పటి నాగార్జునకొండలో అనేక అద్భుత శిల్పాలను మలిచాడు. ఆ శిల్పాలను యజ్ఞశ్రీ శాతవాహన మహారాజే ఆవిష్కరించడం జరిగింది కూడా.

అగ్నివర్మకూ, పుష్పవల్లికీ కలిగిన పుత్రికను యశోధరను నాగార్జునాచర్యుల వారే పెంచడం ఒక విశేషం. తల్లి నదిలో పడి ఆత్మహత్య చేసుకోగా, ఒడ్డున వున్న పసిబిడ్డను గ్రామస్థులు ఆచర్యుల వారికి అప్పగించారట! ఈ విషయాలు ఆచార్యుల వారు అగ్నివర్మకు చెప్పగా, అతడు తన వృత్తాంతం యావత్తూ ఆయనకు చెప్పి, ఆ బాలికను తన సంరక్షణలోకి తీసుకున్నాడు. ఆచర్యుల వారి ఉపదేశం వల్ల మనశ్శాంతి పొంది బౌద్ధ ధర్మాన్ని స్వీకరించాడు. అప్పటివరకూ జీవితాన్ని దుఃఖమయంగా గడిపిన, ప్రశాంతమనస్కుడై ధన్యజీవియై ధన్యభిక్షువు అయాడు.

ఇది చరిత్రకమయినా, చరిత్రతో దీనికి ఎంతవరకూ, ఎట్టి సంబంధం వున్నదీ తెలియదు. దాన్ని గురించి యిందులో ఏమీలేదు. ఆకాలపు మత పరిస్థితులనూ, జనుల జీవితాన్నీ, స్త్రీల ప్రవర్తననూ, ప్రభుత్వాన్ని గురించి తెలుసుకోడానికి యిట్టి పుస్తకాలు ఉపయోగపడేటట్లు ఉండలి.

ఇది అనువాదమని రచయిత చెప్పకపోతే స్వతంత్ర రచనగానే పాఠకులు అనుకోవలసి ఉండేది. ఇది అనువాదకుని రచనా పాటవానికి మెచ్చు. కథాకథన నైపుణ్యం శ్రీ ఆరిగరేవులవారి మూలం వైశిష్ట్యాన్ని తెలుపుతున్నది. లబ్ధ ప్రతిష్టులయిన శ్రీ రమేశ చౌదరిగారి రచన హృదయంగమంగా వుండడంలో ఆశ్చర్యంలేదు. శాతవాహనుల కాలంనాటి దేశస్థితినీ, రాజకీయాలనూ తెలుసుకోడానికి ఈ నవల మిక్కిలి ఉపకరిస్తుంది.

—అంగీరస.

## ఆటలు

# జాతీయ హాకీపోటీలో రైల్వే జట్టు విజయం



హాకీ జాతీయ ఛాంపియన్ షిప్‌లో భారత రైల్వే జట్టు ఫిబ్రవరి 24 న జరిగిన ఫైనల్స్‌లో ఒక్క గోల్ తేడాతో మైసూర్ జట్టును ఓడించి రంగస్వామి ట్రోఫీని సాధించింది. మైసూర్‌కి ఫుట్‌బాల్ ఛాంపియన్ షిప్ ఉన్నా హాకీలో ఫైనల్స్‌కి రావటం యిదే మొదటిసారి. రెండు పెద్ద ఆటలలో మైసూర్‌కి సామర్థ్యం ఉండటం చెప్పుకోదగిన విషయం.

రైల్వే జట్టు పురోగమనానికి సుందర్‌సింగ్ తోడ్పడ్డాడు. మరొక సెమీ ఫైనల్స్‌లో బొంబాయిపై మైసూర్ విజయాన్ని సాధించడానికి ఆనంద్ చేసిన గోల్ ఉపకరించింది.

రైల్వే జట్టు ఎన్నోసార్లు గెలవడం, గత సంవత్సరాల్లో కొన్నిమార్లు సర్వీసెస్ విజయాన్ని సాధించడానికి వారి నిర్విరామమైన ఆట, సునిశితమైన శిక్షణలే కారణం. అలాంటి శిక్షణ, ఆట కొన్ని సంస్థల బృందాలు మాత్రమే సాధించగలవు. ఇక్కడ ఒక సమస్య, అది వివాదాస్పదమైనదైనా నేను కూడా ఆ సమస్యను లేవదీస్తాను. అసలు జాతీయ ఛాంపియన్ షిప్ అన్నది ఘన విజయాన్ని సాధించిన రాష్ట్రాన్ని ఎన్నుకోడానికి ఉద్దేశించినది. అన్ని ప్రాంతాలనుంచీ, ఎంత దూరమైనా, బృందాలు వస్తాయి. కానీ సర్వీసెస్, రైల్వేలు ఆటగాళ్లని ఆకర్షించి క్రీడారంగంలోని అగ్రతారలను తమలో తీసుకుంటాయి. వర్తమాన క్రీడాకారులలోనుంచి రాష్ట్రాలు తమ బృందాలలోకి ఆటగాళ్లని ఎన్నుకుంటాయి. కాని ఈ ఆటగాళ్లు ఆటకి పూర్తికాలాన్ని వినియోగించ వీలుపడదు. పెద్ద ఆటగాళ్లకి ఉద్యోగాలు యిచ్చి రైల్వేలు, సర్వీసెస్ క్రీడారంగానికి, క్రీడాకారులకి ప్రోత్సాహాన్నిస్తున్న విషయం ఒప్పుకోవాల్సిందే కానీ వారు జాతీయ పోటీలలో పాల్గొనటంద్వారా యితర రాష్ట్ర బృందాలని నిరుత్సాహపరుస్తున్నారు. వారిలోవారికి ఇంటర్ రైల్వే, ఇంటర్ సర్వీసెస్ పోటీలు ఉన్నాయి. వాటిలోవారు సామర్థ్యాన్ని, నైపుణ్యాన్ని ప్రదర్శించి ట్రోఫీలని పొందవచ్చు. కానీ జాతీయ పోటీలో ప్రవేశాన్ని కల్పించడం వారికి ఎంతో అవకాశాన్ని యిచ్చినట్లవుతుంది. అనేక చోట్ల (ఇతర సంస్థలలో పెద్ద ఉద్యోగాలు ఉన్న ఆటగాళ్లు తప్ప) రాష్ట్రబృందాలు అంత పటిష్టంగాలేవు.

జాతీయ ఛాంపియన్ షిప్‌ని రాష్ట్ర జట్లకి పరిమితం చేస్తే అన్ని బృందాలవారికీ చక్కని అవకాశం లభిస్తుందని నా సూచన.

* * *

ఫిబ్రవరి 27 న క్రిస్ట్‌చర్చిలో భారతదేశం మొట్ట మొదటిసారిగా న్యూజిలాండ్ చేతిలో ఓడిపోయి అంతర్జాతీయ క్రికెట్‌లో అట్టడుగుకి పోయింది. డవులింగ్ చేసిన 239 పరుగులు న్యూజిలాండ్ గెలుపుకి ముఖ్య కారణం. పాటవుడీ నవాబు టాస్ గెల్చినా న్యూజిలాండ్‌ని బాట్ చేయమని కోరి పొరపాటు చేశాడు. మోట్జ్, బార్‌లెట్‌ల బంతి విసురు ధాటికి భారత బాట్స్‌మెన్ నిలవలేకపోయారు. వారిద్దరు రెండు ఇన్నింగ్స్‌లో చెరి ఆరు వికెట్లు పడగొట్టారు.

* * *

ఇండియాలో పర్యటిస్తున్న అంతర్జాతీయ క్రికెట్ బృందం బొంబాయిలో జరిగిన పి. కె. నాయుడు మెమోరియల్ మాచ్‌లో 182 పరుగుల తేడాతో ఇండియా జట్టుని ఓడించింది. ఆ బృందానికి ఎమిస్, ఫ్లెచర్‌లు శతాల్ని సాధించిపెట్టారు

—కె. ఎస్. నరసింహన్

## మెదడుకి మేత

(౧)



(౨)



(౩)



(౪)



(౫)



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# క్రొత్త అమూల్ సమర్పణ

# అమూల్‌స్ప్రే

## ప్రోటీనులు అధికంగాగల శిశువాహారం

ఇతర క్షీరాహారమెందులోను శరీర నిర్మాణక ప్రోటీనులు
ఇంతకు మించి లేవు





### పెరుగుదలకు ప్రోటీనులు

మొదటి రెండేళ్ళలో, బిడ్డ తన బరువును నాలుగురెట్లు అధికం చేసుకొంటూ త్వరత్వరగా పెరగాలి ఈ పెరుగుదలలో ఎక్కువ భాగం ప్రోటీనులవల్లనే వస్తుంది. మీ బిడ్డ పుష్టిగా, బలంగా పెరుగుటకు కావలసినశరీర నిర్మాణక ప్రోటీనులన్ని అమూల్ స్ప్రేలో ఉన్నాయి

### సులభంగా జీర్ణమవుతుంది

అమూల్ స్ప్రే తయారు చేయబడిన స్ప్రే డ్రయింగ్ పద్ధతి ద్వారా ప్రతి యొక్క పాలచుక్క అతి సూక్ష్మపుటణువుగా (తల్లిపాలవలెనే) మారు తుంది. ఇందువల్ల, అమూల్ స్ప్రే తేలికగా జీర్ణమవుతుంది. బిడ్డ కూడా దాని మధురమైన రుచిని యిష్టపడి మొదటి నుండే దాని పుచ్చుకొంటాడు.





### విటమినులు, తదితర మంచి పదార్థముల చేరిక

అమూల్ స్ప్రేలో మీ బిడ్డకు కావలసిన విటమినులన్ని ఉన్నాయి. పిండి పదార్థాలు, క్రొవ్వు పదార్థాలు ఇంకా భాస్వరము, ఇనుమువంటి ముఖ్య పోషక పదార్థాలు ఇందులో ఆదర్శప్రాయంగా సంతులితముగా నింపబడి యున్నాయి. నైయసిన్, సోడియం బయోడైడ్, ఫోలిక్ ఏసిడ్ మొదలైనవి వాని వాని సహజస్థితిలోనే ఉన్నాయి.

### ఆధునిక స్ప్రే-డ్రయింగ్ పద్ధతి

అమూల్ స్ప్రే యూరోపా, అమెరికాలలో ఉపయోగించే స్ప్రే-డ్రయింగ్ పద్ధతి ననుసరించి చేయబడుతుంది. ఈ మెరుగు పద్ధతి వలన తక్కువ శీతోష్ణపరిమాణంలో పాలు పొడిగా మారుతుంది. అందుచేత, ప్రోటీను యొక్క నాణ్యత, సమృద్ధి ఎక్కువ భద్రపరచబడి యుంటుంది.






అమూల్ స్ప్రే మీకు
500 గ్రాముల డబ్బాలో
(1 పౌను మీద 46 గ్రాములు
ఎక్కువ) దొరుకుతుంది.

### సులభంగా కరుగుతుంది

ముందు పేస్టుగా చేసుకోనక్కరలేదు. అమూల్ స్ప్రే సరియైన కొలతలో తీసుకొని కావలసినన్ని వేడినీళ్ళలో చేర్చి బాగా కలపండి. పాలపొడి వెంటనే కలిసిపోతుంది. పాలపీకకు అడ్డుకోదు.

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
వోల్టాస్ లిమిటెడ్. తయారీ: కైరా డిస్ట్రిక్ట్ కో-ఆపరేటివ్ మిల్క్ ప్రొడ్యూసర్స్ యూనియన్ లిమిటెడ్, ఆనంద్.

